# పరిచయం

లూయీఫిషర్ వ్రాసిన యీ పుస్తకం, గాంధీగారితో వారం రోజులు గడిపి వచ్చిన అమెరికన్ పత్రికా విలేఖరియొక్క అభిప్రాయాల సంపుటి మాత్రమే. కాంగ్రెస్ పార్టీని, గాంధీగారిని, బలపరచను వ్రాయబడినదన్న దృష్టితో యీ పుస్తకాన్ని చదువ గూడదు. ఇండియా నాయకులలో ఉత్త మోత్తమునితో గడపిన వారం రోజుల అనుభవాల వివరణగా మాత్రమే యీ పుస్తకం పరిగణింప బడాలి. గాంధీగారిని మనలో చాలమంది అర్థం కాని వ్యక్తిగా భావిస్తారు. గాంధీగారిని భారతీయ రాజకీయ పరిస్థితుల నడుమ చిత్రించడంవల్ల సహజంగా ఆయన ఎట్టివాడైనది యీ పుస్తకం విశద పరుస్తుంది. ఈ రోజుల్లో కొందరు గాంధీగారిని మితిమీరి భూషిస్తు న్నారు. మరి కొందరు అతి నీచంగా దూషిస్తున్నారు. గాంధీగారిని చక్కగా అర్థం చేసుకోను యీ పుస్తకం యెంతో వుపయోగపడుతుంది. అనేక విషయాల్లో పాఠకులు గ్రంథ కర్త భావాలతో ఏకీభవించక పోవచ్చు. కాని గాంధీగారిని అర్థంచేసుకోను యీ రచన ఎంతో ఉపకరించగలదు.

కారల్ హీంత్,

# రచయిత తొలినుడి

ఈ చిన్న పుస్తకం ప్రచురింపబడడం నా తప్పుకాదు. గాంధీజీతో నేను గడపిన వారం రోజుల వివరాలను జాగ్రత్తగా వ్రాసి వుంచాను. అమెరికాకు మరలి వచ్చిన పిదప ఆ కాగితాలను పారవేసుకుంటానేమో నన్న భయంచేత వాటిని, విపులంగా, వ్రాసివుంచాను. ఈ వ్రాత ప్రతిని స్నేహితులనేకులు చూచారు. ఉన్నది వున్నట్లు సంపూర్ణంగా ప్రచురించమని బలవంత పెట్టారు. నా ఇండియా పర్యటనాన్ని యీ వ్రాతప్రతి పూర్తిగా ప్రతిబింబించ లేదని, అందువలన అరకొరగా వుంటుందని వాదించాను. ఇండియాలో నున్నప్పుడు మరికొందరు ప్రముఖులతో సంభాషించానని, ఆ సంప్రదింపులన్నీ యీ వ్రాతలో లేవని అన్నాను. గాంధీగారిని గురించి మాత్రమే వ్రాయబడిన పుస్తకం ఇండియాను గురించి వ్రాయబడిన పుస్తకమౌతుందా ? అనిగూడా వాదించాను. "అదంతా సరే ! తొలిపలుకులో యీ విషయాన్ని వ్రాయి" అని ఎదురు వాదనను ప్రారంభించారు. అందుకే యీ తొలినుడి.

గాంధీగారితో నేను సంభాషించినప్పుడు నూతన అనుభవాలను పొందాను. అవి కేవలం కొత్త అనుభవాలే కావు. మహత్తర అనుభవాలు కూడాను. "ఇండియాలో మహత్తర శక్తి గాంధీయే" అని న్యూ ఢిల్లీలోని వైస్రాయి, లిన్‌లిత్‌గో ప్రభువు, నాతో అన్నాడు. ఇది సత్యమే. గాంధీజీ ఒక మహత్తర శక్తియే. ఆయన వ్యక్తిత్వంతో, మనస్సుతో సంబంధం కలగడం ఒక మహత్తర అనుభవం. ఆయన నాతో చెప్పినదానినల్లా షార్ట్ హాండ్‌లో జాగ్రత్తగా వ్రాసుకున్నాను. ఈ పుస్తకంలో దానినంతటిని పొందుపరచాను. గాంధీజీని గురించి నా విమర్శ యీ పుస్తకం కడపటనొక చిన్న అధ్యాయంగా చేర్చాను.

## జూన్ 3, 1942

నేడురాత్రి 8-30 నిమిషాలకు వార్ధాచేరాను. వార్ధా మధ్యపరగణాలలో ఒక చిన్నపట్టణం. నేను న్యూఢిల్లీనుంచి ఎక్స్‌ప్రెస్ బండిలో బయలుదేరి వచ్చాను. ఆ ఎక్స్‌ప్రెస్ బండిలో యిరవై ఐదుగంటలు ఎండలో, దుమ్ముతో గడిపాను. పదిరోజులక్రితం గాంధీజీని నేను కలుసుకునే ఏర్పాటు చేయుమని జవహర్‌లాల్ నెహ్రూను కోరాను. కొద్దిరోజుల పిదప గాంధీజీ నన్ను కలుసుకోను అనుమతించారని వార్ధా నుంచి నెహ్రూ నాకు వ్రాశారు. గాంధీగారిని కలుసుకోను వేళ, రోజు నిర్ణయించుకోను గాంధీగారి కార్యదర్శి మహదేవ్ దేశాయ్‌గారికి వ్రాయుమని నెహ్రూ సలహా నంపారు. నేను దేశాయిగారికి వ్రాశాను— ఏ రోజైనాసరే, యే సమయమైనాసరే, నేను సిద్ధంగా నున్నానని. "ఆహ్వానం! రావలసింది" అని మహదేవ్ దేశాయ్‌గారు తంతి నంపారు.

వార్ధాలో నేను బండి దిగుతూ వుండగానే తెల్లబట్టలు ధరించిన యువకు డొకతను నావద్దకువచ్చి నేను ఫిషర్‌నా అని అడిగాడు. నేను అవునని చెప్పాను. గాంధీగారు నన్ను కలుసుకోను తనను పంపినట్లు చెప్పాడు. మాకోస మొక టాంగా గాచుకొనివుంది. టాంగా అంటే రెండుచక్రాల, ఒంటి గుఱ్ఱపుబండి. ఈ బండిలో ప్రయాణీకులు బండివాని వైపు తమ వీపులనుంచి కూర్చోవాలి. ఆ చీకటిలో ఊరి వెలుపలికి టాంగాలో వెళ్ళాము. మేము చేరిన భవనం శ్రీ జమన్‌లాల్ బజాజ్‌గారు కాంగ్రెస్‌పార్టీ ఉపయోగార్థం యిచ్చినది. నేను మేడమీద ఆరుబైట పరున్నాను. ఆ రాత్రి అంతా నారింజ-తెలుపు-పచ్చరంగులుగల కాంగ్రెస్ జెండా గాలికి కొట్టుకుంటూ వున్నది.

జూన్ 4, 1942

నేను పెందలకడనే లేచాను. గాంధీగారి దంతవైద్యుడూ, నేనూ టాంగాలో సేవాగ్రామానికి బయలుదేరాం. గాంధీజీ జైలు వెలుపల నున్నప్పుడు యీగ్రామంలో నివసిస్తారు. ఇంగ్లండు తను పరిపాలిస్తున్న ప్రజలను అర్థంచేసుకోలేకుండా వుందని నాతో వచ్చిన దంత వైద్యుడు అన్నారు. గాంధీగారిని గురించి ఆయనచేత మాట్లాడించాలని ప్రయత్నించాను. కాని ఆయన యెంతసేపటికి రాజకీయలే మాట్లాడారు.

టాంగా ఆగింది. నేను టాంగా దిగాను. నా ఎదుట గోధుమ వన్నె — పొడవుమనిషి — గాంధీజీ నించొని వున్నారు. నేను పెద్ద అంగ లేసుకుంటూ వడిగా వారివద్దకు వెళ్ళాను. ఆయన కిరువైపుల యిద్దరు స్త్రీలు



గాంధీజీ షికారు వెళ్లుతున్న దృశ్యం

Courtesy *Time*—New York.

నడుస్తున్నారు. వారి భుజాలమీద తన చేతులువేసి ఆయన నడుస్తున్నారు. ఆయన మోకాలివరకే గుడ్డకట్టుకొని వున్నారు. మోకాలినుంచి బట్టలేని సన్నని కాళ్ళు కనుపించుతునే వున్నాయి. ఆయన పాదాలకు చెప్పులు, భుజాలమీద గుళ్ళగుడ్డ ఒకటి, నెత్తిన మడతవేయబడిన తెల్లని రుమాలు వున్నాయి. నన్నుచూడగానే ఆంగ్లంలో, స్వచ్ఛమైన ఆంగ్లేయుల ఉచ్చారణతో "ఫిషర్‌గారూ!" అన్నారు. కరస్పర్శ జరిగింది. గాంధీగారు దంతపై ద్యుడ్ని పరామర్శించి, వెనక్కు తిరిగారు. ఆయనకూడా నేనూ—ఒక బల్లదగ్గరకు వెళ్ళాం. గాంధీజీ ఆ బల్లమీద కూర్చొని "కూర్చోండి" అంటూ ఆ బల్లమీదే నాకూ జాగా చూపారు. "జవహర్‌లాల్ మీ పుస్తకాన్నిగురించి చెబుతూ మీ రెటువంటివా రైంది చెప్పాడు. మీ రిచ్చటికి రావడం మా కందరికి సంతోషం. ఎంతకాలముంటా రిచ్చట?" అన్నారు గాంధీజీ. కొద్దిరోజు లుండగలనని వారితో చెప్పాను.

"అలాగా! అయితే మనం చాలా విషయాలు మాట్లాడుకోవచ్చు" నన్నారు గాంధీజీ.

ఇంతలో ఒక యువకుడు గాంధీజీ వద్దకువచ్చి ఆయన పాదాలకు మ్రొక్కాడు. వెంటనే గాంధీజీ "బస్, బస్," అన్నారు. ఈ మాటల కర్థం "చాలు, చాలు" అని అనుకున్నాను. నా ఊహ నిజమేనని తర్వాత తెలిసింది. ఇంతలో మరి యిర్వురు యువకులువచ్చి గాంధీజీకి మ్రొక్కారు. వారినిగూడా గాంధీజీ మందలించారు.

గాంధీజీ తన నివాసం యీ గ్రామంలో యెందుకు ఏర్పాటుచేశారని అడిగాను. ఫలానావారు—ఆయనేదో పేరు చెప్పారుగాని నా కర్థం కాలేదు—తాను నివసించడానికి యీ గ్రామాన్ని ఏరుకున్నారని గాంధీజీ అన్నారు. నేనేమి బదులుచెప్పలేదు. ఆయన చెప్పిన పేరు నాకర్థంగాలేదని గ్రహించారు. అందువల్ల విశదీకరించారు. మీరాబెన్ ఆంగ్ల యువతియని, ఆమెపేరు మిస్ స్లేడ్ అని, ఆమె చాలాకాలంగా తనతోపాటు పనిచేస్తూందని అన్నారు. ఇండియా మధ్యన ఒక గ్రామంలో

గాంధీజీ నివసించాలని ఆమె కోర్కెట. అందుకని అట్టి గ్రామాన్ని వెతికిపెట్టుమని గాంధీజీ ఆ భారాన్ని ఆమెకే అప్పగించారట. గ్రామం లోపల నివసించడం గాంధీజీకి యిష్టంలేదు. గ్రామంలో గోలగా వుంటుంది; అనారోగ్యకరంగా వుంటుందిగూడాను. "ఇచ్చట (ఊరి వెలుపల) ఊళ్ళోకన్నా మేలుగా వుంటుంది" అన్నారు గాంధీజీ. దంత వైద్యుడు అతుకు—పళ్ళను గురించి మాట్లాడ నారంభించారు. తాను అతుకు బెట్టుకున్న పళ్ళు సరిగాలేవని గాంధీజీ, వైద్యునితో చెప్పారు. ఇంతలో ఒకామె ఇత్తడి చెంబుతో నీళ్ళు, మూడురకాల అతుకుబెట్టిన—పళ్ళు తెచ్చింది. నేను అచ్చటినుంచి బయలుదేరాను. "మీరు సాయంవేళ నాతో వాహ్యాళికి వస్తారుగా! మాట్లాడడానికి మనకు యితర అవకాశాలు గూడా వుంటాయి" అన్నారు గాంధీజీ. నమస్కరించి, వెళ్లిపోయాను.

సేవాగ్రామం అతిధిగృహంలో నాకు బస ఎర్పాటుచేశారు. ఈ అతిధిగృహం కేవలం ఒకగది, మట్టినేల, వెదురు బద్దల కప్పు కలిగి యున్న మట్టిగుడిసె. ఆ గదిలో అనేక పడకలువేసి వున్నాయి. ఈ గదిలోనుంచి అవలికి వెళ్ళిన చిన్న వంటయిల్లు, రాళ్ళు పరిచిన స్నానపుగది ఉన్నాయి. ఆ స్నానపు గదిలో రెండు రేకుతొట్లు, అనేక యిత్తడి, రేకు బొక్కెనలు వున్నాయి. ఆ వూరి బావినుంచి పనిమనిషి ఒకామె నీళ్ళు నెత్తినతెచ్చి యీ తొట్లను, బొక్కెనలను నింపుతున్నది. నేను కుర్షిద్ బెన్ పోషణలో నుంటానని గాంధీజీ చెప్పారు. ఆమె పూర్తిపేరు కుర్షిద్ నౌరోజీ. ఆమె అవివాహితురాలు. ఆమెకు షుమారు నలభైఏండ్లు వయస్సుంటుంది. ఆమె చేతితో వడికి, చేతితో నేసిన ముతక పసుపు చీర కట్టుకొనివుంది. ఆమె ఫ్రాన్స్, ఇటలీలలో ఆరేండ్లపాటు సంగీతం నేర్చుకుంది. పదిహేనేండ్లక్రితం తన సంగీతధోరణిని వదలివేసింది. అప్పటినుంచి గాంధిజీ శిష్యురాలైంది. ఆమె కోటీశ్వరుల కుటుంబానికి చెందినది. ఆమె తాత దాదాభాయ్ నౌరోజీ. ఆయన తొంభైఐదేండ్లు బ్రతికి గడచిన యుద్ధపురోజుల్లో (1914—1918) చనిపోయారు. బ్రిటన్‌లోని

ప్రజా ప్రతినిధి సభకు ఎన్నుకోబడిన ప్రధమ భారతీయుడు దాదాభాయ్ నౌరోజీయే. బ్రిటిష్‌పార్లమెంటు సభ్యత్వానికి ఎన్నుకొనబడిన వారిలో మూడవతను—కడపటి వాడుగూడా పార్సీయే. అతని పేరు శక్లత్‌వాల. అతడు కమ్యూనిస్టు.

కుర్షిద్ బెన్ చాల తెలివైనది; చురుకైనది గూడాను. ఇండియాలో అనవసరంగా జాతీయత కెక్కువ ప్రాధాన్య మిస్తున్నారని ఆమెతో వాదించాను. స్వతంత్ర భారతదేశం ఫాసిస్టు కావచ్చునని, అప్పుడు బ్రిటిష్ పరిపాలనలోనున్న స్వాతంత్ర్యమైనా భారతీయులకు ఉండదని వాదించాను, నా వాదన నామె ఒప్పుకోలేదు. ముందు బ్రిటిష్ వారు బయటకి వెళ్ళితే, తమ సమస్యలన్నిటిని భారతీయులు పరిష్కరించుకో గలరని ఆమె వాదన. "మేము స్వతంత్రంగా నుండాలని మాకోర్కె. ఇతరులు మాదేశంలో వుండగూడదని మా అభిమతం. మా గతి ఎలా వుందంటే ఇంటికొచ్చిన అతిధిలు వెళ్ళిపొమ్మన్నా వెళ్లిపోకుండా చిర కాలం కూచుంటే యింటి యజమానురాలు గతి యెలావుంటుందో అలా వుంది. వాళ్ళు వెళ్ళిపోవాలని ఆమె ఆయాస పడుతూ వుంది. వీధి గుమ్మం గుండా యీ అతిధిలు వెళ్ళిపోయే పుణ్య కాలం తప్ప ఆమెకు మరేమీ తోచదు" అన్నది కుర్షిద్ బెన్.

గాంధీజీ ఆశ్రమ వాసులు చాలమంది దగ్గరకు నన్ను తీసుకెళ్ళింది యీామె. కాంగ్రెస్ ప్రచారకులూ, గాంధీజీ కార్యదర్శులు, గాంధీగారిని దర్శింపవచ్చి కొద్ది రోజులు ఆశ్రమంలోవుండేవారు తప్ప యితరు లెవ్వరూ ఆశ్రమంలో లేరు. వీరందరూ ఇండియా మారుమూలల నుంచి వచ్చినవారు. వీరు అందరూ ఒకే భాషను వాడరు. అందువల్ల వీరిలో కొందరు పరస్పరం ఇంగ్లీషునే వాడుతారు. ఆశ్రమంలో పిల్లలు అందంగానున్నారు. నేను మహాదేవ్ దేశాయ్‌గారి గుడిసెవద్ద ఆగాను. బట్ట తల, కాస్తలావాంటి శరీరం—ఆయన మోకాలి వరకు మాత్రమే బట్ట కట్టుకొని ఉన్నారు. నేలమీద చాపపై కూర్చొని పాతకాలపు చర్ఖామీద

నూలు తీస్తున్నారు. ఆ ప్రక్కగదిలో ఆయన భార్య ఉన్నది. ఆమె అతి పొడవైన చీరను చుట్టి, చుట్టి కట్టుకోనుంది. ఆమెకూడా వడుకుతునే వున్నది. దేశాయ్‌గారు రోజుకు 500 గజాల నూలు వడుకుతారు. చర్ఖా చాల చౌకైన వస్తువు. ఏరైతుగాని దానిని చేయవచ్చు! కొనవచ్చూ. తాను ప్రయాణాలెక్కువగా చేస్తూ వుంటాడని, రైల్లో గూడా వడుకుతూ వుంటాడని దేశాయ్‌గారు చెప్పారు. కాని రైల్లో వడికేవాళ్ళను, యితరుల నెవ్వరిని తాను చూడలేదట. ఇండియాలో కోట్లాది జనం నేటికి గూడా కట్ట బట్టలేకుండా వున్నారు. ఈ కోట్లాది జనానికి కావలసిన బట్టను ఉత్పత్తిచేయను గ్రామ పరిశ్రమల నభివృద్ధి పరచవలెనని, గ్రామ పునరుద్ధరణను గాంధీజీ ప్రారంభించారు. గాంధీగారిని చూచి, ఆయన ప్రచారాన్ని విని యీనాడు లక్షలాది భారతీయులు నూలు వడుకుచున్నారు. "కాని నూలు వడికే అలవాటు దేశమంతట వ్యాపించలేదు. చేత నూలు వడకడం మాదేశ ఆర్థిక విధానంలో ఇంతవరకు ఒక అంశం కాలేకున్నది" అని దేశాయ్‌గారు ఒప్పుకున్నారు.

పదకొండు గంటలైంది. నాకు ఆకలి యెక్కువైంది. గాంధీజీ బస నాబసకు వంద గజాలలోనున్నది. కుర్షిద్‌బెన్ నన్ను గాంధీజీ బసకు తీసుకెళ్ళింది. గాంధీజీ ఇల్లు తడికల ఇల్లు. ఎర్రపెంకులతో కప్పబడి ఉంది. వెదురు చాపలు గట్టారు. గోడలకు బదులుగా, ఇంటి ముందు వసారా, ఇంట్లో వెనకవైపున పెద్దగది, ముందువైపు చిన్నగది వున్నాయి. వాకిట సిమెంటు గడపమీద నా చెప్పులు వదలి, ముందు వైపున్న చిన్న గదిలోకి వెళ్ళి కూర్చున్నాను. ఈ గదిలోనుంచి ప్రక్కనున్న పెద్దగదిలో యేం జరుగుతూందో చూడగలిగాను. గాంధీజీ నేలపైన తెల్లటి చాపమీద పరున్నారు. ఆయన శిష్యులలో నొకరు ప్రక్కన కూర్చొని పంకా లాగుతున్నారు. ఈ పంకా చూరునుంచి వేలాడుతూంది. నల్లగుడ్డ వ్రేలాడుతూంది యీ పంకా కొసన. ఈ పంకా ఎలక్ట్రిక్ పంకాకు బదులు ఉపయోగింప బడుచున్నది. ఈ గ్రామంలో విద్యు

చ్ఛక్తి లేదు. గాంధీజీ లేచి వచ్చారు. "మీరు పాదరక్షలు తొడుగుకోండి, టోపీ పెట్టుకోండి, వెళదామ్. ఇక్కడ యీ రెండు అనివార్యాలు. లేకుంటే యెండ వడ తగులుతుంది" అన్నారు గాంధీజీ. గళ్ళగుడ్డ నొక దానిని ఒకామె తడిపి, మడిచి గాంధీజీకి తెచ్చియిచ్చింది. ఆయన యీ తడిగుడ్డను నెత్తిపైన వేసుకున్నారు. గాంధీజీ కుర్షిద్ బుజంమీద చేయి వేసి నడుస్తూ స్నేహభావంతో "రండి, పోదాం" అన్నారు నాతో. రెండిండ్లు దాటిన తర్వాత భోజనశాల చేరాం. ఈ భోజనశాల కూడా తడికల కొంపే. గాంధీజీ గడపలోనే చెప్పులు వదిలారు. నేనూ గడప లోనే చెప్పులు వదలి, నా టోపీని కుర్షీద్ చేతికిచ్చాను.. ఆమె దానిని గోడనున్న ఒక మేకుకు తగిలించింది. గాంధీజీ కూర్చుని ఆయనకు దగ్గరగా నాకూ చోటుచూపారు. ఒక అడుగు వెడల్పున్న చాప నేలమీద పరచివున్నది. దానిమీద కూర్చున్నాను. కాంగ్రెస్ సోషలిస్ట్ నాయకులు ఆచార్య నరేంద్రదేవ్ గారు మామధ్య కూర్చున్నారు. ఆయన ఉబ్బస రోగి. గాంధీజీ మావలె చాపమీద గాక పీటమీద కూర్చున్నారు. ఆయన ఎడమచేతివైపు ఆయన భార్య, కస్తూరిబా, కూర్చున్నది. ఆమెకు పళ్ళు లేవు. ఆమె వయస్సు డెబ్బై యేండ్లు. గాంధీజీ వయస్సు డెబ్బై మూడేండ్లు.

ఈ భోజనశాలకు వచ్చేదారిలో పెద్ద మేజాబల్ల వున్నది. దానిమీద ఆహార పదార్థాలన్నీ అమర్చబడినాయి. ఆశ్రమంలోని స్త్రీలు వేరే కూర్చు న్నారు. ఆశ్రమంలో అన్నికారుల పిల్లలూ వున్నారు—మూడేండ్లవారు, ఐదేండ్లవారు, ఎనిమిదేండ్లవారు అందరూ వున్నారు. చురుకైన, అంద మైన పిల్లలను చూచాను. వారందరూ ఆశ్రమవాసుల పిల్లలే. మేము కూర్చున్న రెండు మూడు నిమిషాల్లో ప్రతి ఒక్కరిముందు ఇత్తడి పళ్లాలను తెచ్చివుంచారు. నిశ్శబ్దంగా చాలమంది వడ్డించ నారంభించారు. వండిన పదార్థాలతో నిండిన అనేక గిన్నెలను గాంధీజీముందు వుంచారు. వాటి మూతలను తీసి గాంధీజీ తన దగ్గిర వున్న వారికి వడ్డించారు.

నాకు త్రాగడానికి ఇత్తడిలోటాతో నీళ్ళిచ్చారు. ఆకు కూరవున్న ఇత్తడి గిన్నె నొకదాన్ని నాకు గాంధీజీ అందిచ్చారు. ప్రక్కనున్న ఇత్తడి భాండం మూత తీసి గోధుమ రొట్టెను నాచేతికిచ్చారు. ఈ రొట్టె కాగితంలా సన్నగా వున్నది. కాని మృదువుగాకాక గట్టిగావుంది. ఒకామె నాపళ్ళెంలో కొంచెం ఉప్పువేసి, ఒక లోటా వేడిపాలను తెచ్చి యిచ్చింది. మరికొద్ది సేపటికి ఉడికించి—వలవని బంగాళా దుంపలు రెండు, ఎర్రగా కాల్చ బడిన మెత్తని గోధుమ రొట్టెలను రెంటిని ఆమెయే తెచ్చినది. గాంధీజీ, చిరునవ్వుతో, నావైపుచూచి—"మీకు వడ్డిస్తున్నాం. కాని ప్రార్థన అయ్యే వరకూ ముట్టుకోగూడదు సుమా!" అన్నారు.

"నాకు తెలుసు. వడ్డన పూర్తి అయినాకూడా పిల్లలు తినకుండా ఉండడం చూచి ప్రార్థన కానిది భోజనం చేయకూడదని గ్రహించాను" అన్నాను. భోజనానికి సుమారు 30 మంది కూర్చున్నాం. అంతా నేల మీదనే కూర్చున్నారు. మేజా బల్లలు, కుర్చీలులేవు. అందరూ తెల్లటి బట్టల ధరించారు. వడ్డన పూర్తి అయింది. కాని, ఎవ్వరూ తినడంలేదు. కొందరు, కూర్చున్న తీరుగానే ఒకరికొకరు ఆహారపదార్థాల నందించు కుంటున్నారు. గంట కొట్టిన మోత వినబడ్డది. పొడుగాటి వ్యక్తి ఒకాయన ముందుకు వచ్చాడు. ఏవో మంత్రాలు పఠించాడు. అచ్చటి వారందరూ, గాంధీజీతో సహా, ఆ మంత్రాలు వల్లించారు. ప్రార్థన "శాంతిః, శాంతిః, శాంతిః" అన్న పదాలతో ముగిసింది. నా ప్రక్కన కూర్చున్న దేవ్ గారు ఈ పదాలకు అర్థం చెప్పారు.

వండిన కూరలను గిన్నెల్లోనుంచి తీసుకొని తినడానికి నాకు చెంచా నిచ్చారు. మిగిలిన వారందరు తమ రొట్టెలను ముక్కలుచేసి, ఆ ముక్క లతో కూరను అద్దుకొని తింటూన్నారు. వడ్డించే ఆమె ఒకామె నా రొట్టెల మీద మజ్జిగ పోసింది. భోజనం అట్టే రుచికరంగా లేదు. అందుచేత ఉప్పు కాస్త ఎక్కువగా వాడాను. అప్పుడు తినడానికి యింపుగా వున్నది. కాచిన ఆవుపాలు నాకిచ్చారు. ఆ పాల వాసన నాకు గిట్టలేదు. చక్కెర

తాస్త కలుపుకొని తాగాను. గాంధీజీ ఇంతకుపూర్వం మేకపాలు త్రాగు తూండేవారు. భారతీయులు గోవులపట్ల ఎక్కువ శ్రద్ధవహించాలన్న ఉద్దే శంతో గాంధీజీ ఇప్పుడు ఆవుపాల నుపయోగిస్తూన్నారు.

గాంధీజీ ఆగకుండా తింటూనే వున్నారు. మధ్య మధ్య నాకు, కస్తూరిబాకు, కుర్షిద్‌కు, దేవ్‌కు వడ్డించేవారు. గాంధీజీ చేతులు పెద్దవి. వ్రేళ్ళు పొడవైనవి. ఆయన మోకాలి చిప్పలు ముందుకొచ్చివున్నాయి. ఆయన శరీరంలోని ఎముకలన్నీ వెడల్పాటివి; గట్టివి. ఆయన శరీరం మీది చర్మం నున్నగా, పరిశుభ్రంగా వుంది. భోజన సమయంలో తరచు కస్తూరిబా గాంధీజీకి విసురుతూండేది. ఆమెనుచూస్తే స్వార్థత్యాగి యైన ముగ్ధమోహన స్వరూపమా! అనిపించింది. భోజన సమయంలో ఒకమారు గాంధీజీ సంభాషణలోకి దిగారు—"మీరు పదునాలుగేండ్లు రష్యాలో నివసించారు. స్టాలిన్ గురించి మీ అభిప్రాయ మేమిటి?" అన్నారు,

ఏమి చెప్పడానికి కొంత తడబడ్డాను. "శక్తివంతుడు, అతి కఠి నుడు" అన్నాను.

"హిట్లరంత కఠినుడా?" అని ప్రశ్నించారు గాంధీజీ.

"కనీసం హిట్లరంత!" అని బదులు చెప్పాను,

ఒక నిమిష మాగి మళ్ళీ గాంధీజీ ప్రశ్నించారు—"మీరు వైస్రా యిని చూచారా?"

"ఆ! చూచాను" అన్నాను. అంతటితో ఆ విషయమై గాంధీజీ మాట్లాడలేదు.

అలవాటు లేనిది నేలమీద కాళ్ళు మడతవేసుకొని కూర్చోడంచేత మోకాళ్ళ నొప్పులు పట్టాయి. దేహం బరువు ఎక్కువ మోకాళ్ళమీద పడడంవల్ల యీబాధ అనుకుంటాను. పద్మాసనం వేసుకొని కూర్చోవడం భారతీయులకు మంచినీళ్ళ ప్రాయం. పద్మాసనం వేసుకోడం నే నింకా నేర్చుకోలేదు. మోకాళ్ళ నొప్పులు పట్టాయి గనుక ఒకకాలు నిలబెట్టి,

పాదంమీద బరువుపూని కూర్చున్నాను. కొంత సౌఖ్య మనిపించింది. గాంధీజీ నా తంటాలుచూచి "మీరు భోంచేయడంలేదే!" అన్నారు.

"ఏం! భోంచేయకేం. భోజనం చాలా బాగుంది" అన్నాను.

"మీకు యిష్టంవచ్చినన్ని నీళ్ళు త్రాగండి. నీళ్ళు కాచి శుభ్రపరచి వుంచుతున్నాం....మామిడి పండును ఇక తింటారా?" అన్నారు గాంధీజీ.

"మీ రందరు తినడంచూస్తున్నాగా! నా జీవితంలో మామిడి పండు తినడాని కిదే మొదటిసారి" అన్నాను.

"మామిడిపండు తిన్నతర్వాత ఆ అవస్థ తీరను మీరు స్నానం చేయవలసి వుంటుంది" అన్నది కుర్షిద్, పరిహాసంగా.

మామిడిపండు చెక్కుతీయ మొదలుబెట్టాను. నన్నుచూచి అందరూ నవ్వారు. మొదట మామిడిపండు చేతులతో నలిపి, మెత్తబరచి రసాన్ని పీల్చాలి గాని పైచెక్కు తీయరాదని గాంధీజీ చెప్పారు. "మేము తిన్నట్లు తింటూన్నందుకు మీకు బహుమాన మివ్వాలి" అన్నారు గాంధీజీ. నాభోజన మైంది. కాని నే నింకా కూర్చొని వుండడంచూచి కుర్షిద్ తలవూపి గాంధీజీకన్నా ముందు నేను లేచి వెళ్ళొచ్చు నన్నట్లు సైగచేసింది. గాంధీజీకి నమస్కరించి సెలవుతీసుకు వెళ్ళాను. మూడుగంటలకు నేను గాంధీజీని కలుసుకోవచ్చునని కుర్షిద్ చెప్పింది.

భారతీయులు సాధారణంగా, పాశ్చాత్యులవలె, కరస్పర్శచేయరు ఒకరి నొకరు కలుసుకునేప్పుడుగాని, విడివడేప్పుడుగాని రెండు అరచేతలను మోడ్చి, చిరునగవుతో, నమస్కరిస్తారు. ఈ నమస్కారం భారతీయులను దయామయులుగా, అమాయకులుగా కనబరుస్తుంది. నేన బసకెళ్ళి 12-0 గంటలనుంచి 1-0 గంట వరకు నిద్రపోయి లేచాను శరీరమంతా చెమటమయమై పోయింది. మరల, మూడవమారు, స్నానం చేశాను. రేకుతొట్టిలో నిలిచి చెంబుతో నీళ్ళుముంచి పోసుకున్నాను సేవాగ్రామంలో స్నానమంటే,మన పాశ్చాత్య దేశాల్లో లాగున, తొట్టినిండా నీరు నింపి అందులో కూర్చోవడంకాదు.

మధ్యాహ్నం మూడుగంటలకు కొన్ని నిమిషాలు ముందుగా నా బస నుంచి గాంధీజీ బసకు బయలుదేరాను. ఎండ తీక్షణత నా నెత్తిని మాడ్చి వేసింది. ఆ రోజు ఎండ 110 డిగ్రీలు. గాంధీజీ గదిలోనికి వెళ్ళాను. అప్పటికే ఆరుగురు అచ్చట కూర్చొనున్నారు. అందరూ తెల్లబట్టలే



గాంధీజీ వ్రాస్తూన్న దృశ్యం.

ధరించివున్నారు. ఒకామె—నల్లచీర కట్టుకున్నామె-పంకా లాగుతూవుంది. ఆ గదిలో ఒక్కటే ఒక్క చిత్రం వున్నది—అది ఏసుక్రీస్తు చిత్రపటం. అది నల్ల—తెల్ల రంగులలో వ్రాసినది. ఆ చిత్రంమీద...."ఇతడే మన శాంతి దాత" అని పదాలు ముద్రింప బడ్డాయి. గాంధీజీ పరుపుమీద దిండు

నానుకొని కూర్చున్నారు. ఆయన కంటి అద్దాలచట్టం బంగారపుది. ఫౌన్ టన్ పేనాతో ఉత్తరం వ్రాస్తూన్నారు. కత్తెర మెలికల్లా కాళ్ళు పెనవేసుక కూర్చున్నా రాయన. తాను వ్రాస్తూన్న ఉత్తరానికి మోపుగా ఒక చెక్కను మోకాలిమీద వుంచుకున్నారు. చేతితో చేయబడిన ముతక రకం కొయ్యా చట్టంలో మరి మూడు ఊటకలాలున్నాయి. గాంధీజీ పడకకు ఎడమవైపు కొన్ని పుస్తకాలు నేలమీద వున్నాయి. నన్ను చూడగానే గాంధీజీ "రండి! లోపలికి వచ్చి కూర్చోండి. పంకాలాగుతున్నామె ప్రక్కన కూర్చోండి. అక్కడ చల్లగా ఉంటుంది" అన్నారు. వారు చెప్పినమూల కూర్చుని తడికె నానుకున్నాను.

"మీకేమీ అభ్యంతరం లేకుంటే వీరందరూ మన సంభాషణ సమ యంలో ఇక్కడే వుంటారు. వీరెవ్వరూ మాట్లాడరు. వీరుండడం మీకిష్టం లేదంటే వెళ్ళిపోతారు'' అన్నారు గాంధీజీ.

దేవ్, దేశాయి, మర్షిద్ మరి కొందరు ఆశ్రమవాసులు అక్కడ వున్నారు. ఇంతమంది సమక్షంలో గాంధీజీతో సంప్రదించడం నాకిష్టం లేదు. కానీ "ఫర్వాలేదు" అన్నాను.

"ఇక నేను పూర్తిగా మీ అధీనంలోవున్నాను" అన్నారు గాంధీజీ.

"క్రిప్సు రాయబారం మీ దేశచరిత్రలో నొక గొప్ప మార్పును తెచ్చేదని నా భావం. క్రిప్సు రాయబారం విఫలమైనందున కలిగిన ఫలితా లను గురించి మీ దేశం యిప్పుడిప్పుడే యోచిస్తూన్నట్లున్నది. ఆ విష యాన్ని మీ ప్రజలు సరిగా అర్థంచేసుకుంటే గొప్ప మార్పులు రావచ్చు. అందువల్ల, మీ దృష్టిలో, క్రిప్సు రాయబారం విఫలం కావడానికి కారణ మేమిటో తెలుసుకోవాలని నా కోరిక'' అన్నాను.

"క్రిప్సు మా దేశానికి రాగానే న్యూఢిల్లీకివచ్చి తన్ను కలుసుకో మని నాకు తంతి నంపారు. ఆయన్ని కలుసుకొనడం నాకు యిష్టంలేదు. కాని, నేను వెళ్ళి ఆయన్ని చూడడంవల్ల యేమైనా మేలు కలుగు తుందేమో నని వెళ్ళాను. ఆయన్ని కలుసుకొనక మునుపే ఆయన తెచ్చిన

బ్రిటిష్ ప్రభుత్వ సూచనల గురించి వదంతుల విన్నాను. కాని ఆ సూచన లను ప్రత్యక్షంగా చూడలేదు. క్రిప్సు ఆ సూచనలను నాచేతికిచ్చారు.వాటిని చదవిచూచి "ఇవే మీ సూచనలైతే మీరెందుకు రావడం? వృధాశ్రమ. మీ సూచనలన్నీ యివేనా? ఇంకేమైనా వున్నాయా? మీ సూచనలింతే అయితే తిరుగు విమానానికే మీరింటికి వెళ్ళడం వుత్తమం" అన్నాను. క్రిప్సు నా సలహాగురించి ఆలోచిస్తా నన్నారు" అంటూ గాంధీజీ చెప్పారు.

"క్రిప్సు సూచనల గురించి మీ విమర్శ యేమిటి? బ్రిటిష్ కామన్వెల్త్‌లోనుంచి విడివడే హక్కుతో మీకు క్రిప్సు సూచనలు అధిని వేశ ప్రతిపత్తిని వాగ్దానం చేయలేదా?" అని ప్రశ్నించాను.

"సి. యఫ్. ఆండ్రూస్ క్రీస్తుయొక్క విశ్వసనీయమైన బంటు అని మా అందరి విశ్వాసం. అధినివేశ ప్రతిపత్తి భారతదేశానికి పనికి రాదని ఆయన యెప్పుడూ అంటూండేవాడు. అధినివేశ ప్రతిపత్తిగల యితర దేశా లకు బ్రిటన్‌తోవున్న సంబంధం మాకు లేదు. నేటి అధినివేశ ప్రతిపత్తి అనుభవించే దేశాలన్నీ తెల్లవారి దేశాలే. ఆ దేశాలలోని ప్రజలు చాల వరకు బ్రిటన్‌నుంచి వలసపోయి ఆ దేశాలలో నివాస మేర్పరచుకున్న వారు, వారి సంతతి వారూన్నూ. బ్రిటను మాకు యే ప్రతిపత్తిగాని యివ్వా లన్నకోర్కె మాకు లేదు. ఏ ప్రతిపత్తిగాని బ్రిటన్ ఇవ్వడం, మేము పుచ్చుకోవడం అనే వుంటే, మాకు స్వాతంత్ర్యం లేదనే దాని అర్థం. క్రిప్సు సూచనల్లో బ్రిటన్‌నుంచి విడివడడానికి హక్కు యివ్వబడింది. కాని అందులో ఎన్నో లోపాలున్నాయి. క్రిప్సు సూచనల్లో గొప్ప లోటు సంస్థానాధీశులకు సంబంధించినది. బ్రిటిష్‌వారి లాభంకోసం, వారి సౌకర్యం కోసం యెన్నడో బలవంతాన సంస్థానాధిపతులను వొప్పించి చేసుకున్న వొడంబడికలను యిప్పుడు నిలబెట్టాలంటారు. బికనీర్ మహారాజా— ఆయనేమిటి, యే మహారాజాగాని—బ్రిటిష్‌వారు యీ దేశానికి రాక ముందు యీ దేశంలో కొంతభాగాన్ని పాలించేవాడే. అప్పట్లో, యిప్పటికన్నా ఎంతో యెక్కువ అధికారం వారికి వుండేది. క్రిప్సు సూచ

నలలోని రెండవలోపం పాకీస్థాన్‌ను గుర్తించడం. హిందూ—ముస్లిం విభేదాలు బ్రిటిష్ పరిపాలనవల్ల తీవ్రమైనాయి. క్రిప్సు సూచనమూలంగా యీ వ్యత్యాసాలకు మితిలేని దోహద మివ్వబడింది. 1909 లో మింటో ప్రభువు రాజప్రతినిధిగా వున్నాడు. ఆయనే మతాన్నిబట్టి ఎన్నికలన్న విష బీజాన్ని నాటాడు. మహమ్మదీయులు మహమ్మదీయుణ్ణే ఎన్నుకోవాలి, హిందువులు హిందువునే యెన్నుకోవాలి అన్నది అప్పటినుంచి అల వాటైంది. రెండు మతాలవారిని వేరుపరచాలని బ్రిటిష్‌వారు నేటికీ ప్రయ త్నిస్తూనే వున్నారు. అధికారం చెలాయించడంలో కర్జన్ ప్రభువు అతి సమర్థుడు. ఛెమ్స్‌ఫర్డ్, ఇర్విన్ (హాలిఫాక్స్‌ప్రభువు), లిన్‌లిత్‌గో ప్రభువు లను నేను స్వయంగా యెరుగుదును. కాని కర్జన్ ప్రభువును నేను స్వయంగా యెరుగను. ఆయన్ని యెప్పుడూ కలుసుకోలేదు. కాని ఆయన మనిషికొకమాట చెప్పేవాడుట. సర్ శామ్యూల్‌హోర్ వంటి వారినైతే నమ్మవచ్చు. ఆయనతో మాట్లాడేటప్పుడు యెవరితో మాట్లాడుతున్నామో యెరుగుదుం గనుక జాగ్రత్తగా వుండవచ్చు. ఆయన ఆశయాలేమిటో, ఆయన యెంతటివాడో తెలుసుకోవచ్చు. కానీ, కర్జన్ ప్రభువును అర్థం చేసుకోవడం అసాధ్యం. కర్జన్ ప్రభువు అమలులోనికి తెచ్చిన బెంగాలు విభజన అత్యవసరమైనది. పరిపాలనరీత్యా సహజమైనదీ... వాంఛించ తగిన మార్పుకూడాను. కాని యీ విభజనకు ఆయన ... ఆధారం చేసుకున్నాడు. క్రిప్సుకూడా తనసూచనల్లో అదే మార్గాన్ని అనుసరించాడు. ఇదే క్రిప్సు సూచనల్లోని రెండవలోపం. బ్రిటిష్‌వారు యిక్కడ వున్నంత వరకు ఈ దేశప్రజల్లో సఖ్యత కుదరదు" అన్నారు గాంధీజీ.

"సరే! క్రిప్సు సూచనల్లో యుద్ధానంతర పరిస్థితులను గురించిన షరతులు మీకు నచ్చలేదు. కాని, ప్రస్తుతం, తక్షణం జరిగే మార్పులలో మీకేవీ నచ్చలేదా? భవిష్యత్తు సంగతి అలా వుండనివ్వండి. ప్రస్తుతం కలిగే మార్పుల్లో మీ ప్రజకు పరిపాలనా దక్షతను కల్పించి, ముమ్ముందు

స్వాతంత్ర్యాన్ని జన్మహక్కుగా కోరడానికి తగిన శక్తిని మీ కిచ్చే అవకాశాలేవీ క్రిప్సు సూచనలవల్ల కలుగవా?" అని ప్రశ్నించాను.

"క్రిప్సు సూచనలను మీరు సూచించిన దృష్టితోనే చూశాను. కాని ఆ సూచనలను చదివిచూచిన తర్వాత బ్రిటిష్‌వారితో సహకారానికి అవకాశం లేశమైనా లేదని ధృడమైంది. ఈ సూచనల సంబంధంలో ముఖ్య సమస్య రక్షణ. యుద్ధకాలంలో ప్రభుత్వంయొక్క ప్రథమ కర్తవ్యం, ముఖ్యబాధ్యత రక్షణే. యుద్ధక్రమంతో జోక్యం కలుగజేసుకోడం నాకిష్టం లేదు. దేశరక్షణ విషయమైన తీర్మానాలు చేయడానికి తగిన నిపుణుణ్ణి కాను నేను. కాని మీ అధ్యక్షుడు రూజ్‌వెల్ట్‌కు కూడా అందుకు తగిన సమర్థత లేదు" అంటూ గాంధీజీ వొక్కక్షణం ఆగారు. నేను అమెరికావాణ్ణి గనుక రూజ్‌వెల్టు విషయం మాట్లాడితే యేమన్నా అనుకుంటాననుకున్నారేమో! మాట మార్చారు—"చర్చిల్‌ను వుదాహరణంగా తీసుకుందాం" అన్నారు గాంధీజీ. ఆయన శంకించడం గ్రహించాను.

"ఏం! రూజ్‌వెల్టునే వుదాహరణంగా తీసుకుందాం. మీ భావం నాకర్థమైంది" అన్నాను.

"నాభావం యిది. ప్రజాబాహుళ్యానికి సైన్యానికున్నంత తరిఫీదు, నిపుణత, సైనిక చతురత లేకున్నా, యుద్ధకాలంలో సైన్యం ప్రజాధికారానికి లొంగివుండాలి. రంగూన్‌లోని బంగారపు పెగోడా (బౌద్ధ దేవాలయం) జపాన్ విమానాలకు మార్గదర్శిగా వుంది గనుక ఆ బంగారు గోపురాన్ని ధ్వంసం చేస్తామని బ్రిటిష్‌వారంటే, "మీరు దానిని ధ్వంసంచేయడానికి వీల్లేదు. దానిని ధ్వంసం చేస్తే బర్మా ప్రజల ఆత్మశక్తిని ధ్వంసంచేసినవారౌతారు. అందుచేత మీ యిష్టానుసారం చేయదానికి వీల్లేదు" అని నేనంటాను. బ్రిటిష్‌వారువచ్చి "ఈ రైతులు యీ గ్రామాన్ని యీవాళే ఖాళీ చేయాలి. మే మిక్కడ విమానాశ్రయాన్ని కట్టాలి" అని అంటే, "మీరు నిన్ననే యెందుకాలోచించుకోలే దీవిషయం! నిన్ననే ఆలోచించుకొని వుంటే యీ నిరుపేద రైతులు గ్రామం వదలి వెళ్ళడానికి కొంత వ్యవధి

చిక్కేదికదా! వారువెళ్ళి కాపురముండడానికి తగిన చోటు చూచారా? ఇంత జనాన్ని యెక్కడకు వెళ్ళమంటారు? అని నా సవాలు" అన్నారు గాంధీజీ.

"ఈ విషయాలను పరిష్కరించే అధికారం భారతీయులకు కావాలని మీరు కోరితే, జనరల్ వేవెల్ మిమ్మల్ని అపార్థం చేసుకోవచ్చు. యుద్ధ ప్రయత్నాలతో మీరు అనవసర జోక్యం కలుగజేసుకుం టున్నారని తలచవచ్చు" నన్నాను.

చిరునవ్వు నవ్వి గాంధీజీ—"నిరుపయోగమైన పనులను యుద్ధ కాలంలో మా అధికారంలో వుంచుకోవచ్చని బ్రిటిష్‌వారు కరుణించారు. ఆ పనులలో మచ్చుకు కొన్నిటిని గమనించండి—సైనికులకై పూటకూలిండ్లు, కాఫీ హోటళ్ళు నడపడం, యుద్ధప్రయత్నంలో ప్రభుత్వానికవసరమైన ముద్రణ విషయాలను సాగించడమూనూ. నేను సైనిక నిపుణుణ్ణి కాకున్నా యుద్ధంలో దిగ్విజయం చేకూరడానికి సాయపడే కార్యాలెన్నో చేయగలను. మా సాయం పొందివుంటే దూరప్రాచ్యంలో బ్రిటిష్ వారి కిన్ని అపజయాలు కలిగేవి కావేమో?" అన్నారు.

"అంటే, మీరు రక్షణ కెక్కువ ప్రాముఖ్యత యిచ్చారన్నమాట?" అని ప్రశ్నించాను.

గాంధీజీ అవునన్నారు. "నెహ్రూ మొదలైన యితర కాంగ్రెస్ నాయకులు యిదే దృష్టి నవలంబించారా?" అని ప్రశ్నించాను.

"ఆహా! అందరూ యీ దృష్టి నవలంబించారనే నా నమ్మకం. నెహ్రూ, కాంగ్రెస్ అధ్యక్షుడు మౌలానా అబుల్‌కలామ్ ఆజాద్ వీరి యిద్దరి వైఖరికూడా యిదే" అన్నారు గాంధీజీ.

"ఇంతకూ క్రిప్సు సూచనల్లో, మొత్తంమీద, మీకు మంచియేమీ కనబడ లేదన్నమాట!" అని అడిగాను.

"నాకు చాల సంతోషం—మీరు స్పష్టమైన యీ సూటి ప్రశ్నకు జవాబడగడం. లేనేలేదు—క్రిప్సు సూచనల్లో మంచి ఏమీ అగుపడలేదు"

అని గాంధీజీ జవాబిచ్చారు.

"ఈ విషయం (ఆయన సూచనల్లో మంచియేదీ లేదని) క్రిప్సుతో చెప్పారా ?" అని అడిగాను.

"ఆహా ! చెప్పకేం ! ఆయనతో మరెన్నో విషయాలు చెప్పాను. మీరు రష్యాలో మహత్తర కార్యం సాధించారు....'' అని ఇంకా యేమిటో అనబోతున్నారు గాంధీజీ. నేను అడ్డంవచ్చి—

"మీ రామాటెందుకన్నారు—రష్యాను యుద్ధంలోకి దింపింది సర్ స్టాఫర్డ్ క్రిప్సుగాదు. రష్యాను యుద్ధంలోకి లాగింది మరో పెద్దమనిషి. అడాల్ఫ హిట్లరనే ఆయన'' అన్నాను.

నా మాటలకు గాంధీజీ నవ్వారు, అక్కడవున్నవారంతా గూడా నవ్వారు. "కాని, నేనూ, మా దేశంలో లక్షణాది ప్రజ రష్యాను యుద్ధంలోకి దించిన మహత్తర కార్యాన్ని క్రిప్సే సాధించాడని అనుకుంటున్నాం" అన్నారు గాంధీజీ.

"మీ రామాట లన్నప్పుడు (తను నిర్వహించని ఘనకార్యాన్ని తన కాపాదించి నందుకు) క్రిప్సు కాదనలేదా ?" అని మళ్ళీ అడిగాను.

"లేదు. కాదనలేదు. ఆ పొగడ్తను స్వీకరించా రాయన. రష్యాపై జర్మనీ దండెత్తకముందు స్టాలిన్, బ్రిటిష్ సహాయం కోరాడనుకున్నాం మేము" అంటూ గాంధీజీ నవ్వారు.

"మీరు పొరబడ్డారు. రష్యాపై జర్మనీ దండెత్తిన తర్వాత, అమెరికా, బ్రిటన్లనుంచి రష్యాకు క్రమేణా హెచ్చుసాయం లభిస్తూవున్నది. కాని అంతకుముందు, హిట్లరుకు భయపడి స్టాలిన్ బ్రిటన్‌పట్ల, క్రిప్సు పట్ల అణుమాత్రమైనా స్నేహభావం చూపలేక పోయాడు" అని సమాధాన మిచ్చాను.

"ఏలాగైతేనేం ! ఇక్కడకూడా వొక మహత్తర కార్యాన్ని చేయుమని నేను క్రిప్సును కోరాను. కాని ఆ కార్య సాధన ఆయనశక్తిలో లేక పోయింది" అన్నారు గాంధీజీ.

"ఇంగ్లండులో భారతీయ సమస్యనుగురించి ప్రజాందోళన హెచ్చుగా వుంది. గడచిన వేసవిలో నేను ఇంగ్లండువెళ్ళి తొమ్మిదివారాలు వున్నాను. ఈ యుద్ధానికి పూర్వం బ్రిటన్ని పరిపాలిస్తూవచ్చిన తరహా మనుష్యులు యీ యుద్ధానంతరం తమ దేశంలో అధికారానికి రాకుండా చేయాలని ఆంగ్లేయులు నిశ్చయించుకున్నారు. ఈ ప్రజాందోళనకు క్రిప్సు నాయకుడు కావచ్చు. క్రిప్సు మంత్రి పదవికి రావడం గొప్ప ఆశాసూచకం'' అన్నాను.

''ఔను,ఆశాసూచకం మాత్రమేగాదు;ఆశాభంగం కూడాను.ఆయన అధికారానికి రావడం గొప్ప ఆశాభంగం కల్గించినది. గొప్ప రాజకీయ వేత్తకు వుండవలసిన గుణాలు క్రిప్సుకున్నవా? అని నా సందేహం. భారత దేశంమీద కొంత అభిమానం కలిగి, జవహర్‌లాల్‌కు మిత్రుడైన వ్య_ యీ సూచనలను మోసుకవచ్చాడంటే, యింతకంటే ఆశాభంగం వేరే యేముంది మాకు" అని అన్నారు గాంధీజీ. ఏదో ఆలోచిస్తున్నారు. బహూశ నాకు నియమించిన గంట సమయం గడిచిందని కాబోసు! ఒక నిమిష మాలోచించి గాంధీజీ "సాంకే ప్రభువు వొకమారు నాకు సలహా యిచ్చాడు. నా ఆరోగ్యాన్ని జాగ్రత్తగా కాపాడుకోమన్నాడు. 'నా ఆరోగ్యాన్ని నేను కాపాడుకోకుంటే యింత వృద్ధవయస్సువరకు జీవించే వాణ్ణేనా?' అని ఆయనకు జవాబిచ్చాను. నా ఆరోగ్యాన్ని జాగ్రత్తగా రక్షించుకోడం నాలో ఒక గొప్పలోపం" అన్నారు.

"మీరు యేలోపమూ లేని పరిపూర్ణులని తలచానే!'' అన్నాను.

నవ్వుతూ గాంధీజీ యిలాన్నారు—"నాలో అనేక లోపాలున్నాయి. నేను చాలా అపరిపూర్ణుణ్ణి. మీరు వెళ్ళేలోగా నా తప్పులను,—ఓ వంద తప్పులను, మీరు కనిపెట్టగలరు! మీరు కనిపెట్టలేకున్నా మీరు నా లోటుపాట్లను గ్రహించడానికి నేను సాయపడ్తాను."

గాంధీజీ నడుమునుంచి ఒక గొలుసు వేలాడుతూవుంది. ఆ గొలుసు కొసను పెద్ద జేబు గడియారం వుంది. ఆ గడియారాన్ని చూస్తూ "మీతో

ఒక గంట గడిపాను" అన్నారు. ఆమాటల అర్థం గ్రహించి, లేచి నమస్కరించి వెళ్ళాను.



గాంధీజీ - గడియారం - కస్తూరిబా

మేము మాట్లాడుతూన్న గంటసేపట్లో మహమ్మదీయ స్త్రీ వొకామె. చాల ముసలామె, పళ్ళులేవు, వొకమారువచ్చి గాంధీజీ రొమ్ముమీదనున్న తడిబట్టను మార్చి వెళ్ళింది. తన తలపైనున్న తడి రుమాలును గాంధీజీ అనేకమార్లు తీసి పక్కనున్న లోటాలోని నీళ్ళలోముంచి, పిండి, మళ్ళీ

తలమీద కప్పుకున్నారు. తలమీదనుంచి గాంధీజీ రుమాలు తీసినప్పుడల్లా ఆయన ముఖాన్ని విశదంగా చూడగలిగాను. ఆయన పైపెదవిని, తెల్ల బారిన కురుచ మీసాలున్నాయి. పై పెదవి వెడల్పాటిదికాదు. అందుకనే ముక్కు పెదవిని అందుకున్నట్లుంటుంది. ఆయన క్రిందిపెదవి అతి చురుకైనదిగా కన్పడింది. మృదువైన కండ్లు, పెద్దతల, విశాలములైన చెవులు— నిజంలో గాంధీజీ వో వింతమనిషే.

నేను అతిధిగృహానికెళ్ళిన కాస్సేపటికి ఆచార్య నరేంద్రదేవ్, ఆశ్రమవాసి మరొకరు వచ్చారు. వారు ఇండియా, రష్యా, యుద్ధం మొదలైన విషయాలను నాతో చర్చించను వచ్చారు. వారు యిద్దరూ పూర్తిగా బ్రిటిష్ ద్వేషులు. తాము బ్రిటిష్ వ్యతిరేకులైనందుకు చింతిస్తున్నామన్నారు దేవ్‌గారు. ఇంగ్లండు చేతుల్లో తమదేశంపడ్డ అష్టకష్టాలనుబట్టి తాము ఇంగ్లండును ద్వేషించక తప్పిందికాదన్నారు.

గాంధీజీకి నాకు జరిగిన సంభాషణను తూ. చ. వ్రాతమూలంగా ఉంచా లనుకున్నాను. దేవ్‌గారు,ఆయన మిత్రుడు వెళ్ళిపోగానే మా సంభాషణను జ్ఞప్తికితెచ్చుకొని టైపుచేయ మొదలుపెట్టాను. ఐదు నిమిషాలలో అలిసి పోయాను. దేహమంతా చెమటపోసింది. నా స్నానపు గదిలోకి వెళ్ళి మరోమారు మునిగి వసారాలో కూర్చొని టైపుచేస్తూ వచ్చాను.

నా బసముందు ఒకామె వస్తూ, పోతూండడం గమనించాను. ఆ జూన్‌నెల ఎండలో ఆమె చెప్పులు లేకుండా నడుస్తూంది. నీలిరంగు పమిట, పసుపుపచ్చ చీర. ఆ చీరకొంగును వీపుపైకి త్రిప్పి తలమీద చుట్ట కుదురుగా పెట్టింది. ఈ పసుపుపుద్ద చీరకు, యెర్రని అంచుండడం వల్ల ఆమెవచ్చి, వెళ్ళినప్పుడల్లా, టైప్‌రైటర్‌మీద దృష్టి ఉన్ననాకు, ముందేదో జ్వాల మెరిసినట్లనిపించింది. ఎర్రని మట్టికడవతో నీళ్ళు నెత్తిని మోసుకొచ్చి నా బసకు ఎదురింట్లో పోసి వస్తూంది. ఆమెచేతుల వొకే వొక యిత్తడి కడియముంది. ఆమె యెదటింట్లో కెళ్ళేప్పుడు నిండుకడవను నెత్తిన పెట్టుకొనెళ్ళేది. బయటికి వచ్చేప్పుడు కడవను చంకన బెట్టు

కొచ్చేది. ఈవిధంగా గంటలాది, ఆ మండుటెండలో, ఆ యిల్లాలు నీళ్ళు మోస్తూనే వుంది. పొడవైన గొట్టం తగిలించి బావిలో పంపు (మర) పెడ్తే ఆమెకష్టం తప్పేది.

అలసిపోయేవరకు సైపుచేశాను. తర్వాత కుర్షిద్‌తో మాట్లాడుతూ ప్రొద్దుపుచ్చాను. రాత్రి భోజనం సాయంత్రానికే సిద్ధమౌతుంది. సాయంత్రం ఐదుగంటలైంది. గంట కొట్టారు. అందరమూ భోజనశాలలో కలిసాం. యథాప్రకారం ప్రార్థనానంతరం భోజనంచేసూన్నాం. ఆశ్రమవాసి వొకా యన గాంధీజీ పక్కన కూర్చుని భోజనంచేస్తూ న్నాడు. అయన గాంధీజీతో హిందూస్థానీలో మాట్లాడు తూన్నాడు. తన సంభాష ణలో అతనొక ఆంగ్ల పదాన్ని వాడాడు. అంతట నేను "ఇండియాకు వచ్చిన మరునాడేనేను ఢిల్లీనగరం లో జరిగిన కాంగ్రెస్ బహి రంగ సభకు వెళ్ళాను. ఆ



అరుణ అసఫాలీ

సభలో శ్రీమతి అరుణ అసఫల్లీగారు మాట్లాడారు. * ఆమె హిందూ స్థానీలో మాట్లాడినా అనేక ఆంగ్లపదాల నుపయోగించింది" అని ఆ పదాలను చెప్పాను. గాంధీజీ ఆ పదాలను విని ఆనందించారు. నా పక్కన కూర్చున్నాయనతాము అందరకూ పరిచయమైన మరో ఆంగ్లపదముందన్నాడు—"విద్యార్థి గూఢచారులు" అన్నాడు. విశ్వ విద్యాలయాల్లోని విద్యార్థులనుగమనించడానికి, వారి చర్యల ఆచూకీ

* ఆమెభర్త డాక్టర్ అసఫల్లీ మహమ్మదీయుడు. అఖిల భారత కాంగ్రెస్ కార్య నిర్వాహకసభలో సభ్యుడు. ఆమె హిందూ యువతి.

తెలుసుకోడానికి బ్రిటిష్ ప్రభుత్వంవిద్యార్థులనే గూఢచారులుగా నియోగిస్తూందన్నాడు. గాంధీజీ యీ మాటవిని "నేను బ్రిటిష్ పరిపాలన కారోపణచేసే దోషాల్లో యిది వొకటి" అన్నారు.

సోవియట్ రష్యాలోని హింస దౌర్జన్యాల గురించి గాంధీజీ అడిగారు. రష్యాలోని నా స్వానుభవాన్నుంచి కొన్ని దృష్టాంతాలు తెల్పాను. "మీరుచెప్పే విషయాలనుబట్టి చూస్తే ఇంగ్లండు, అమెరికా యీ రెండుమాత్ర మేనా ప్రపంచంలో ప్రజాస్వామ్యాలు" అన్నారు గాంధీజీ, వ్యంగ్యంగా.

"ఔను. ఈ యుద్ధ సమయంలోకూడా ప్రజాస్వామ్య పద్ధతులను ఇంగ్లండు నిజాయితీన అనుసరిస్తూండడం చూస్తే ఆశ్చర్యంవేస్తుంది. స్వీడన్ కూడా యీ రకానికి చెందిందే'' అన్నాను.

"ఔను" అన్నారు అపహాస్యంగా, గాంధీజీ.

"స్విడ్జర్లాండు, కనడా, ఆస్ట్రేలియా మొదలైన బ్రిటిష్ డొమినియన్లు (అధినివేశ రాజ్యాలు) గూడా ప్రజాస్వామ్యాలే'' అన్నాను.

"ఔను. ఇవన్నీ ప్రజాస్వామ్యాలే. కాని తెల్లవారి ప్రజాస్వామ్యాలు. వీటి ప్రజాస్వామ్యత నాకు తెలుసు. నేను దక్షిణాఫ్రికాలో కొంతకాలం వున్నాను" అని అంటూ గాంధీజీ భుజింప నారంభించారు.

భోజనానంతరం నా బసకు చేరాను. స్నానంచేసి ఆరుంపావుకు మళ్ళీ గాంధీజీ యింటికి వెళ్ళాను. ఒక నిమిషం గుమ్మంలో ఆగాను. గాంధీజీ బయటికి వచ్చారు. ఆయన వెదురు కర్ర నొకదానిని చేతికి వూతగా తీసుకొని వచ్చారు. గాంధీజీ వైద్యుడు డాక్టర్ దాస్‌గారు, మరి కొందరు ఆశ్రమవాసులు (స్త్రీ, పురుషులు) మావెంట షికారు వచ్చారు. గాంధీజీ తనకు యిటూ అటూ వున్న యిద్దరుస్త్రీల భుజాలమీద చేతులు వేసి నడవ నారంభించారు. గాంధీజీని దర్శించడానికి కొందరు యువకులు దగ్గిరగ్రామంనుంచి వచ్చి మా బాటకు ఒకప్రక్కన నుంచున్నారు. వారి ముఖాల్లో భయం, భక్తి రెండూ దాగివున్నాయి. మేము సమీపించగానే

వారు చేతులు జోడించి, నడుమువరకు శరీరమువంచి గాంధీజీకి నమస్కరించారు. గాంధీజీ వారితో యేదో అన్నారు. వారు, ఆయన, కూడావున్న వారందరూ నవ్వారు. సేవాగ్రామం పక్కన దుక్కి భూములున్నాయి. ఆ భూములను చుట్టివస్తూన్న డొంక బాటన నడిచాం. నా ప్రశ్నలు ప్రారంభించమన్న సూచనగా "మరేమన్నా విశేషం" అన్నారు గాంధీజీ.

"ప్రథమ ప్రపంచయుద్ధంలో (1914-18) బ్రిటిష్ సైన్యానికి సైనికులను చేర్చడానికి మీరు సాయపడ్డారు. ఈ యుద్ధారంభంలో బ్రిటిష్ ప్రభుత్వానికి యేవిధమైన తొందరా కలిగించమన్నారు. ఇప్పుడు మీదృష్టి మారింది. ఎందువల్ల ? ఈ మార్పు కలగడానికి కారణం ?" అని ప్రశ్నించాను.

"మొదటి ప్రపంచయుద్ధ సమయానికి నేను కొత్తగా దక్షిణాఫ్రికా నుంచి తిరిగివచ్చినవాణ్ణి. దేశంలో నాస్థాన మేమిటో నాకే తెలియదు. నాబల మెంతో నే నెరుగును. అంటే నాకప్పుడు అహింసా తత్వంలో నమ్మకం లేదనిగాదు. అహింసాతత్వంకూడా పరిస్థితులనుబట్టి పరిణామం చెందాలి. అందువల్ల అప్పట్లో నా స్థితియేమిటో నాకే యెరుకపడలేదు. ఈ రెండు ప్రపంచయుద్ధాల మధ్యకాలంలో అనేక అనుభవాలు కలిగాయి. ఇన్ని అనుభవాలైగూడా 1939 సెప్టెంబరులో వైస్రాయితో సంప్రదించిన తరువాత కాంగ్రెసు ఉద్యమం యీ యుద్ధ ప్రయత్నాల కడ్డురాదని ప్రకటించాను. కాని, కాంగ్రెసంటే నేను కాదుగా ! నిజంలో నేను కాంగ్రెసు సభ్యుడను కాను. కాంగ్రెసు, నాకంటే హెచ్చుగా, యుద్ధవ్యతిరేకి, బ్రిటిష్ ద్వేషి కూడాను. కాంగ్రెస్ యీ యుద్ధయత్నాలకు, అడ్డుపడాలని వాంఛించి నప్పుడు, ఆ కోర్కెలను నేను యెంతో అణచిపెట్టవలసి వచ్చింది. ఇప్పటికి నాకు నేను కొన్ని తీర్మానాలు చేసుకున్నాను. బ్రిటిష్‌వారిని అగౌరవ పరచాలన్న కోర్కె నాకు లేదు. కాని బ్రిటిష్‌వారు మాదేశం వదలి వెళ్ళాలి. బ్రిటిష్‌వారు జపాన్‌వారికన్నా అతినీచులనను" అన్నారు గాంధీజీ.

"మీరన్నదానికి విరుద్ధమేమో ! జపాన్‌వారు ఇంగ్లీషువారికన్నా అతినీచులుగారా ?" అని ప్రశ్నించాను.

"ఆమాట నేననను. ఒక యజమానిని వెళ్ళగొట్టి మరోయజమానిని మా నెత్తి కెక్కించుకొనడం నాకిష్టంలేదు. ఇంగ్లండు తనంతట తాను —ఇతరులు బుద్ధిచెప్పకముందే—సక్రమ పద్ధతిని తన అధికారాన్ని మాదేశంనుండి వుపసంహరించుకుంటే నైతికంగా చాలా లాభం పొంద గలదు" అన్నారు గాంధీజీ.

అప్పటికింకా ఎండ తీక్ష్ణంగానేపుంది. మేము వడివడిగా నడూ స్తున్నాం. బెంగాల్, తదితర ప్రాంతాల్లో బ్రిటిష్‌వారు చేసిన ఘోర కృత్యాల గురించి గాంధీజీ మాట్లాడుతూనే వున్నారు.

"ఈరోజు నాకు కొన్ని ఉత్తరాలు వచ్చినాయి. విమానాశ్రయాలు కట్టడానికని పల్లీయులను, ముందు హెచ్చరిక యివ్వకుండా,—ఖాళీ చేయను తగిన వ్యవధినివ్వకుండా, వారి యిండ్లనుంచి ప్రభుత్వం వెడల తరుముతూందని మిత్రులు వ్రాశారు. నిలవ నీడైనాలేని ఆ ప్రజలకు ప్రభుత్వం ద్రవ్యసాహాయమైనా చేయడంలేదట. ప్రభుత్వం సాగిస్తూన్న జులుం, యీ దౌర్జన్యం యుద్ధప్రయత్నాలకు సాయపడినట్లు కనుపించినా యివే నిజంలో యుద్ధప్రయత్నాలకడ్డంకులు. బ్రిటిన్, ఇండియాను వదలనిది యీ యుద్ధాన్ని జయించలేదన్న నమ్మకం నాలో నాటుకుపోయింది. నానాటికి యీ నమ్మకంవేళ్ళు పారిపోతూవుంది నాలో '' నన్నారు గాంధీజీ.

షికారునుంచి మేము గాంధీజీ యింటికి వొచ్చేప్పటికి చీకటి పడ్డది. గాంధీజీ వచ్చీరావటంతోనే యింటిముందరి అంగణంలోవున్న బల్లమీద పరున్నారు. నన్ను, మరోబల్ల చూపి, కూర్చోమన్నారు. గాంధీజీ రొమ్ము మీద కప్పుకోడానికి పొడిగుడ్డను మహమ్మదీయ స్త్రీ తెచ్చియిచ్చింది. ఆమె ఆయన పాదాలు తుడిచింది.

"ఇండియాను పరిపాలించడంలో ఇంగ్లండు యెన్నోపొరబాట్లు చేసి వుండవచ్చు. అప్పుడప్పుడు ఘోరకృత్యాలు చేసియుండవొచ్చు. కాని విదేశనిరంకుశ ప్రభుత్వమేదైనా ఇండియాను జయించితే మీ దేశంగతి అధోగతి అవుతుంది'' అంటూ మా సంభాషణను మళ్ళీ ప్రారంభించాను.

గద్గదస్వరంతో గాంధీజీ మొదలుబెట్టారు—" బ్రిటిష్‌వారు యెలాంటి పైశాచిక కృత్యాలు చేశారో మీరెరుగరు. 1919 లో అమృతసర్‌లో జరిగిన పైశాచిక కృత్యాలను ప్రజలు మరువలేరు. నేను ప్రజల కంటే చాలా మితవాదిని. కొందరు భారతీయులు బ్రిటిన్‌పట్లగల అపరిమిత ద్వేషంకారణంగా జపాన్ విజయాన్ని నిరసించరని నా నమ్మకం."

గాంధీజీలేచారు. ఆయన లేపడంచూచి "నాకూ ప్రొద్దైంది. సెలవా ?" అన్నాను. "మీరు వెళ్ళడానికి పిల్లేదు. ప్రార్థనకు వొచ్చి వెళ్లాలి" అన్నారు గాంధీజీ.గాఢాంధకారం. గాంధీజీ ముందునడుస్తూన్నారు. ఆయన వెంబడే నేనూ వెళ్ళాను. ఆయన ఇంటికి యెభైగజాలముందు ఖాళీస్థలంలో ఆశ్రమవాసులంతాచేరారు. మొత్తం డెభ్భైమంది వుంటారు. అందరూ తెల్లఖద్దరు బట్టలనే ధరించారు. అందరూ నేలమీద కూర్చొన్నారు. అంగణానికి వొకవైపు స్త్రీలు, ఇరువైపుల పురుషులు కూర్చున్నారు. "మీరు నేలమీద కూర్చోగలరా? పిషర్‌గారూ" అని గాంధీజీ అడిగారు. గాంధీజీ పక్కనే నేను కూర్చున్నాను. ముస్లింస్త్రీ గాంధీజీ వెనుకకూర్చొని ఆయనకు విసురుతూంది. ప్రార్థనాపరులు కొందరి చేతుల్లో లాందరలున్నాయి. ఈ లాందర్లకు ఒకవైపు కాగిత మంటించారు. ఎ. ఆర్. పి. నిబంధనల ననుసరించికాదు! ఎదుటకూర్చున్నవారి కండ్లు కుట్టకుండా వుండగలందులకు, వెలుతురును మరుగపరచనే కాగితమంటించారు. అలాంటి లాందరొకటి గాంధీజీ పక్కనే వుంది.

గాంధీజీ యేదో వొక శ్లోకాన్ని పఠించ నారంభించడంతో ప్రార్థన ప్రారంభమైంది. అందరూ గాంధీజీతోపాటు శ్లోకాన్ని పఠించారు. గాంధీజీగొంతు విస్పష్టంగా వినబడ్డది. శ్లోకానంతర మొకాయన పాట పాడారు. ఆ పాటకు తగినట్లు మరొకాయన తాళం వేశారు. ఈ సంగీతం నా చెవులకు కొంత చైనా, కొంత అరేబియా సంగీతంలా వుంది. అందరూ గొంతెత్తిపాడారు. తర్వాత గాంధీజీ ఒక లావు పుస్తకంనుంచి —హిందూపురాణమనుకుంటాను—ఏదో చదివారు. శాంతిః, శాంతిః. శాంతిః అన్నమాటలతో ప్రార్థన ముగిసింది.

## జూన్ 5, 1942

నేను బసకువెళ్ళి పడుకునేటప్పటికి వెన్నెలవచ్చింది. బట్టబయలున పడున్నాను. సుఖంగా నిద్రపోయాను. ప్రొద్దున నాలుగింటికే లేచాను. రాత్రి నులకమంచంమీద పడున్నాను. చల్లనిగాలి. నా పొరుగింట డాక్టర్ దాస్‌గారు నివాసమున్నారు. ప్రొద్దున ఆరుంపావుకు డాక్టర్ దాస్‌గారు వచ్చి గాంధీగారు అలసివున్నారని, ఆ వుదయం షికారువెళ్ళరని చెప్పారు. బిస్కత్తులు, వెన్న, తేనె, మామిడిపండ్లు కుర్షీద్ తెచ్చి యిచ్చింది. నేను తింటూన్నప్పుడు చీమలు, ఈగలు చుట్టుకున్నై. వాటి పోరుపడలేకనా అన్నట్లు అతిత్వరగా ఫలహారంచేశాను. తర్వాత టైపుచేయ మొదలుబెట్టాను. రష్యానుగురించి మాట్లాడ్డానికి దేవ్, ఆర్య నాయకంగార్లు వచ్చారు. ఆర్యనాయకంగారు విద్యావిషయాల్లో కాంగ్రెసుకు సలహాయిస్తారు. ఈయన సింహళద్వీపీయుడు. టైపుచేయడం ఆపి "స్వాతంత్ర్యం వచ్చినంతమాత్రాన మీరు సుఖపడతారనుకోను. స్వాతంత్ర్య సంపాదనానంతరం మీక్లిష్టసమస్యలన్నీ వాటి నిజస్వరూపాన బయటబడతవని నా అభిప్రాయం" అన్నాను. కుర్షీద్ తన పూర్వపు వాదనను "భారతదేశం ఫాసిస్టుదేశంగా మారినా ఫరవాలేదు. స్వాతంత్ర్యం అత్యవసరం * బోస్‌బాబు అజాద్ హింద్ ఫౌజునుతీసుకొని ఇండియాకువస్తే దేశంమొత్తం ఆయన ననుసరిస్తుంది. హాంగ్‌కాంగ్, మలయ, సింగపూర్, బర్మాలలో పట్టుబడిన భారతీయసైనికులకు, సైనికోద్యోగులకు స్వాతంత్ర్యమిచ్చి, జపానువారు వారిని అజాద్ హింద్‌ఫౌజ్‌గా తయారు చేస్తున్నారని, ఈ స్వాతంత్ర్య భారతసైన్యం ఇండియాను దండెత్తి ఆంగ్లేయుల తరిమి మాతృదేశాన్ని దాస్యశృంఖలాలనుండి విడిపిస్తుందని

---

* సుభాస్‌చంద్రబోస్ 1938 లో కాంగ్రెస్ అధ్యక్షులుగా నున్నారు. ఈ యుద్ధం ఆరంభంకాగానే ఆయన ఇండియానుంచి పలాయనమై జర్మనీ చేరారు. జర్మనీనుంచి బ్రిటిష్‌వారికి విరుద్ధప్రచారం సాగిస్తున్నారు.

అక్షరాజ్యాల రేడియో ప్రకటిస్తూవుంది. నెహ్రూకంటె బోస్‌బాబు దెక్కువ పలుకుబడిగలదు. కొన్ని పరిస్థితులలో గాంధీజీకన్న బోస్‌బాబుకే హెచ్చు మంది సాయపడ్తారు'' అని మరీనొక్కి చెప్పింది.

"నెహ్రూ మొదలైన అతివాదుల బలవంతంమీద ఇటీవల కాంగ్రెస్ సాంఘిక, ఆర్థిక సమస్యలపట్ల యెక్కువ శ్రద్ధవహించింది. సంఘసంస్కరణ కార్యక్రమాన్నొకదాన్ని కాంగ్రెస్ తయారుచేసింది. ఒక ప్రతిని వెతికియిస్తాను మీకు" అన్నారు దేవ్‌గారు.

పదకొండు గంటలకు భోజనం. నేను భోజనశాలకు వెళ్ళడానికి ఆలస్య మయింది. నేను వెళ్ళేప్పటికి గాంధీజీ కూర్చుని వున్నారు. నన్ను చూడగానే "రండి ! లోపలికి రండి !" అన్నారు.

"తమ ఆరోగ్యం యెలావుంది ?" అని గాంధీజీ నడిగాను.

"నేను చాల అలసిపోయాను. షికారుకు రాలేకున్నాను. మీరు ఒంటరిగా షికారువెళ్ళాలి. లేదా, యిక్కడి మిత్రుల నెవరినైనా తోడు తీసుకువెళ్ళాలి. వ్యాయామం అత్యవసరం" అన్నారు గాంధీజీ.

"మీతో మాట్లాడడానికి అవకాశం దొరుకుతుందని షికారుకు వస్తున్నాను. లేకుంటే ఈ ఎండల్లో నేను షికారుకు వెళ్ళేవాణ్ణికాను'' అన్నాను. గాంధీజీ నవ్వారు. తనకంచంలోనుంచి ఉడికిన ఉల్లిపాయను నాకందించారు. దాన్ని వద్దని, పచ్చి ఉల్లిపాయను తెమ్మన్నాను. పచ్చి ఉల్లిపాయ తినడంవల్ల జఠరాగ్ని అధికమౌతూంది. నేను మామిడిపండు తినడం ప్రారంభించగానే గాంధీజీ ఒక ఖద్దరు రుమాలు అందించారు.

మధ్యాహ్నం మూడుగంటలైంది. గాంధీజీతో సంప్రదించడానికి ఆయన యింటికెళ్ళాను. గాంధీజీకి వచ్చిన ఉత్తరాలకు దేశాయిగారు, మరోకార్యదర్శి ప్రత్యుత్తరాలు వ్రాస్తూన్నారు. అందరూ క్రింద కూర్చు న్నారు. కుర్షీద్ పంకా లాగ నారంభించింది. ఈమారు గాంధీజీ గదిలో మరోచిత్రాన్ని చూచాను. ఆ గది మట్టిగోడమీద నొకదేవుని ఊరేగింపు దృశ్యం రంగులతో చిత్రింపబడివుంది. గాంధిజీ అనుకునేచోట గోడమీద

నొకతాటిచెట్టు,దానిపై ఎత్తున దేవనాగరి లిపిలో "ఓం"అనివ్రాయబడినాయి. "ఓం" అంటే దాని అర్థం యిది అని దేశాయిజీ వివరించి చెప్పారు. గాంధీజీ లోపలికివచ్చి, నాకు నమస్కరించి తన పరుపుమీద పరున్నారు. "మీ ప్రశ్నల వదలండి. పడుకున్నరీతిని జవాబిస్తాను" అన్నారు. ఆయన పొత్తికడుపుమీద కప్పడానికి బంకమట్టి పూసిన గుడ్డను ముస్లింస్త్రీ తెచ్చి యిచ్చింది. "ఈ మట్టి గుడ్డ నా భావిదశతో నన్ను కలుపుతుంది" అన్నారు గాంధీజీ. నేను బదులివ్వలేదు. ఒక్క క్షణమైన తర్వాత "మీరు గ్రహించినట్లులేదే!" అన్నారు మళ్ళీ గాంధీజీ.

"గ్రహించకేం. మీరింకా యవ్వనంలోవున్నారని, ఇప్పుడే మట్టిలో కలిసే అవసరం లేదని అనుకున్నా"నన్నాను.

"ఏం! మీరూ, నేనూ, అందరమూను నేడో, నూరేండ్లకో మట్టిని కలిసిపోవలసిందేగా!...." అన్నారు గాంధీజీ.

"భావిదశనుగురించి ఏదో వొక సూచనను విన్నప్పుడు- ఆ సూచన అమలులోకివస్తే ఎలా వుంటుందా! అని వూహిస్తాను నేను. బ్రిటిష్‌వారు మీదేశంనుంచి వెళ్ళిపోవాలని మీరు కోరారుగదా! వారి నిష్క్రమణ క్రమేణా ఎలా జరగాలో చెప్పగలరా?" అని అడిగాను.

"మొదటివిషయం మా దేశంలోని సంస్థానా ధీశులది. వారికి స్వంత సైన్యాలున్నాయి. బ్రిటిష్‌వారు వెళ్ళిపోగానే సైన్యాలు చేతుల్లో వున్నాయి గనుక సంస్థానా ధీశులు కొంత అల్లరిచేయవచ్చు. బ్రిటిష్‌వారు వెళ్ళగానే దేశం శాంతియుతంగా వుంటుందని రూఢిగా చెప్పలేను. కొంత గందరగోళం జరగవచ్చు. అందుకనే బ్రిటిష్‌వారు ఒక క్రమపద్ధతిని అధికారాన్ని వదలుకోవాలని, భారతదేశాన్ని దేవునిచేతుల్లోపెట్టి పోవాలని అంటున్నాను. నా మాటలు అసహజమని మీరనవచ్చు. అట్టి పరిస్థితిని మీరు అరాచకమనే అనండి. కాని, అంతకుమించి యేమీకాదుగా! అటువంటి నికృష్ట పరిస్థితులు కలుగకుండా మేము ప్రయత్నిస్తాం. అరాచకం కలుగక పోవచ్చు" నన్నారు గాంధీజీ.

"బ్రిటిష్‌వారు వెళ్ళిన వెంటనే భారతీయులు తమ ప్రభుత్వాన్ని నెల కొల్పలేరా ?" అని ప్రశ్నించాను.

"నెలకొల్పలేకేం. నెలకొల్పవచ్చు. కాని మా దేశంలోని రాజ కీయాల్లో మూడు భిన్నశక్తులున్నాయి—సంస్థానాధీశులు, ముస్లిములు, కాంగ్రెస్. ఈ శక్తులన్నీ ఏకమై, తాత్కాలిక ప్రభుత్వాన్ని యేర్పాటుచేయ వచ్చు" నన్నారు గాంధీజీ.

"అధికారము, ఉద్యోగాలు ఏ తారతమ్య ప్రమాణాన్ని (నిష్ప త్తిని) పంచడమౌతుంది ?" అని ప్రశ్నించాను.

"ఆ విషయం నాకు తెలియదు. ఈ మూడు శక్తుల్లో గొప్పది కాంగ్రెస్. కనుక కాంగ్రెస్ హెచ్చు అధికారాన్ని కోరవచ్చు. కాని, ఆ విషయాలన్నిటిని అందరికీ తృప్తికరంగా తీర్మానించడానికి వీలౌతుంది" అన్నారు గాంధీజీ.

"బ్రిటిష్‌వారు మీదేశంనుంచి పూర్తిగా వెళ్ళిపోవడం సాధ్యం కాదనుకుంటా. అలా బ్రిటిష్‌వారు వెళ్ళిపోవడం మీదేశాన్ని జపాన్‌వారికి బహూకరించడమౌతుంది. ఇలాంటి సలహాను ఇంగ్లండు అంగీకరించదు. అమెరికా ఆమోదించదు. బ్రిటిష్‌వారు, మూటా ముల్లే కట్టుకొని తక్షణం దయచేయాలని మీరడగడం గొంతెమ్మ కోరికే. బ్రిటిష్‌వారు వారి సైన్యా లను వారు వెంటతీసుకొని వెళ్ళాలనా మీ కోరిక ?" అని ప్రశ్నించాను.

రెండు నిమిషాలసేపు గాంధీజీ మౌనం వహించారు. గది అంతటా నిశ్శబ్దం స్పష్టంగా వినబడ్డది. "మీరు చెప్పింది సబబు ! బ్రిటను, అమె రికా, మరి యితర దేశాలుకూడా మాదేశంలో తమ సైన్యాల్ని వుంచ వచ్చు. ఈ దేశాన్ని తమ యుద్ధయత్నాలకు ఆధారభూమిగా చేసుకోవచ్చు. ఈ యుద్ధంలో జపాన్ గెలవాలన్నకోర్కె నాకు లేదు. అక్షరాజ్యాలు గెలవాలన్నకోర్కె అంతకన్నా లేదు. కాని, భారతీయులు స్వతంత్రులుగా కుండా యీ యుద్ధంలో బ్రిటను జయించలేదనిమాత్రం నాకు స్థిరమైన నమ్మకం. బ్రిటన్ బలహీనమై వుంది. భారతదేశాన్ని పరిపాలిస్తూన్నంత

వరకు బ్రిటన్ దోషియే" అన్నారు గాంధీజీ.

"మిత్రరాజ్యాలు ఇండియాను, తమ యుద్ధప్రయత్నాలకు ఆధారంగా చేసుకుంటే యెన్నో సమస్యలు తలచూపుతవి. సైన్యాలు గాలిలో కాపురం చేయవుగా! మిత్రరాజ్యాలకు రైల్లు, రోడ్లు కావలసి వస్తవి" అన్నాను.

"సరే! వారు రైల్లు, రోడ్లు వుపయోగించుకోవచ్చు. వారికి సరఫరాలు రావాలిగా! అందుకు రేవులు అవసరం. వాటిని వారి అజమాయిషీలో వుంచుకోవచ్చు. కాని, బొంబాయి, కలకత్తావంటి నగరాలలో బ్రిటిష్‌వారు మతకలహాలు లేవదీయరుగా! ఈ సమస్యలన్నిటి పరిష్కారానికి సహకారం, సఖ్యత అవసరం" అన్నారు గాంధీజీ.

"ఈ సహకారం తటస్థించడానికి—అవసరమైన షరతులు, ఒక ఒడంబడికమూలంగా నిర్ణయింప బడవచ్చా?" అని అడిగాను.

"ఆహా! ఇంగ్లండుతో మేము లిఖితరూపంగా ఒడంబడిక కుదుర్చుకుంటాం" అన్నారు గాంధీజీ.

"లేక బ్రిటన్, అమెరికా మొదలైన దేశాలతోగూడా ఒడంబడికలు చేసుకుంటారా?" అని అడిగాను.

"ఔను" అన్నట్టుగా తలవూపారు గాంధీజీ.

"మీరింతవరకు ఈ విషయమెందుకు చెప్పలేదు? మీరు సహాయనిరాకరణోద్యమాన్ని ప్రారంభిపనున్నారని విన్నప్పుడు నాకు యేవగింపు కల్గింది. నిజంచెప్తున్నాను మీతో. మీ ఉద్యమం యుద్ధప్రయత్నాలకు అడ్డమొస్తుందనుకున్నాను. యుద్ధాన్ని యెదుర్కోవాలి, పోట్లాడాలి, జయించాలి. లేకుంటే అక్షరాజ్యాలు జయిస్తవి. అక్షరాజ్యాలు జయిస్తే ప్రపంచం అంధకారమయం ఔతుంది. మిత్రరాజ్యాలు గెలిస్తే ప్రపంచాభివృద్ధికి అవకాశం వుంది" అన్నాను.

"ఆ విషయంలో మీతో నేను యేకీభవించలేను. బ్రిటన్ ఎక్కువ మోసంతోనే నేటికీ కాలం గడుపుతూంది. ముందెన్నడూ తానివ్వబోని

వాటిని యిప్పుడు ధారాళంగా యిస్తానని వాగ్దానాలు చేస్తూన్నది. కాని ప్రజాస్వామ్యాలు గెలిస్తే ప్రపంచం బాగుపడడానికి ఎక్కువ అవకాశ ముంటుందన్న భావాన్ని నేనంగీకరిస్తా" నన్నారు గాంధీజీ.

"యుద్ధాంతంలో జరిగే సంధిమీద ఆధారపడి వుంటాయి యివన్నీ" అన్నా నేను.

"కాదు. ఇవన్నీ—రానున్న సంధిగూడ—మనం యుద్ధమప్పుడు యేంచేస్తున్నామో దానిమీదే ఆధారపడి వుంటాయి" అన్నారు గాంధీజీ.

"భారత స్వాతంత్ర్యం అంటే అమెరికా రాజకీయవేత్తల కెంతో సానుభూతి. ఆ విషయం మీతో నేను రూఢిగా చెప్పగలను. అట్లాంటిక్ ప్రణాళిక ఇండియాకు అన్వయించదని చర్చిల్ ప్రకటించ నున్నాడని అమెరికన్ ప్రభుత్వానికి తెలిసింది. మా ప్రభుత్వం ఎంతో ప్రయత్నించింది—చర్చిల్ చేయనున్న ప్రకటనను ఆపాలని. వాషింగ్టన్ (అమెరికా ముఖ్యపట్టణం) లోని గొప్పవారు కొందరు పసిఫిక్ ప్రణాళిక నొకదాన్ని తేవాలని ప్రయత్నిస్తున్నారు. కాని వారి ప్రయత్నాలు ఫలించేట్లులేదు. అటువంటి ప్రణాళిక ప్రకటించేముందు సామ్రాజ్యవాదాన్ని రూపుమాపాలి. బ్రిటన్ ఇండియాను తన అరచేతిలో పెట్టుకొని వుండగా అటువంటి ప్రణాళికను యెలా ప్రకటించగలం?" అన్నాను.

"ఎప్పుడో చేస్తాం అంటూ యీనాడు చేసే వాగ్దానాలలో నాకు నమ్మకం లేదు. యుద్ధానంతర స్వాతంత్ర్యంలోకూడా నాకు ఆసక్తిలేదు. నాకు యిప్పుడే స్వాతంత్ర్యం కావాలి. ఈక్షణంలో కావాలని కోరే స్వాతంత్ర్యం, ఇంగ్లండు యీ యుద్ధంలో గెలవడానికి సాయపడ్తుంది" అన్నారు గాంధీజీ.

"మీ యోచనలు వైస్రాయిగారి కెందుకు తెలియజేయలేదు? మిత్రరాజ్యాల సైన్యాలకు ఇండియా ఆధారస్థానంగా వుపయోగింపబడడానికి మీ కిప్పుడేమీ అభ్యంతరంలేదని వైస్రాయికి తెలియాలి" అన్నాను.

"నా ఆలోచనలగురించి నన్నెవ్వరూ అడగలేదు. ప్రజలను,

రానున్న సహాయనిరాకరణోద్యమానికి సంసిద్ధుల చేయడానికి నా అభిప్రాయాలను ప్రకటిస్తున్నాను. ఈ విషయం నన్నెవ్వరూ అడుగలేదు గనుక బయటపెట్టలేదు. మీరు కొన్ని సూటిప్రశ్నలను వ్రాసియిస్తే వాటికి సమాధానం నా ఆంగ్ల వారపత్రిక "హరిజన్"లో వెలువరిస్తాను. కాని మీ ప్రశ్నలను క్లుప్తీకరించండి" అన్నారు గాంధీజీ.

"నా వ్రాతలు చూచివుంటే నేనెలా క్లుప్తంగా, సూటిగా, అనవసర విషయాలను పిండి పారవేసి వ్రాసేదీ మీరే గ్రహించగలిగే వారు" అని వాదించాను.

"మీరు రాకముందు మిమ్ములగురించి జవహర్‌లాల్ చెప్పాడు. మీరు యోగ్యులని, కల్మషహృదయంతో ప్రవర్తించేవారుకారని ఆయన చెప్పాడు. మీరు ఘట్టిమనిషనికూడా చెప్పాడు.* మిమ్ముచూస్తేనే ఈ విషయం స్పష్టమౌతుంది" అంటూ నవ్వారు గాంధీజీ.

"అవును, ఆకారంలో నిజంగా ఘట్టిమనిషినే" అన్నాను నేను.

"నేను స్వతంత్రంతో, స్పష్టంగా మాట్లాడాను మీతో. మీరు పెద్దమనిషన్న నమ్మకంతో.......కాథరైన్ మేయో కన్య యిచ్చటికి వచ్చింది. నేను ఆమెను సగౌరవంగా చూచాను. తర్వాత ఆమె ఉచ్ఛిష్టాన్ని వ్రాసింది. నేనామెన



లూయీ ఫిషర్

* ఫిషర్ లావంటిమనిషి. "ఘట్టి" పదంలో రెండర్థాలున్నాయి.

యేమని పిలిచానో మీరెరుగుదురా ?" అన్నారు గాంధీజీ.

"లేదు: నే నెరుగను" అని జవాబు చెప్పాను.

"మురుగు కాల్వల ఇన్‌స్పెక్టర్ అని ఆమెకు పేరు పెట్టాను" అన్నారు విచారంగా, గాంధీజీ.

"నేను నిరుపేద కుటుంబంలో పుట్టినవాణ్ణి. ఆకలంటే ఏమిటో నే నెరుగుదును. బీదల ఎడ, కష్టజీవుల ఎడ నాకెప్పుడూ జాలే. అమెరికన్లు అనేకులు భారతదేశంపట్ల అత్యధిక స్నేహభావం కలిగివున్నారు. అందువల్ల, ఇటీవల మీరు అమెరికాను ఖండిస్తూ అన్నమాటలు నాకు బాధకలిగించినై" అన్నాను.

"ఆ మాటలు అనడం అవసరం. అమెరికనులను విస్మితులను చేయాలని నాఉద్దేశం. చాలమంది అమెరికన్లకు నాయందు సానుభూతి వున్నది. డబ్బు పిశాచాన్ని పూజిస్తూ వున్నంతకాలం ప్రపంచాన్ని అభివృద్ధి పరచలేరని అమెరికన్లకు చెప్పదలచుకున్నాను. ప్రజాస్వామ్యాలు అక్షరాజ్యాలను ఓడించి తాము జపాన్, జర్మనీలంత క్రూరమౌతవన్న అపాయమొకటి ముందున్నది" అన్నారు గాంధీజీ.

"నిజమే! ఆ అపాయం వొకటివున్నది. ఇంగ్లండు యుద్ధంలోకి దిగితే ఫాసిస్టుగా మారుతుందన్నారు చాలమంది. కాని ఈ యుద్ధపురోజుల్లోనే, ఇంగ్లండు యుద్ధానికి పూర్వంకన్నా హెచ్చుగా ప్రజాస్వామ్య పద్ధతుల ననుసరిస్తూన్నది" అన్నాను.

"మీరన్న విషయం సత్యదూరం. మీరన్నవిషయం అసత్యమని ఇండియాలో స్పష్టంగా చూస్తూన్నాం" అన్నారు గాంధీజీ.

"కానీ, కనీసం ఇంగ్లండులో ఈ విషయం సత్యం" అన్నాను నేను.

"ఇంగ్లండులోనైనా ఈ విషయం నిజం కానేరదు. సామ్రాజ్యంలో అసలే నిజంకాదు. ముందెప్పుడో బ్రిటిష్ ప్రభుత్వం మంచిగా వుంటుందని నేను నమ్మను. భారతజాతీయ స్వాతంత్ర్యంకోసం యెన్నో యేండ్లు

కష్టించాను. ఇంక ఏమాత్రమూ ఆగలేను. కాని మా విషయంలో సాను భూతి వున్నదని నమ్ముతాను" అన్నారు గాంధీజీ.

కాస్సేపు మాట్లాడకుండా ఆగాడు. ఆయన మనస్సు నొచ్చిందను కుంటాను. "ఈవాళ మీ మాటలు విన్నతర్వాత నేనొక తీర్మానానికొచ్చాను. భారతదేశంలో పరిష్కారమార్గ మొకటి ఏర్పడటానికి మీరుచేసిన సూచ నలు క్రిప్సు సూచనలను తలక్రిందులు చేస్తున్నాయని నా తీర్మానం. క్రిప్సు కొన్ని అధికారాలు మీకిచ్చి మిగతవాటన్నిటిని ఇంగ్లండుకు వుంచాడు. మీరు ఇంగ్లండుకు కొన్ని అధికారాలిచ్చి తక్కిన సర్వాధికారాన్ని మీ చేతుల్లోనే వుంచుతున్నారు" అన్నాను.

"మీరన్నది నిజం. నేను క్రిప్సు సూచనలను తలక్రిందులు చేశాను" అన్నారు గాంధీజీ.

గాంధీజీ గడియారంచూచి నాకు, సంప్రదించడానికి, నిర్ణయిం చిన ఒక గంట ముగియవచ్చిందని తెలుసుకున్నాను. మీరు "వ్యక్తులు— రాజకీయాలు" * అన్న నా పుస్తకాన్ని చూచారా? ఆ పుస్తకాన్ని, చదువ మనను గాని, ఒకమారు తిరగ వేయాలని నా కోరిక. దేవ్‌గారివద్ద వొక ప్రతి వున్నది" అన్నాను.

"పుస్తకం తిరుగవేయడమంటే ఏమిటి?" అని గాంధీజీ కార్యదర్శి ఒకాయన అడిగాడు.

"పుస్తకం తిరగవేయడమంటే ముందు చివర పుటను చూడడం. తర్వాత మొదటిపుటను చూడడం. ఆ తరువాత మధ్యపుట నొకదానిని చూడడం" అని గాంధీజీ పరిహాసం చేశారు.

"తర్వాత ఆ పుస్తకాన్ని విసిరేసి చాల బాగుందనడం" అన్నాను నేను. కాస్సేపు ఆగి గాంధీజీతో "నా గంటా పూర్తిఅయింది" అన్నాను.

"ఔను. మీ గంట పూర్తిచేశారు. ఇక వెళ్లి తొట్టిలో కూర్చోండి" అన్నారు గాంధీజీ, పరియాచకంగా.

---

* *Men and Politics.*

ఇంటికి వెళ్ళగానే ఒక దేవదారు పెట్టెను స్నానపు రేకుతొట్టిలో వుంచాను. తొట్టినిండా నీళ్ళున్నై. ఆ పెట్టెమీద కూర్చున్నాను. కాళ్ళు నీళ్ళల్లోనే ఉన్నాయి తొట్టి నానుకొని బయట మరొక పెట్టెవుంచి, దాని మీద నా టైప్‌రైటరును అమర్చాను. గాంధీజీతో జరిగిన సంభాషణను టైపు చేశాను. ఎండతీక్షతచేత కొద్ది నిమిషాల్లోనే చెమటపట్టేది. ఇత్తడి చెంబుతో తొట్టిలోని నీళ్ళుముంచి మీదపోసుకునేవాణ్ణి. ఈవిధంగా, అలసిపోకుండా, ఒక గంటసేపు టైపు చేశాను.

సాయంకాలం ఐదు ఘంటలకు భోజనం. భోజనశాలకు నేను గాంధీజీకన్నా ముందు వెళ్ళాను. గాంధీజీ రాగానే, నన్ను చూచి "ఇప్పుడు సరి!" అన్నారు. ముందు రోజు నేను ఆలస్యంగా వెళ్ళాను గనుక ఆమాటన్నారు. "మీకన్నా ముందురావడం మర్యాదా? లేక, మీరు వచ్చినతర్వాత రావడం మర్యాదా?" అని అడిగాను.

"ఇక్కడ దొంగమర్యాదలు అనవసరం. మీ యిష్టం వచ్చినప్పుడు రావచ్చు" నన్నారు గాంధీజీ.

నిన్నటివలెనే మళ్ళీ గాంధీజీ నన్ను ఉడకబెట్టిన ఉల్లిపాయ తీసుకోమన్నారు. ముందువలెనే మళ్ళా నేను వద్దన్నాను. "వస్తుండవలసి వస్తుంది, జాగ్రత్త!" అని మందలించారు గాంధీజీ. నేను వస్తుండవలసిన అవసరంలేదని, భోజనానికి ముందు తేనీరు, మజ్జిగ త్రాగానని చెప్పాను, గాంధీజీ పరిహాసంగా చెప్పినదానిని నేను ఎలా ఆచరణలోపెట్టి గంటసేపు టైపు చేసిందీ గాంధీజీకి చెప్పాను. నా మాటలు వినగానే గాంధీజీ బిగ్గరగా నవ్వారు. నాటి సాయంకాలం ఆయన షికారుకు రాలేనన్నారు. అలసియున్నా నన్నారు. క్షమించుమన్నారు.

నా భోజనం ముగిసించనిచూచి "ఫిషర్‌గారూ! మీరు సపంక్తినుంచి ఎలా లేచిపోవడమా! అని అనుమానించవద్దు. మీ ఇష్టంవచ్చినప్పుడు లేచి వెళ్ళండి. మర్యాదలు పాటించ నక్కరలేదు. ఇంత క్రితమే చెప్పానుగా, ఇతరులకు కనబరచను చూపే మర్యాద అనవసరమని" అన్నారు గాంధీజీ.

భోజనంనుంచి లేచి పాదరక్షలు, టోపీ పుచ్చుకొని భోజనశాల నుంచి బయటికి వచ్చాను. గాంధీజీ నాదగ్గరకువచ్చి "ఆదివారంనాడు జవహర్‌లాల్ యిక్కడికి వస్తున్నాడు. ఈ విషయం మీకెవరైనా చెప్పారా?" అన్నారు.

"లేదే! నాకెవ్వరూ చెప్పలేదే! ఈవాళ ఏంవారం? రోజులు మర చాను యిక్కడికివచ్చి" అన్నాను.

"శుక్రవారం" అంటూ నవ్వారు గాంధీజీ.

"నాతో ఫోటో తీయించుకోడానికి వొప్పుకుంటారా?" అని ప్రశ్నించాను.

"ఆ! పొరపాటున చుట్టుపట్ల ఫోటోగ్రాఫరుంటే. మీతో ఫోటోలో వుండడానికి నా కభ్యంతరం ఏమీలేదు" అన్నారు గాంధీజీ.

"ఈ మాటలు నాకు పరమానందాన్ని కలుగజేస్తున్నాయి. ఇవి నాకు స్తుతివాక్యాలు" అన్నానేను.

"మీకు పొగడ్తలు కావాలా?" అన్నారు గాంధీజీ.

"మనందరికీ పొగడ్తలు అవసరంకదూ?" అని ప్రశ్నించాను.

"ఔను, మనం అందరం పొగడ్తలు కోరుతాం. కాని కొన్ని సమ యాల్లో వాటిని సంపాదించడానికి యెంతో నష్టపడాలి" అని గాంధీజీ అన్నారు.

నే నింటికివెళ్ళి మళ్ళీ నీళ్ళతొట్టిలో కూర్చుని నాలుగు ప్రశ్నలను టైపు చేశాను. వీటికి జవాబులు "హరిజన్"లో ప్రచురిస్తానన్నారు గాంధీజీ. ఈ రోజు గాంధీజీకి నాకు జరిగిన సంభాషణ చరిత్రాత్మకంగా చాలా ప్రధానమైనదని తలచాను. భారతదేశానికి అత్యంత ప్రాధాన్యమైన సమస్యనుగురించి గాంధీజీ ఆయన అభిప్రాయాన్ని మార్చుకున్నారు. ఇంతకుపూర్వం ఆయన ప్రకటించిన "బ్రిటిష్‌వారు వెళ్లిపోవాలి" అన్న భావాన్ని మార్చుకున్నారు. "బ్రిటిష్‌వారు యిక్కడవుండి యుద్ధాన్ని సాగించవచ్చు" నని నాతో అన్నారు. అంటే యుద్ధ యత్నాలను సహిస్తా

రన్నమాట. కొన్ని ప్రత్యేక సందర్భాలలో యుద్ధప్రయత్నాలకు సాయపడ్తా రనిగూడా అనుకోవచ్చు. భారత స్వాతంత్ర్యసమస్య పరిష్కారమయ్యే విషయంలో రాజీ కుదుర్చుకోడానికి గాంధీజీ సిద్ధమేనని ఆయనమాటలను బట్టి నాకు స్పష్టమైంది. నా బసముందు, ఆరు బైట, మంచంమీద పరు న్నాను. పంచలో లాంతరు చిన్నదిగా మండుతూవున్నది. తేళ్ళు తిరుగు తున్నాయని, లాంతరుచేత లేకుండా మంచం దిగవద్దని కుర్షీద్ హెచ్చ రించి వెళ్ళింది. దూరంనుంచి ప్రార్థన సమావేశం సందడి వినబడుతూ వుంది. తొమ్మిది గంటలకు నిద్రపట్టింది. రాత్రి చల్లగా వుంది.

---

## జూన్ 6, 1942

ప్రొద్దున ఐదింటికే లేచాను. గాంధీజీతో ఫోటో తీసుకోవాలిగనుక గడ్డంచేసుకున్నాను. లండన్‌లో కొన్న నీలిచారల పైజామా తొడుక్కున్నాను. ఆర్యనాయకంగారు యెరువిచ్చిన ఖద్దరు "కుడతా," తెల్లది, తొడుక్కున్నాను. ఆ కుడతా నా మోకాళ్ళనంటే పొడుగువుంది. ప్రొద్దుటి ఫలహారం ముగించాను—తేనీరు, రొట్టె, మామిడిపండ్లు. గాంధీజీ కుటీరానికి వెళ్ళాను. గాంధీజీ తన యింటి వసారాలో పరుపుమీద కూర్చున్నారు. ఒక లోటాలోనుంచి చమ్చాతో మామిడిపండ్ల రసాన్ని యెత్తి జుర్రుతున్నారు. కస్తూర్‌బా ఆయనకు విసురుతూవుంది. నడుమునుంచి మోకాళ్ళవరకు మాత్రమే గాంధీజీ బట్ట కట్టుకొని వున్నారు. నన్ను చూడగానే "ఓహో" అంటూ నా దుస్తులనుగురించి విమర్శించారు.

"లండన్‌లోకొన్న యీ లాగు, ఇచ్చటి ఖద్దరు చొక్కా—వీటి కలయిక ఎలా ఉంది మీ కంటికి?" అని ప్రశ్నించాను.

"చాల బాగుంది. కాని, మీకుగాను ప్రత్యేకంగా మీకొలత ప్రకారం చొక్కా కుట్టించుకుంటే బాగావుండేది" అన్నారు గాంధీజీ.

"ఈ చొక్కా ఆర్యనాయకంగారివద్ద యెరువు పుచ్చుకొన్నాను" అన్నాను.

"ఆర్యనాయకంగారు అమెరికాలోని కొలంబియా విశ్వవిద్యాలయంలో చదివారని మీకు తెలుసా?" అని ప్రశ్నించారు గాంధీజీ.

"ఆ! విన్నాను" అన్నాను. ఒక్కక్షణమాగి "నా ప్రశ్నలను చూచారా?" అని అడిగాను.

"చూచాను. వాటికి ఈ ఉదయమే బదులు వ్రాస్తాను" అన్నారు గాంధీజీ. కొద్దిసేపైన తర్వాత షికారుకు బయలుదేరాం.

"మీరు ప్రతి సోమవారం మౌనవ్రతం పూనుతున్నారే, ఈ వ్రతానికి సిద్ధాంతం యేమిటి?" అని అడిగాను.

"సిద్ధాంతమంటే?" అని ఎదురు ప్రశ్న వేశారు గాంధీజీ.

"సిద్ధాంతమంటే కారణం, ఉద్దేశమూను" అన్నాను.

గాంధీజీ చిరునవ్వు నవ్వి—"1920-21 లో నా కపరిమిత శ్రమ కలుగుతూ వచ్చినరోజుల్లో ఈ మౌనవ్రతం అలవాటైంది. ఆరోజుల్లో అత్యధికంగా కష్టపడేవాణ్ణి. రైలు ప్రయాణాలు ఎక్కువగా చేస్తుండేవాణ్ణి. అనేక సభలలో మాట్లాడేవాణ్ణి. ప్రజలు వేనవేలు నాచుట్టూ మూగేవారు. తలకొక ప్రశ్నా అడిగేవారు. నాతోపాటు వారూ ప్రార్థనచేయాలనేవారు. అందువల్ల వారాని కొక్కరోజు అలసట తీర్చుకుందా మనుకున్నాను. అందుకు సోమవారం మౌనవ్రతమని నిర్ణయించాను. తర్వాత యీ కారణానికి ఎన్నో స్వరూపాలు, కథలు, గాధలు అల్లి, కొన్ని నైతిక గుణాలను, దివ్యత్వాన్ని దానికాపాదించాను. కాని, యింతకూ, ముఖ్యోద్దేశం వారాని కొకరోజు విరామం కావాలన్నదే'' అన్నారు.

మేము నడుస్తూనేవున్నాం. ఆశ్రమంలోని వంటయింట్లో పని చేసే వొకామె మాతోకూడా నడుస్తూవుంది. గాంధీజీ ఆమె భుజంమీద చెయివేసి నడుస్తూవున్నారు. "మౌనం విశ్రాంతి నిస్తుంది. సదామౌనం పూనేవారి కావిశ్రాంతి లభించదు, రుచించదు. మాటధోరణిగలవారు మౌనం వహిస్తే వారికి చాల విశ్రాంతి లభిస్తుంది. ఆలోచన కెంతో సమయముంటుంది" అన్నారు గాంధీజీ. నేను గాంధీజీ వెంబడే నడుస్తూన్నా. గాంధీజీమీద యెండపడకుండా మాతో నడుస్తూవున్నామె నల్ల గొడుగును మామధ్య తెచ్చిపట్టింది. గాంధీజీ రొమ్ముపైగాని, తలపైనగాని గుడ్డ యేదివేసుకోలేదు. గాంధీజీకి మరోవైపు డాక్టర్ దాస్‌గారు వచ్చి గొడుగు పట్టారు. అప్పుడప్పుడు మాబాటకు అడ్డంగానున్న కర్రలను డాక్టర్‌దాసుగారుతీసి, ప్రక్కనున్న చేలోకి విసిరేవారు.

1942 ఏప్రిల్‌లో సర్ స్టాఫర్డ్ క్రిప్సుతో కాంగ్రెస్ తరపున సి. రాజగోపాలాచారిగారు సంప్రదించారు. రాజగోపాలాచారిగారి సూచనలగురించి గాంధీజీ నడిగాను. రాజగోపాలాచారిగారిని భారతదేశంలో 'రాజాజీ'

అంటారు. ఇండియాలోని అత్యంత మేధావులలో ఆయనవొకడు. గాంధీజీకి చిరకాల పరిచితుడు, అనుచరుడుకూడాను. గాంధీజీ కడపటి కుమారుడు దేవదాస్‌కు మామగారాయన. క్రిప్సురాయబారం విఫలమైనప్పటి నుంచీ కాంగ్రెస్—ముస్లింలీగుల ఐక్యతకై ఆయన అనేక ఉపన్యాసాలిస్తున్నాడు. కాంగ్రెస్‌వారు పాకిస్థాన్‌కు ఒప్పుకోవాలంటున్నాడు. పాకిస్తాన్ అంటే ముస్లింలకు ప్రత్యేక స్వతంత్ర రాజ్యముండాలని. నేను గాంధీజీని రాజాజీ ప్రయత్నాలగురించి అడిగాను, "నాకు రాజాజీ ఆలోచనలేవో తెలియవు. నేను ఆయనకు విరుద్ధంగా, ఆయన నాకు విరుద్ధంగా వాదించడం మాదురదృష్టం. అందుకని మేము యిద్దరమూ వాదోపవాదాలకు దిగకూడదని తీర్మానించాను. నిజంలో ఆయన యోచనలేవో నాకు తెలియవు" అన్నారు గాంధీజీ.

"ఆయన యోచనలకు ముఖ్యోద్దేశం హిందువులు—ముస్లిములు కలిసి శాంతియుతంగా పనిచేయగలిగితే సఖ్యతయేర్పరచడంకాదా?" అని ప్రశ్నించాను.

"ఔను, కాని ఆ సఖ్యత కుదరడం అసంభవం. ఇంగ్లండు అనే మూడవశక్తి మానెత్తి నెక్కి—వున్నంతవరకు హిందువులకు—ముస్లింలకు సఖ్యతకుదరడం దుస్సాధ్యం. ఇంగ్లండు యిక్కడ అధికారంలోనున్నంతవరకు మామత వైషమ్యాలు వుంటూనే వుంటాయి. చాలాకాలం క్రితం మింటోప్రభువు వైస్రాయిగా ఉండేవాడు. ఇంగ్లండు ఇండియాను పరిపాలించడానికి మహమ్మదీయులను — హిందువులను పరస్పరం దూరంగా వుంచడం అత్యవసరమని ఆయన ఎన్నడో వెల్లడించాడు" అన్నారు గాంధీజీ.

"మింటోగారి ఆమాటలను నేనూచదివాను" అన్నాను.

"అప్పటినుంచి మాదేశంలో బ్రిటిష్ పరిపాలనకు యీ నీతియే పునాది. మతాన్ని ఆధారంచేసుకొని ప్రజలను విభజించి, మతవైషమ్యాల పెంపొందించడం" అన్నారు గాంధీజీ.

"కాంగ్రెసువారు 1937, 1938, 1939లలో రాష్ట్రాల్లో మంత్రిపదవులలో నున్నప్పుడు మహమ్మదీయులకు చాలా అన్యాయాలు చేశారని విన్నానే !" అన్నాను.

"ఆ విషయం కేవలం అసత్యమని బ్రిటిష్ గవర్నర్లే తమ అధికారహోదాలో ఋజువుచేశారు" అని గాంధీజీ జవాబిచ్చారు.

"యు.పి. (సంయుక్తరాష్ట్రం)లో కాంగ్రెసుకు ఎన్నికలలో జయం కలగదన్న భయంతో కాంగ్రెసువారు ఎన్నిక సమయంలో ముస్లింలతో రాజీ కుదుర్చుకున్నారట. తత్ఫలితంగా కాంగ్రెస్ దిగ్విజయం పొందగలిగిందట. కాని తర్వాత కాంగ్రెస్‌వారు ముస్లింలతో 'మిశ్రమ మంత్రివర్గాన్ని, ఏర్పరచ నిరాకరించారట. ఇవన్నీ నేను విన్నమాటలు. ఇవన్నీనిజమేనా?" అని ప్రశ్నించాను.

"అబద్ధం. కాంగ్రెస్‌వారు యూ. పీ. లో యేర్పరచిన మంత్రివర్గంలో నలుగురు మహమ్మదీయులున్నారు. ముస్లింలీగ్ ప్రతినిధులు లేరుగాని మంత్రివర్గంలో ముస్లిములు లేకపోలేదు. మేము ముస్లిములతో కలిసి పనిచేయడానికి సదాప్రయత్నించాం—ప్రయత్నిస్తూన్నాంకూడాను. కాంగ్రెస్ అధ్యక్షుడు మౌలానా అబుల్‌కలాం అజాద్ మాచేతి కీలుబొమ్మ అని కొంద రాయన్ను దూషిస్తున్నారు. నిజంగా ఆయనకాంగ్రెస్ నియంత. ....క్రిప్సు సూచనలు హిందూ ముస్లిములను, పరస్పరం పూర్వంకంటే యెక్కువగా దూరంచేసినవి. బ్రిటిష్ ప్రభుత్వం పుణ్యాన యిరుమతాల వారికి వైషమ్యం హెచ్చినది" అన్నారు గాంధీజీ.

"క్రిప్సుతో ప్రదింపచను—కాంగ్రెస్ నాయకులును, ముస్లింలీగ్ నాయకులును న్యూఢిల్లీ వెళ్ళారు. క్రిప్సుతో సంప్రదించారు. కాని, పరస్పరం తమలో తాము సంప్రదించుకున్నారు కారు. విచారకరమైన విషయమిది" అన్నాను.

"విచారకరమైన విషయం మాత్రమేకాదు, అవమానకరమైన విషయం గూడాను. కాని ఆ తప్పు ముస్లింలీగుదే. ఈ యుద్ధం ప్రారంభ

మైన కొద్ది రోజులకు లిన్‌లిత్‌గో ప్రభువు మమ్మల్ని అందరినీ న్యూఢిల్లీకి ఆహ్వానించారు. బాబు రాజేంద్రప్రసాద్, నేనూ కాంగ్రెస్ తరపునవెళ్లాం. జిన్నాగారు ముస్లింలీగ్ తరపున వచ్చారు. మాలో మేము ముందుగా మాట్లాడుకొని, ఒక సమాధానం యేర్పరచుకొని బ్రిటిష్ ప్రభుత్వాన్ని యెదుర్కొందామని జిన్నాగారిని కోరాను. న్యూఢిల్లీలో కలుసుకుందా మని తీర్మానించుకున్నాం. ఇరుపక్షాలూ—జిన్నాగారు, మేమూ,—'మాకు స్వాతంత్ర్యంకావాలి' అని వైస్రాయిగారిని అడుగుదామని నేను జిన్నా గారికి సలహాయిచ్చాను. "నాకు స్వాతంత్ర్యం అనవసరం" అన్నారు జిన్నాగారు. మాలో మాకు రాజీ కుదరలేదు. వైస్రాయివద్దకు మేము ముగ్గురం కలసి వెళ్దామని తద్వారా కాంగ్రెస్, ముస్లింలీగ్‌లు ఒద్దికగా వున్నవని చూపించడానికి వీలుంటుందని వాదించాను. జిన్నాగారిని నా కారులో రమ్మన్నాను. తుట్ట తుదకు ఆయన కారులో నేనువెళ్ళడానికి జిన్నాగారు అంగీకరించారు. కాని వైస్రాయితో యెవరికివారమే మాట్లా డాము. మా అభిప్రాయాలకు భిన్నమైన అభిప్రాయాలను జిన్నాగారు వైస్రాయివద్ద వెలిబుచ్చారు" అన్నారు గాంధీజీ.

మా షికారు ముగిసింది. గాంధీజీ యింటివద్దకు వచ్చాం. నేను అలసిపోయాను. ఇంటి స్తంభాన్ని ఒకదాన్ని ఆనుకొని నిలుచున్నాను. గాంధీజీ అలసినట్లు లేదు. ఆయన మాటలధోరణి మానలేదు—"జీవి తంలో హిందువులు—ముస్లిములు అని రెండు ప్రత్యేక జాతులుగా విభ జించడానికి వీలులేదు. ఈ రెండు మతాలవాళ్ళమూ ఒకేజాతివాళ్ళం. రెండు విభిన్నజాతులవాళ్ళంకాము. ఏ మహమ్మదీయుని కుటుంబ చరిత్ర వెతికినా, అతనికి ఒక హిందూ నామధేయం వుంటుంది. ప్రతి మహమ్మ దీయుడూ ఒకప్పుడు హిందువుగా వున్నవాడే. మహమ్మదీయుడంటే మాదేశంలో ప్రత్యేక జాతివాడనికాదు. ఇస్లాం మతాన్ని కలిసిన హిందువు అని అర్థం. మతం మార్చుకున్నంత మాత్రాన అతనికి ప్రత్యేక జాతీయత వస్తుందా? శక్తివంతుడైన ఒక క్రైస్తవమతగురువు మమ్ము అందరిని

(హిందువులను. ముస్లింలను) క్రైస్తవ మతంలో చేర్చితే అప్పుడు మేము అందరము వొకజాతివాళ్ళం ఔతామా? ఒకప్పుడు నిజంగా రెండు విభిన్నజాతులకు చెందినవాళ్ళమే అయితే అప్పుడు వొకజాతివాళ్ళం యెలా ఔతాము?....హిందువులు, ముస్లిములు రెండు భిన్నజాతులకు చెందిన వాళ్ళుకారు. అంతా ఒకేజాతికి చెందినవారు. యూరప్ ప్రజలందరూ చాలవరకూ క్రైస్తవులు. జర్మనులు, ఇంగ్లీషువారు క్రైస్తవులే. వారిభాషలో, సంస్కృతిలో పరస్పరం చాల బాంధవ్యం వుంది. అటువంటి చుట్టరికము వుండికూడా యిప్పుడు వొకరి నొకరు ధ్వంసం చేసుకుంటూ వున్నారు. ఇండియాలో హిందువులకు, మహమ్మదీయులకు సామాన్యమైన, తమదైన సంస్కృతి,సాంప్రదాయాలు



రాజాజీ

వున్నవి. ఉత్తర హిందూస్థానంలో హిందీ, ఉరుదూ భాషలను హిందువులు, ముస్లిములుకూడా వాడుతున్నారు. మద్రాసు రాష్ట్రంలో హిందువులు—ముస్లిములుకూడా అరవం, తెనుగు మాట్లాడుతారు. వారెవ్వరికి హిందీగాని, ఉరుదూగాని రాదు. మతకలహాలకు కారణం దేవుళ్ళవూరేగింపులూ, ఆవులను నరకడమూను. దీనినిబట్టి మతకలహాలు మూఢత్వం వల్ల కలుగుతున్నవిగాని మా ప్రత్యేక జాతీయతలవల్ల కాదని స్పష్టమౌతున్నది" అన్నారుగాంధీజీ.

"ఖరే అనే ఆయన వైస్రాయి విదేశాంగ శాఖకు కార్యదర్శి. ఆయన చాలకాలం పంజాబులో ప్రభుత్వోద్యోగిగానున్నవారు. జెంకిన్స్ అనే ఆయన సరఫరా శాఖలో గొప్ప ఉద్యోగంలో పున్నారు. గ్రామాల్లో మతవైషమ్యాలు లేవని వీరిద్దరూ నాతో చెప్పారు గ్రామాల్లో, హిందూ-ముస్లిములు శాంతియుతంగా జీవిస్తున్నారని యితరులు చెప్పగా కూడా విన్నాను. ఇదేగనక నిజమైతే చాల గొప్పవిషయం. మీదేశంలోని ప్రజలు 100 కి 90 మంది గ్రామాల్లో నివసించడంవల్ల యిది చాలముఖ్యవిషయం అనక తప్పదు" అన్నాను.

"ఇది నిజమే. దీనినిబట్టి ప్రజలలో విభేదాలు లేవని తెలుస్తుంది. రాజకీయ వేత్తలు ప్రజలలో భేదాలు కల్గిస్తున్నారని రుజువుచేస్తుంది కూడాను" అన్నారు గాంధీజీ.

"నేను న్యూఢిల్లీలో వున్నప్పుడు వొక హోటల్లో బసచేశాను. అక్కడ ముస్లింనౌకరు వున్నాడు. అతడు ముస్లింలీగ్ సభ్యుడు. పైగా పాకిస్థాన్‌వాది. మహమ్మదీయులు అల్పసంఖ్యాకులుగావున్నచోట్ల మాత్రమే హిందూ—ముస్లిం కొట్లాటలు జరుగుతూ వున్నాయనీ, హిందువులు అల్పసంఖ్యాకులుగా పున్నచోట్ల మతకలహాలు లేవని అతను చెప్పాడు" అని గాంధీజీతో అన్నాను.

"ఫిషర్‌గారూ ! మీరు మా దేశంలో చాల కొద్దికాలం వున్నారు. ప్రతి విషయాన్నీ మీరు గమనించలేరు. కాని, మీరు శోధించి, మేము (కాంగ్రెస్‌వారు) తప్పుదారిని నడుస్తున్నామనిగాని, అన్యాయస్థులమని గాని మీకు తోచితే, మీ అభిప్రాయాన్ని తప్పకుండ వెల్లడించండి" అన్నారు గాంధీజీ.

మాట్లాడుతూ గాంధీజీ వొక పూరింటికి దారితీశారు. నేనూ ఆయనతోబాటు ఆ పూరింటివద్దకు వెళ్ళాను. "ఇక్కడ నా రోగులున్నారు" అంటూ గాంధీజీ వొకరోగి మంచందగ్గరికి వెళ్ళారు. ఆ మంచంమీద జబ్బు మనిషి వొకామె కూర్చునివుంది. గాంధీజీ ఆమెతో ఐదు నిమిషాలు

మాట్లాడారు. ఆ కాస్సేపూ వారిద్దరూ నవ్వుకుంటూనే వున్నారు. "ఈమె నావద్ద చికిత్సపొందే రోగులలో ఉత్తమురాలు" అన్నారు. నన్నుచూచి గాంధీజీ.

డాక్టర్ దాస్‌గారు మాతో వున్నారు. గాంధీజీ యేమంటారో విందామని "ఆమెను డాక్టర్‌గారి పోషణకు వదలివేయడం మేలుకదూ?" అన్నాను.

"అలాకాదు. వ్యాధి నయంకావడానికి మూఢ నమ్మకం చాలా సాయపడ్తుంది" అంటూ గాంధీజీ మరో గదిలోకి వెళ్ళారు. ఆ గదిలో యెర్రకొయ్య తొట్ల తప్ప మరేమీలేవు. గాంధీజీ లోపలికి వెళ్ళగానే వొకామె లేచి తొట్లలోని బిడ్డ నెత్తుకున్నది. "ఈ శిశువు నారోగిగాదు. నా ముద్దుపాపాయి" అంటూ గాంధీజీ ఆ బిడ్డ బుగ్గలంటి చక్కిలిగింతలు పెట్టారు. శిశువు నవ్వ నారంభించింది. "ఈ బిడ్డ తండ్రి పశ్చిమోత్తర సరిహద్దురాష్ట్రంలోని బ్రిటిష్ సైన్యంలో వొక సార్జంటుగా వుంటూ వచ్చాడు. భారతీయులను కాల్చుమని పై అధికారులు అతనిని ఆజ్ఞాపించారు. అతను నిరాకరించాడు. అందుకు పదహారు సంవత్సరాల శిక్ష విధించారు. అతనిని వదలివేయుమని ప్రజలు అనేకఅర్జీలుపంపారు. అందుచేత, రెండేండ్ల నాడు అతనిని ఖైదునుండి విడిచిపెట్టారు. అప్పటికే ఆరుసంవత్సరాల శిక్షననుభవించాడు. ఇప్పుడు మాతో యిక్కడే వుంటున్నాడు" అన్నారు గాంధీజీ. తర్వాత గాంధీజీ యింటికి తిరిగివచ్చాం.

నా బసకు యెదుటి యింటిలో గాంధీజీ కార్యదర్శులలో వొకాయన కాపురమున్నారు. నేను గాంధీజీతో సంప్రదించినప్పుడు అనేకమార్లు ఆయన గాంధీజీ ప్రక్కనే కూర్చున్నారు. పొట్టిగా, నల్లగా వుంటారు. ముద్దముఖం. ఆయన 24 యేండ్లు గాంధీజీతో పనిచేసేరు. గాంధీజీ యింటినుంచి నా బసకువస్తూ ఆయన గుమ్మంవద్ద ఆగాను. ముందురోజు గాంధీజీ నాతో చెప్పినవిషయాన్నిగురించి(బ్రిటిష్ సైన్యాలు ఇండియాలో వుండవచ్చు) ఆయన అభిప్రాయాన్ని అడిగాను. "నిన్న గాంధీజీ వెలు

వరచిన భావాలు కేవలం కొత్తవి. మాకు ఆశ్చర్యాన్ని కల్గించినవి. యుద్ధంనుంచి మానవులకు మంచి కలుగుతుందనుకోను. ఏ యుద్ధంలో గాని మనం పాల్గొనరాదు'' అన్నారాయన. గాంధీజీ నూతన భావాల విమర్శన యిది. ఆయన గాంధీజీని మహాపురుషుడుగా, ఋషిపుంగవుడుగా, గురుదేవునిగా భావిస్తూన్నారు. కాని గాంధీజీ నూతన భావాలను విమర్శించడానికి ఆయన యేమాత్రం వెనుదీయలేదు. దీనినిబట్టి గాంధీజీ అనుచరులు ఆయనకు వణకేవారు కారని, గాంధీజీ తప్పు త్రోవ త్రొక్కుతున్నారని తోచినప్పుడు వారు బహిరంగంగా విమర్శిస్తారని తెలుస్తుంది. అనుచరులకు గాంధీజీ సింహస్వప్నంవంటివారు కారు. తర్వాత ఈ కార్యదర్శి పేరేమని విచారించాను. ఆయనపేరు కిషోరీలాల్ ఘనష్యామ్‌లాల్ మష్రువాలా అని చెప్పారు.

మధ్యాహ్నం భోజనంచేస్తూవున్నాం. "ఫిషర్‌గారూ! మీ గిన్నె యివ్వండి. మీకు కొంచం కూరబెటతాను" అన్నారు గాంధీజీ.

"గడిచిన రెండురోజులలో నాలుగు మార్లు ఆకుకూరలు, కాయగూరలు తిన్నాను. కాయగూరలు తినవలెనని లేదు" అన్నాను.

"కూరగాయలు మీకు సయించవా?'' అని గాంధీజీ ప్రశ్నించారు.

"సయించకేం. ఈ కూరగాయల రుచి సరిపడలేదు గాని" అని బదులు చెప్పాను.

"అలాగా! కావలసినంత ఉప్పు, నిమ్మపండురసం వుపయోగించాలి" అన్నారు గాంధీజీ.

"రుచిని చంపుకోమంటారా?" అని అడిగాను.

"లేదు. చంపుమనలేదు. ఇంకా రుచిగా చేయుమంటాను'' అన్నారు గాంధీజీ.

"మీ అహింసాతత్వం రుచిని చంపడానికైనా వొప్పుకునేలా లేదే!'' అన్నాను.

"మానవులు వొక్క రుచినిమాత్రమే చంపేటట్లయితే నేను వొప్పుకునేవాణ్ణే'' అన్నారు గాంధీజీ.

నాకు చెమటపట్టింది. ముఖాన్ని, మెడను చేతి రుమాలతో తుడుచు కున్నాను. గాంధీజీతో "నేను యీమారు ఇండియాకు వచ్చినప్పుడు...." అని ఆగాను. గాంధీజీ యేదో నములుతూ వున్నారు. నా మాట విన్నట్లు లేదు. అందువల్ల ఆగాను.

గాంధీజీ నా వైపు చూడకుండానే "ఆ ! ఈ మారు మీరు ఇండియాకు వచ్చినప్పుడు ?" అని ప్రశ్నించారు.

"మీరు సేవాగ్రామంలో యేర్ కండిషనింగ్ (విద్యుచ్ఛక్తి సాయంతో యిండ్లను, రైలుపెట్టెలను వేసవికాలంలో చల్లగాను, చలి కాలంలో వెచ్చగాను మార్చగల విధానం) నైనా యేర్పాటు చేయాలి, లేదా వైస్రాయిగారి భవనానికైనా కాపురం మార్చాలి" అన్నాను.

తానేమో నా కోరిక నామోదించినట్లు గాంధీజీ "అలాగే" అన్నారు.

భోజనానంతరం కొంతసేపు నిద్రపోయాను. నిద్రలేచిన తర్వాత గాంధీజీతో మాట్లాడిన విషయాలు వ్రాసుకున్నాను. తదనంతరం సైమన్ కమీషన్ రిపోర్టు చదివాను. ఈ రిపోర్టు 1930 మేలో పార్లమెంటుకు నివేదింపబడినది. ఈ రిపోర్టు మొదటిభాగంలో 59 వ పుటలో యిలా వున్నది:—"సింధు రాష్ట్రపు బ్రిటిష్ కమీషనరుకు అపరిమితమైన స్వాతంత్ర్యం వున్నదని, అంత స్వాతంత్ర్యం అనవసరమని ఆ రాష్ట్రంలోని అల్పసంఖ్యాకులైన హిందువుల అభిప్రాయం. సింధురాష్ట్రాన్ని బొంబాయి నుంచి వేరు పరచాలని అక్కడి ముస్లిములు ఆందోళన చేస్తున్నారు. ఈ ఆందోళనకు కారకులు, దానికి దోహదమిచ్చేవారు సింధురాష్ట్రంలోని ముస్లిములు కారు. ఇతరప్రాంతాల్లోని మహమ్మదీయ నాయకులు యీ ఆందోళనను సాగిస్తున్నారు. బెలుచిస్థాన్, పశ్చిమోత్తర సరిహద్దు రాష్ట్రము, పంజాబులలో ముస్లిములు బహుసంఖ్యాకులు. ఈ రాష్ట్రాల నానుకునివున్న సింధురాష్ట్రం బొంబాయినుంచి వేరుచేయబడి స్వతంత్ర మైతే, యీ నాలుగు ప్రాంతాలూ మహమ్మదీయ ప్రాంతాలుగా (బహు

సంఖ్యాకులు ముస్లిములు గనుక) వుంటాయని. హిందువుల ఆధిక్యత అస్తమిస్తుందని ముస్లిముల నమ్మకం."

మధ్యాహ్నం నియమిత సమయానికి గాంధీజీని కలుసుకున్నాను. సైమన్ రిపోర్టునుంచి పై విషయాన్ని ఆయనకు చదివి వినిపించాను. రిపోర్టులోని యీ ఘట్టం గాంధీజీ ప్రొద్దున చెప్పినమాటలను ఋజువు పరుస్తూ వున్నదని వొప్పుకున్నాను. ముస్లిం ప్రజలకన్న ముస్లిము నాయకులే దేశవిభజనకు యెక్కువ ఆందోళన చేసేవారని దీనివల్ల స్పష్టమౌతూ వున్నదని గాంధీజీతో అన్నాను.

"ఔను" అన్నారు గాంధీజీ.

"ముస్లిం నాయకుల భయానికి (హిందువులు తమ్ము అణగ ద్రొక్కుదురని) యేమైనా ఆధారంవుందా? హిందువులు తమ్ము అణగ ద్రొక్క ప్రయత్నిస్తున్నారని ముస్లిము ప్రజలకన్న హెచ్చుగ ముస్లిం నాయకులు అనుమానించి వుండవచ్చు. మహమ్మదీయులమీద ఆధిపత్యం సంపాదించాలని హిందువులు ప్రయత్నించలేదని మీరు నిష్పాక్షికంగా చెప్పగలరా?'' అని ప్రశ్నించాను.

"అక్కడక్కడ వ్యక్తిగతంగా కొందరికి చెడ్డతలంపులు వుండవచ్చు. కాని కాంగ్రెస్ సంస్థకు—హిందువులు ముస్లిముల వణచవలెనన్న చెడుతలంపు లేదు. రాష్ట్రాలకు వీలైనంత స్వాతంత్ర్య మివ్వాలి. హింస, దౌర్జన్యం, ఆధిపత్యం మొదలైన దురాశలకు విరోధిని నేను. తమ ప్రజను గాని, యితర రాజ్యాలనుగాని అణగద్రొక్క ప్రయత్నించే ముష్కరబల ప్రభుత్వాలలో నాకు నమ్మకంలేదు. అలాంటప్పుడు నేను హిందువుల ఆధిపత్యానికి యెలా అంగీకరిస్తాను? "హిందూ ఆధిపత్యం" అన్న నినాదం, ముస్లిం ప్రజలలో పలుకుబడి సంపాదించను ముస్లిం నాయకులు లేవదీసిన ప్రచారక పదం'' అన్నారు గాంధీజీ.

"కాంగ్రెస్ పార్టీనిగురించి మిమ్ము అనేక ప్రశ్నలు అడగవలయునని వున్నాను. కాంగ్రెస్‌పార్టీ అత్యంత ధనికులైన భారతీయ వర్తకుల

చేతుల్లో కీలుబొమ్మ అనీ, మీరు బొంబాయి మిల్లు యజమానుల చెప్పు చేతుల్లో వుండడంచేత వారు మీకు కావలసినంత ద్రవ్యసహాయం చేస్తున్నారనీ గొప్ప గొప్ప బ్రిటిష్‌వారు చెప్పగా విన్నాను. ఈ మాటల్లో యేపాటి సత్యం వున్నది?" అని గాంధీజీని ప్రశ్నించాను.

"మీరు చెప్పినవన్నీ నిజమే. దురదృష్టవశాత్తు మేము ధనికుల మీద ఆధారపడుతున్నాం. కాంగ్రెస్ కార్యక్రమాన్ని జయప్రదంగా సాగించ గలిగినంత డబ్బు కాంగ్రెస్‌కు లేదు. ఆరంభంలో ప్రతి సభ్యునివద్ద సాలుకు ఎనిమిది సెంట్లు (నాలుగణాలు) వసూలుచేయాలనుకున్నాం. కాని ఆ డబ్బు చాల్లేదు. మా తొలిప్రయత్నం కొనసాగలేదు" అన్నారు గాంధీజీ.

"కాంగ్రెస్ ఖర్చులో యెన్నోవంతు ధనవంతులనుంచి వస్తుంది?" అని ప్రశ్నించాను.

"కాంగ్రెస్ ఖర్చంతా ధనికులే భరిస్తున్నారు. ఒక్క ఉదాహరణ చూడండి—ఈ ఆశ్రమంలో ప్రస్తుతంకన్నా పేదజీవనాన్ని మేము గడప గలం. ఇంతకన్నా తక్కువ డబ్బుతో ఆశ్రమాన్ని సాగించగలం. కాని అంత నిరుపేద జీవనాన్ని మేమిప్పుడు గడపడంలేదు. ఈ ఖర్చులకయ్యే డబ్బు మా ధనికమిత్రులు యిస్తున్నారు" అన్నారు గాంధీజీ.

"ధనికులనుంచి కాంగ్రెస్ ద్రవ్యసహాయం పొందుతూంది గనుక అందు కనుగుణ్యంగా తన రాజకీయాలను సాగించవద్దా? నైతిక బాధ్యత కొంత యేర్పడవచ్చు గదా?" అన్నాను.

"అటువంటి సహాయానికి మేము కొంత ఋణపడినట్లే. ఈ ఋణం పైకి అగుపడేదికాదు. నిజంలో, యీ ధనిక మిత్రుల మనోభావాలు కాంగ్రెస్‌ను యేమాత్రము మార్చలేదు. ఈ ధనికులు, వొక్కొక్కప్పుడు, కాంగ్రెస్ ఆశయమైన సంపూర్ణ స్వాతంత్ర్యాన్నిచూచి భయపడుతున్నారు" అన్నారు గాంధీజీ.

"కొద్దిరోజులక్రితం 'హిందుస్థాన్ టైమ్స్' (ఢిల్లీనుంచి వెలువడే

ఆంగ్ల దినపత్రిక) లో యీ వార్తను చదివాను—“జీవితావసరాలు ప్రియమైనాయని బిర్లాగారు తమ నేతమిల్లులలో శ్రామికుల కూలీలు హెచ్చించారు.” ఈ వార్తతోబాటు పత్రికాధిపతులు తమ వ్యాఖ్యానాన్నికూడా ప్రకటించారు—“ఏ యితరమిల్లు సొంతదారుడు శ్రామికులకు యీపాటి సాయంచేయలేదు.” ‘హిందూస్థాన్ టైమ్స్’ కాంగ్రెస్ పత్రిక కదా?” అని ప్రశ్నించాను.

“కాదు, కాదు. ‘హిందుస్థాన్ టైమ్స్’ కేవలం బిర్లాగారి సొంత సొమ్ము” అంటూ నవ్వారు గాంధీజీ. “నా కడపటి కుమారుడు ఆ పత్రికా సంపాదకుడు గనుక మీరు నన్ను యీ ప్రశ్న అడిగారనుకుంటాను. ఆ వార్తలోని విషయాలు నిజమే. కాని, ఆపత్రికకు కాంగ్రెసుకు సంబంధం లేదు....కాంగ్రెస్ ధనికులమీద ఆధారపడి వుండడం నిజంగా మా దురదృష్టం. ‘దురదృష్టం’ అంటున్నాను. అంతేగాని, కాంగ్రెస్ కార్యక్రమంతో వారు జోక్యం కలుగజేసుకోరు” అన్నారు గాంధీజీ.

“సాంఘిక సమస్యలను, ఆర్థిక సమస్యలను నిర్లక్ష్యపరచి కేవలం జాతీయత మీదనే మీదేశపు దృష్టినంతా కేంద్రీకరించడం యీ ధనికుల జోక్యంవల్లనేగదా?” అని ప్రశ్నించాను.

“కాదు. కాంగ్రెస్ తరచు పండితనెహ్రూ ప్రోద్బలంమీద అభివృద్ధికి దోహదమైన సాంఘిక, ఆర్థిక కార్యక్రమాలకు పూనుకుంది. ఈ కార్యక్రమాలను గురించిన కరపత్రాలను మీ కిస్తాను” అన్నారు గాంధీజీ.

“ఈ సాంఘికంగా వచ్చేమార్పులన్నీ యెన్నడో మీకు స్వరాజ్యం వచ్చినప్పుడు ఆచరణలోకి వచ్చేవేగదా?” అన్నాను.

“కాదు. స్వరాజ్యం వచ్చినప్పుడుగాదు. రాష్ట్రాలలో కాంగ్రెస్ అధికారంలోవున్నప్పుడు (1937-1939) కాంగ్రెస్ మంత్రులు అనేక సంస్కరణలను అమలులో పెట్టారు. కాంగ్రెస్ మంత్రులు రాజీనామా లిచ్చిన తర్వాత బ్రిటిష్ అధికారులు ఆ సంస్కరణల నన్నిటినీ రద్దుచేశారు.

గ్రామాల్లో, పాఠశాలల్లో, అనేక యితర విషయాల్లోగూడా సంస్కరణ లను తీసుకొనివచ్చాం" అన్నారు గాంధీజీ.

"మీ గ్రామాలలో రైతులు, పుట్టుటనుంచి గిట్టుటవరకు, వడ్డీ వ్యాపారికి (షాహుకారుకు) ఋణపడి బాధపడుతూ వుంటారనీ, యిది భారతీయ దుర్గతికి ముఖ్యకారణమనీ విన్నాను. ఈ విషయాన్నే సైమన్ రిపోర్టులోకూడా చదివాను. ఇక్కడ మీదేశంలో యెటువంటి పరిస్థితులు వున్నవో అటువంటి పరిస్థితులే వున్న యూరపు దేశాలలో ఎక్కువ వడ్డీలను దోచుకుంటూన్న షాహుకారులను నాశనంచేయడానికి ఔదార్య బుద్ధిగల ప్రజలు, ప్రభుత్వాలు భూమి తనఖా బ్యాంకులను స్థాపించారు. మీ ధనిక మిత్రుల్లో కొందరు భూమి తనఖా బ్యాంకులను యెందుకు స్థాపించకూడదు? దాన ధర్మబుద్ధితోగాదు, కేవలం వ్యాపారదృష్టితో వీటిని స్థాపించవచ్చు! సాగించవచ్చు. నూటికి 40 నుంచి 70 వరకు సాలు వడ్డీ సంపాదించే బదులు, నూటికి రెండు లేక మూడు సాలువడ్డీ మాత్రమే దొరుకుతుంది. వారి డబ్బు క్షేమంగా వుంటుంది. కొద్దిలాభం సంపాదిస్తారు. దేశసేవా చేసినవారౌతారు" అన్నాను.

"అది అసాధ్యం. ప్రభుత్వశాసనం లేకుండా అది జరిగేపనిగాదు" అని గాంధీజీ జవాబిచ్చారు.

"ఎంచేత?" అని ప్రశ్నించాను.

"రైతులు తమ బాకీలు తీర్చరు గనుక" అన్నారు గాంధీజీ.

"తన భూమిని, తన జీవితాన్ని షాహుకారుకు కుదువబెట్టే బదులు కొద్ది వడ్డీకి అప్పు పుచ్చుకోవడం తనకు లాభకరమని రైతుకు అర్థం కాదా?" అని ప్రశ్నించాను.

"వడ్డీ వ్యాపారం మా దేశంలో చాల పురాతన సంస్థ. తరతరాలుగా సాగుతూవున్నది. ఇది గ్రామాల్లో స్థిరంగా పాదుకుపోయింది. మాకు స్వాతంత్ర్యం రానిది మీసలహా అనుసరించను వీలులేదు" అన్నారు గాంధీజీ.

"స్వతంత్ర భారతములో యెటువంటి మార్పులు జరుగుతవి? రైతుల స్థితిని అభివృద్ధి పరచడానికి మీ కార్యక్రమం యేమిటి?" అని ప్రశ్నించాను.

"భూములను రైతులు తమ సొంతం చేసుకుంటారు. మీరు భూములను అపహరించండి" అని మేము రైతులకుచెప్ప నక్కరలేదు. వారే కాజేస్తారు" అన్నారు గాంధీజీ.

"భూములకు బదులు, వారు, భూస్వాములకు డబ్బు యిస్తారా?" అని అడిగాను.

"ఇవ్వరు. ఆర్థికంగా అది వీలయ్యే పనిగాదు. ధనిక మిత్రులకు మేము ఋణపడి వున్నాము. మా అభిప్రాయాలను బహిరంగంగా చెప్పుతూనేవున్నాం. ప్రతిగ్రామం తన స్వతంత్ర జీవితాన్ని సాగించగల స్వయం పాలక సంస్థ ఔతుంది'' అన్నారు గాంధీజీ.

"కాని అప్పుడు జాతీయ ప్రభుత్వం వుంటుందిగా?" అన్నాను.

"జాతీయ ప్రభుత్వం వుండదు" అన్నారు గాంధీజీ.

''రైలు మార్గాలను, టెలిగ్రాఫ్ శాఖను తదితర విషయాలను పరిపాలించడానికి జాతీయ పరిపాలక విధానం వొకటి వుండవలెగదా?'' అన్నాను.

"మా దేశంలో రైలుమార్గాలులేవని నేను కంట తడియైనా పెట్టను" అన్నారు గాంధీజీ.

"మరి రైలుమార్గాలు లేకపోతే రైతుకష్టా లెక్కువగావా? పట్టణాల్లో వుత్పత్తయైన కొనుగోలు వస్తువులు రైతుకు కావాలి. తన పంటను దేశంలోని యితర కోస్తాల్లో, యితర ప్రాంతాల్లో, విదేశాల్లో అతను అమ్ముకోవాలి. గ్రామానికి విద్యుచ్ఛక్తి, నీటి వసతి అత్యవసరం. ప్రతి గ్రామం తనంతట తాను ప్రత్యేకంగా తన వుపయోగానికి విద్యుచ్ఛక్తి ఉత్పత్తి కేంద్రాన్ని నిర్మించగలదా? నీటి వసతికి కావలిసిన ఆనకట్టలు, కాలువలు, చెరువులు కట్టగలదా? సింధురాష్ట్రంలోని సుక్కూర్ బరాజ్

వంటి మహత్తర నిర్మాణాన్ని యే గ్రామం నెరవేర్చగలదు ?" అని ప్రశ్నించాను.

"ఆ : సుక్కూర్ బరాజ్ మాకెంతో ఆశాభంగం కల్గించింది. సింధురాష్ట్రం అంతను అప్పులపాలు చేసింది" అన్నారు గాంధీజీ.

"ఔను. ఆ విషయం నాకూ తెలుసు. కాని కావలసినంత బీడు భూమిని సాగుకిందికి తెచ్చింది. ప్రజకు మహోపకారి అయింది" అన్నాను.

"నా భావాలు యెలావున్నా కేంద్ర ప్రభుత్వం యేర్పడుతుందని నాకు తెలుసు. ఏది యెలావున్నా పాశ్చాత్య ప్రజాస్వామ్య పద్ధతిలో నాకు నమ్మకం లేదు" అన్నారు గాంధీజీ, తల వూపుతూ.

ఈ సంభాషణను పెంచవలయునన్న కోర్కెతో "మరి ఇండియా యేం చేయాలని మీ వుద్దేశం ?" అని ప్రశ్నించాను.

"ఇండియాలో 7,00,000 గ్రామాలున్నాయి. ప్రతి గ్రామం ఆగ్రామ వాసులందరి యిష్టానుసారం పరిపాలింప బడుతుంది. ప్రతి గామీణునికీ యెన్నిక హక్కు వుంటుంది. కాని, దేశపరిపాలనలో 40 కోట్ల ప్రజకు 40,00,00,000 వోట్లుండవు. 7,00,000 గ్రామాలకు గ్రామానికి వొక వోటు చొప్పున దేశ వ్యవహారాలను తీర్మానించను హక్కు వుంటుంది. గ్రామాలు తమ జిల్లా ప్రభుత్వాలను యెన్నుకుంటవి. ఆ జిల్లాప్రభుత్వాలు రాష్ట్రప్రభుత్వాలను, రాష్ట్రప్రభుత్వాలు దేశానికంతటికి వొక అధ్యక్షుణ్ణి యెన్నుకుంటవి" అన్నారు గాంధీజీ.

"మీ ప్రభుత్వ విధానం యించుమించు సోవియట్ విధానంవలె వున్నదే !" అన్నాను.

"ఆ విషయం నాకు తెలియదు. ఉన్నా ఫరావాలేదు" అన్నారు గాంధీజీ.

"సరే ! గాంధీజీ, కాంగ్రెస్‌ను గురించి రెండవ ప్రశ్నను అడగ దలచుకున్నాను. కాంగ్రెస్ నిరంకుశ సంస్థ అని దూషింపబడుతూవుంది. షూస్టర్, వింట్ అనే యిరువురు ఆంగ్ల రచయితలు క్రొత్తగా పుస్తకం

వొకటి వ్రాశారు. ఆ పుస్తకంపేరు "ఇండియా—ప్రజాస్వామ్యం." ఆ పుస్తకంలో, 1939 లో కాంగ్రెస్‌వారు మంత్రిపదవులకు రాజీనామా యిచ్చినప్పుడు ప్రజాభిప్రాయాన్ని గమనించలేదని, జిల్లా కాంగ్రెస్ నియంతల ఆజ్ఞల ప్రకారం రాజీనామా యిచ్చారని కాంగ్రెస్ సంస్థమీద నేరారోపణ చేశారు'' అన్నాను.

"అది కేవలం అబద్ధం. తీర్మానాలన్నీ లండన్‌లోని హౌస్ ఆఫ్ కామన్స్ (ప్రజాప్రతినిధి సభ)లో చేయబడుచున్నవా? లేక పార్టీల సమావేశాల్లో, లండన్ క్లబ్బుల్లో చేయబడుచున్నవా? కాంగ్రెస్ అధికారులు కాంగ్రెస్ సభ్యులచే యెన్నుకొనబడినవారు. కాంగ్రెస్ మంత్రులు కాంగ్రెస్ సభ్యులు. కనుక కాంగ్రెస్ సిద్ధాంతాల ప్రకారం నడుచుకుంటారు. బ్రిటన్లో ప్రజాస్వామ్యం యెలా పనిచేస్తూవున్నదీ, సర్ సామ్యూల్ హోర్‌గారు (1935 లో ఇండియా కార్యదర్శి) కొన్ని విషయాలు నాతో చెప్పారు" అన్నారు గాంధీజీ.

"బ్రిటిష్ రాజకీయవేత్తల్లో సర్ సామ్యూల్ హోర్‌గారు మీకు చాలా యిష్టులువలె వున్నదే?" అన్నాను. అందరం నవ్వనారంభించాం.

"ఆయన యెంతటి మనిషియో నాకెప్పుడో తెలుసు. అమెరికా విషయాలు తెలిసిన మీబోటివారికి ప్రజాస్వామంలో మోసమెంత వున్నదో చెప్పవలెనా? స్వతంత్ర భారతము ప్రపంచంలోని యితర దేశాలవలె నడుస్తుందనుకోను. ప్రభుత్వ విధానంలో కొత్త పంథాలను మేము ప్రపంచానికి చూపగలం" అన్నారు గాంధీజీ.

"మీతో కొద్ది నిమిషాలు సుభాస్ చంద్రబోస్‌గారిని గురించి మాట్లాడవలసి వుంది. బోస్ విమాన అపాయంలో మరణించారని వార్త వచ్చినప్పుడు (తర్వాత యీ వార్త అబద్ధమని తేలింది) మీరాయన తల్లిగారికి మీ సంతాపాన్ని తెల్పుతూ తంతి నంపారు. ఈ విషయం వినగానే నేను అత్యాశ్చర్య పడ్డాను" అన్నాను.

"తర్వాత అబద్ధమని తేలినవార్తను బట్టి, తొందరపడి సంతాపాన్ని

వెలిబుచ్చాననియా మీ ఆశ్చర్యం ?" అని గాంధీజీ ప్రశ్నించారు.

"కాదు, కాదు, ఫాసిస్ట్ జర్మనీవెళ్ళి ఆ దేశంతో సంబంధం కలిగి వున్న వ్యక్తి మరణానికి మీరు సంతాపం వెలిబుచ్చారని" ప్రత్యుత్తర మిచ్చాను.

"దేశ భక్తులలో బోస్ వుత్తముడని నా నమ్మకం. నేనుసంతాపం వెలిబుచ్చడానికి కారణం యిదే. ఆయన పొరబడి వుండవచ్చు. తప్పు త్రోవ తొక్కి వుండవచ్చు. పొరబడినాడని నా అభిప్రాయం. బోస్‌నుచాలసార్లు, అనేక విషయాల్లో నేను యెదిరించాను. ఆయన కాంగ్రెస్ అధ్యక్షుడు గాకుండా, రెండుమార్లు అడ్డుపడ్డాను. నా అభిప్రాయాలకు, ఆయన అభిప్రాయాలకు వైరుధ్యమున్నా ఆయన అధ్యక్షుడైనాడు. ఆయన అమెరికాకో, రష్యాకో ఇండియాకు సాయంచేయుమని, అడగను వెళ్ళాడనుకుందాం. అప్పుడు మేలనిపించేదా ?" అని అడిగారు గాంధీజీ.



సుభాస్ చంద్ర బోస్

"ఔను, తప్పకుండా మేలనిపించేది. ఎవరిసాయం కోరుతున్నామన్న విషయం యెంతో మార్పుతెస్తుంది" అన్నాను.

"భారతదేశాన్ని స్వతంత్రభూమిగా చేయుటలో నాకెవ్వరి సాయమూ అక్కరలేదు. మేమే స్వయంగా స్వాతంత్ర్యం సంపాదించాలని నా కోరిక" అన్నారు గాంధీజీ.

"వ్యక్తులు, జాతులు యితరదేశాలకు స్వాతంత్ర్య సాధనలో సాయపడిన నిదర్శనాలు చరిత్రలో యెన్నో వున్నాయి. బ్రిటన్‌నుంచి స్వాతంత్ర్యం సంపాదించ ప్రయత్నిస్తూన్న అమెరికాకు సాయపడడానికి—ఫ్రాన్స్ నుంచి లఫెట్టి అమెరికాకు వెళ్ళాడు. మొసమొన్న స్పెయిన్‌లో ప్రజాస్వామ్యాన్ని నిలబెట్టడానికి వేనవేలు అమెరికన్లు ప్రాణాల్ని అర్పించారు" అన్నాను.

"నిజమే, వ్యక్తులు త్యాగాలు చేశారు. కాని అమెరికా ఇంగ్లండుకు మిత్రరాజ్యం. ఇంగ్లండు మమ్మ బానిసలనుచేసి నిరంకుశంగా పరిపాలిస్తూంది. ఫాసిస్టులను వోడించిన తర్వాత ప్రజాస్వామ్యాలు (అమెరికా, ఇంగ్లండు మొదలైన మిత్రరాజ్యాలు) ప్రపంచాన్ని మంచికి మార్చగలవని నాకు నమ్మకంలేదు. నేటి ప్రజాస్వామ్యాలు యుద్ధంలో గెలిచిన మరునాడు యిప్పటి ఫాసిస్టులవలె నిరంకుశం కావచ్చు" నన్నారు గాంధీజీ.

"ఈ విషయంలో మన యిద్దరి అభిప్రాయాలూ యేకీభవించవు. సాంఘిక సమస్యలను మరిచిపోయి అహర్నిశలు భారతీయులు తమ స్వాతంత్ర్య సమస్యనే యోచించడం శోచనీయం. బోస్‌గారు యింకా యవ్వనంలో వున్నారు. మహత్తర కార్యాలను సాధించగలరు. ఆయన జర్మనీని చూచి ఫాసిజంమీద వ్యామోహం చెంది, ఇండియాకువచ్చి బ్రిటిష్ వారిని తరిమి మీ దేశాన్ని స్వతంత్ర దేశంగాచేసి ఫాసిస్టురాజ్యంగా మార్చవచ్చు. అప్పుడు మీరు బ్రిటిష్ పరిపాలనకన్న నికృష్టమైన పరిపాలన క్రింద కృశించవలసి వుంటుంది" అన్నాను.

"బ్రిటిష్ పరిపాలనలో ప్రబలమైన ఫాసిస్టు బీజాలువున్నాయి. ఇండియాలో మేము నిత్యమూ యీ బ్రిటిష్ ఫాసిస్ట్ శక్తుల ప్రాభవాన్నే అనుభవిస్తూవున్నాం, చూస్తూవున్నాం. ఈయుద్ధంలో గెలువడానికి తాము అర్హులని, యుద్ధానంతరం ప్రపంచాన్ని మంచి దశకు తెస్తారని యిప్పుడే రుజువు చేయాలి. అలా రుజువుచేయ దలచుకున్న భారతదేశంలో తమ

అధికారాన్ని విసర్జించి ఆత్మశుద్ధి చేసుకోవాలి. మీ అధ్యక్షుడు (రూజ్‌వెల్ట్) నాలుగు స్వాతంత్ర్యాలనుగురించి మాట్లాడుతూన్నాడు. ఈ నాలుగు స్వాతంత్ర్యాల్లో స్వతంత్రంగా వుండడానికి అవసరమైన స్వాతంత్ర్యం యిమిడివుందా? జర్మనీ, ఇటలీ, జపానులలో ప్రజాస్వామ్యం కోసం మేము పోట్లాడవలెనట. మాకు ప్రజాస్వామ్యం లేనప్పుడు యెక్కడో ప్రజాస్వామ్యంకోసం మే మెందుకు పోట్లాడుతాం?" అన్నారు గాంధీజీ.

అంతట్లో ఇంటర్నేషనల్ న్యూస్ సర్వీస్ (అంతర్జాతీయ సమాచార సమితి)కు చెందిన ఛాప్లిన్, 'టైమ్,' 'లైఫ్' అను అమెరికను పత్రికలకు విలేఖరియైన బెల్డన్ వచ్చారు. బెల్‌డన్ చైనాలో చాలాయేండ్లు గడిపినవాడు. ఈ మధ్యనే జనరల్ స్టిల్‌వెల్ సైన్యంతో బర్మానుంచి ఇండియాకు వచ్చి చేరాడు. వీరిద్దరు గాంధీజీతో మాట్లాడడానికి వచ్చారు. వారి సంభాషణ వినదలచుకుంటే ఆగమని అన్నారు గాంధీజీ. వారిద్దరినీ చూచి "మీరు నేలమీద కూర్చోగలరా?" అని గాంధీజీ అడిగారు. వారు నేలమీద కూర్చున్నారు. "ఒక అమెరికన్ నన్నింతసేపూ శల్యపరీక్ష చేశారు. ఇక మీ పరీక్షను మొదలుబెట్టండి" అన్నారు, వారి నుద్దేశించి గాంధీజీ. వారితో గాంధీజీ అరగంటసేపు మాట్లాడారు. తర్వాత వారిద్దరినీ నా బసకు తీసుకు వెళ్ళాను. దాహమిచ్చాను. నా బసలోనే వారు స్నానం చేయాలని బలవంతం చేశాను.

మధ్యాహ్నం మహదేవ దేశాయిగారు నా బసకు వచ్చారు. గాంధీజీ కోరికప్రకారం నిన్న నేను వ్రాసియిచ్చిన సందేహాలకు సమాధానాలు తెచ్చారాయన. గాంధీజీ కార్యదర్శులలో యీయన ముఖ్యుడు. ఈ సమాధానాలు రెండు తెల్లకాగితాలమీద టైపుచేయబడి వున్నాయి. అక్కడక్కడ గాంధీజీ స్వయంగా దిద్దివున్నారు. నేను గాంధీజీ నడిగిన ప్రశ్నలు యీ దిగువ ఉత్తరంలో పొందుపరుప బడినవి—

ప్రియమైన గాంధీజీ,

గడచిన కొద్దిరోజులలో మన యిర్వురి సంభాషణల నాధారంచేసుకొని యీ దిగువ ప్రశ్నలను మీకు పంపుచున్నాను. వీటికి పూర్తి జవాబిస్తారని నమ్మకం. ఈ చను వుతీసుకున్నందుకు క్షమింతురుగాక.

(1) ఇండియానుంచి వెంటనే వైతొలగమని బ్రిటిష్ ప్రభుత్వాన్ని మీరు కోర్తున్నారు. బ్రిటిష్‌వారు వెళ్ళిన వెంటనే జాతీయ ప్రభుత్వాన్ని భారతీయులు స్థాపించగలరా? అప్లేర్పడు జాతీయ ప్రభుత్వంలో యేయే పార్టీలు, యేయే మతాలు పాల్గొంటవి?

(2) అలా యేర్పడే భారత జాతీయ ప్రభుత్వం, మిత్రరాజ్యాలు మీదేశాన్ని మూల స్థానంగా నుంచుకొని జపాన్‌మీద, యితర అక్షరాజ్యాల మీద యుద్ధం సాగించడానికి అనుమతిస్తుందా?

(3) ఫాసిస్ట్ దుష్టశక్తుల నెదిరి మిత్రరాజ్యాలు చేస్తున్న యీ యుద్ధానికి జాతీయ ప్రభుత్వం మరేవిధంగా సాయపడగలదు?

(4) మిత్రరాజ్యాలకు భారత దేశానికి కలిగే యీ పరస్పర సంబంధం వొక వొడం బడికగా, లేక ఒక పరస్పర సహాయ సంధిగా స్థిరపడవలెనన్న కోర్కె మీకుందా?

విధేయుడు

లూయీ ఫిషర్

తన సమాధానాలకు గాంధీజీ "ముఖ్యమైన ప్రశ్నలు" అన్న శీర్షిక నిచ్చారు. ఈ ప్రశ్నలు—సమాధానాలు 14-6-1942న 'హరిజన్'లో ప్రచురింపబడినవి.

నా నూతన ప్రతిపాదన (క్విట్ ఇండియా-బ్రిటిష్‌వారు మా దేశం వదలి వెళ్ళాలి) ను గురించి వొక మిత్రుడు నాతో చర్చించాడు. మా చర్చలు యింతవరకు వొక స్థిరరూపం దాల్చనందున తన సందేహాలను ప్రశ్నలరూపంగా స్పష్ట పరచుమని ఆ మిత్రుణ్ణి కోరాను. అతను వొప్పుకొని యీ దిగువ ప్రశ్నలు పంపాడు—

(1) ప్రశ్న:—ఇండియానుంచి వెంటనే వెళ్ళుమని బ్రిటిష్ ప్రభుత్వాన్ని మీరు కోర్తున్నారు. వారు వెళ్ళినవెంటనే జాతీయ ప్రభుత్వాన్ని భారతీయులు స్థాపించ

గలరా? అట్లు యేర్పడు జాతీయ ప్రభుత్వంలో యేయే పార్టీలు, యేయే మతాలు పాల్గొంటవి?

సమాధానం:—నా ఉపపాదన కేవలం వొక్కరికి (బ్రిటిష్ వారికి) చెందినదే. భారతీయులు యేంచేస్తారు? యేంచేయరు? అన్న విషయాలతో నిమిత్తం లేకుండా బ్రిటిష్ ప్రభుత్వం తన బాధ్యతను నెరవేర్చాలని నా కోరిక. బ్రిటిష్ వారు వెళ్ళిపోగానే కొంత అల్లకల్లోలం జరగవచ్చని నా వూహ. కాని, వారు సక్రమ పద్ధతిని వెళ్తే వెంటనే నేటి ప్రజానాయకులనుంచి వొక తాత్కాలిక ప్రభుత్వాన్ని యేర్పాటుచేయ వీలౌతుంది. లేక మరొకటి సంభవించవచ్చు. దేశం, జాతి విషయం గమనించకుండా కేవలం స్వలాభాపేక్షతో ప్రవర్తించే వారు కొందరు యేకమై దుష్టశక్తులను వశపరచుకొని, యేదో వొకవిధంగా యెచ్చోటనో వొకచోట అధికారాన్ని హస్తగతం చేసుకో ప్రయత్నించవచ్చు. కాని మా దేశంనుంచి బ్రిటిష్‌వారి అధికారం పూర్తిగా, సక్రమ పద్ధతిని వెడలిపోతే తెలివిగల దేశనాయకులు తమ బాధ్యతను గుర్తిస్తారని నా నమ్మకం. తమ భేదాలను తాత్కాలికంగానైనా మరచిపోయి వొక తాత్కాలిక ప్రభుత్వాన్ని స్థాపిస్తారని నా నమ్మకం. దేశీయ నాయకులందరు కూడి యేదో యేర్పాటుచేయ ప్రయత్నించినప్పుడు యీ నాయకులనుండి వ్యక్తులనుగాని, పార్టీలనుగాని వేరు పరచి దూరంగావుంచే అధికారశక్తి యేదీ వుండదు. కనుక వ్యక్తులకు, పార్టీలకుగూడా వోపిక అలవడుతుంది. అటువంటి పరిస్థితులు యేర్పడినపుడు బహుశ కాంగ్రెస్, ముస్లింలీగ్, స్వదేశ సంస్థానాలు—యీ మూడు సంస్థల ప్రతినిధులు సంప్రదించి తాత్కాలిక ప్రభుత్వాన్ని యేర్పాటు చేయవచ్చు. ఇవన్నీ కేవలం వూహలే.

(2) ప్రశ్న—అలా యేర్పడే భారత జాతీయ ప్రభుత్వం మీదేశాన్ని మిత్రరాజ్యాలు మూలస్థానంగా నుంచుకొని జపాన్‌మీద, యితర అక్షరాజ్యాలమీద యుద్ధం సాగించడానికి అనుమతిస్తుందా?

సమాధానం:—జాతీయప్రభుత్వం యేర్పడిన దనుకుందాం. ఆ జాతీయ ప్రభుత్వం నే ననుకున్నరీతిని పనిచేస్తే ప్రప్రథమంగా మిత్రరాజ్యాలతో సంధిచేసుకుంటుంది. మా దేశ రక్షణ నిమిత్తం ఆక్రమణ నెదిరి పోరాడను యీ సంధి అవసరం. ఫాసిస్టు దేశాలతో ఇండియాకు యెటువంటి సంబంధమూ వుండదు. నైతికంగాకూడా మిత్రరాజ్యాలకు భారతదేశం సాయపడవలసి వుంటుంది.

(3) ప్రశ్న:—ఫాసిస్టు దుష్టశక్తుల నెదిరి మిత్రరాజ్యాలు చేస్తూన్న యీ యుద్ధానికి మీ జాతీయ ప్రభుత్వం మరేవిధంగా సాయపడగలదు?

సమాధానం:—మనం వూహిస్తూన్న యీ ప్రభుత్వం నెలకొల్పబడిన తరువాత మిత్రరాజ్యాలకు అది చేసే సహాయం వొక్కటే—కొన్ని నిష్కర్షయైన షరతులమీద మిత్రరాజ్యాలు భారత దేశంలోనుండి యుద్ధం సాగించవచ్చు. మిత్రరాజ్యాలు జాతీయ ప్రభుత్వానికి మిత్రులు గనుక ప్రజలు, తమంతట తాము, యుద్ధ ప్రయత్నాలకు సాయపడదలచుకున్న జాతీయ ప్రభుత్వం అడ్డురాదు. వ్యక్తులు మిత్రరాజ్యాల సైన్యాల్లో చేరవచ్చు. ఇష్టంవస్తే యుద్ధనిధికి తమడబ్బును యివ్వవచ్చు. కాని బ్రిటిష్ అధికారోద్వాసంతోబాటు ప్రస్తుతపు భారతీయ సైన్యంకూడా రూపుమాసి పోవాలి. బాధ్యత, అధికారాలు—వీటినుంచి సైనికులను తొలగించి యిండ్లకు పంపివేయాలి. ఆ జాతీయ ప్రభుత్వంతో నామాట సాగితే ఆ ప్రభుత్వం తన శక్తిని, అధికారాన్ని, పలుకుబడిని అంతనూ గూడా ప్రపంచ శాంతిని స్థాపించను వినియోగించేట్లు చేస్తాను. కాని జాతీయ ప్రభుత్వం యేర్పడిన వెనుక నా ఆందోళన అరణ్యరోదన కావచ్చు. జాతీయ భారతావనికి యుద్ధవెఱ్ఱి యెక్కవచ్చు.

(4) ప్రశ్న:—మిత్రరాజ్యాలకు భారతదేశానికి కలిగే యీ పరస్పర సంబంధం వొక వొడంబడికగా, లేక వొక పరస్పర సహాయ సంధిగా స్థిరపడవలెనన్న కోర్కె మీకుందా?

సమాధానం:—ఈ సంబంధాలు యేవిధంగా వుండవలెనన్న విషయం నెమ్మది మీద ఆలోచించుకొనవచ్చు.

నా దృష్టిని క్లుప్తంగా స్పష్టపరుస్తాను. ఒక్క విషయం—కేవలం వొక్కటే విషయం—మాత్రం నాకు నిశ్చయంగా, నిశ్చలంగా కనబడుతూంది. మిత్రరాజ్యాలు తప్పకుండా యుద్ధం జయించాలంటే భారత జాతి, భారత ప్రజలు ప్రస్తుత అమానుష స్థితిలో వుండరాదు. బ్రిటిష్‌వారికి భారతదేశం పాదాక్రాంతమై వున్నంతకాలం మిత్రరాజ్యాలకు నైతిక బలం లేదు. ఫాసిస్టు లేక నాజీ శక్తులకు మిత్రరాజ్యాలకు వ్యత్యాసం యేదీ నా కగుపడడం లేదు. వారూ, వీరూకూడా దోపిడీ దారులే. అందరూగూడా తమ తమ అక్కరలనుబట్టి అపసరమైనంత దౌర్జన్యాన్ని, హింసను ఉపయోగించేవారే. అమెరికా, బ్రిటన్లు చాల గొప్ప దేశాలు. అమెరికన్లు, బ్రిటన్లు గొప్పజాతులవారు. కాని ఆఫ్రికా

ఆసియా వాసులముందు వారి గొప్పతనం, వారి జాతీయ ఔన్నత్యత గడ్డి పోచపాటిగాదు. శతాబ్దాల తరబడిని ఆసియా, ఆఫ్రికా వాసులను హింసించి బానిసలుగావుంచిన మహా పాతకం అమెరికన్లది, బ్రిటిష్‌వారిదీనూ. ఈ పాప పరిహారార్థం బ్రిటన్లు, అమెరికన్లు ప్రాయశ్చిత్తం చేసుకోవాలి. ఈ ఘోర పాతకములనుంచి తమ చేతులను కడుగుకోవాలి; ఆత్మలను శుభ్రపరచుకోవాలి. అంతవరకు. మానవ స్వాతంత్ర్యం,ప్రపంచశాంతి మొదలైనవిషయాలను గురించి మాట్లాడటానికి వారు అనర్హులు. ఈ పాప పంకిలంనుండి యెప్పుడు తప్పు కుంటారో, యెప్పుడు ప్రాయశ్చిత్తం చేసుకుంటారో ఆ మరుక్షణమే వారికి విజయం కలుగుతుంది. ఈ ప్రాయశ్చిత్తమే వారి విజయానికి పునాదిఔతుంది. ఈ ప్రాయశ్చిత్తం ఫలితంగా కోటాను కోట్ల ఆఫ్రికా, ఆసియా వాసులు వారిని దీవిస్తారు. ఈ దీవనలు కంటికగుపడక పోవచ్చు. పత్రికలలో ప్రచురింప బడక పోవచ్చు. కాని కోట్ల ప్రజల సానుభూతికి బ్రిటన్లు, అమెరికన్లు పాత్రు లౌతారు. అప్పుడుగాని—అప్పటివరకు కాదుసుమా—బ్రిటన్లు, అమెరికన్లు ప్రపంచ నూతన వ్యవస్థకు పోరాడినవారు కారు. ఇది నిజం. మిగత విషయా లన్నీ కేవలం వూహలుమాత్రమే. నా మనస్సులోని తలంపులను స్పష్టీక రించడానికి యీ వూహా ప్రపంచంలో కొంతసేపు విహరించాను. కాని వున్న నిజం వొక్కటే—పతితులు ప్రాయశ్చిత్తం చేసుకోవడం. "శుభస్యశీఘ్రం ఆదాయం."

మోహన్‌దాస్ ఖరంచంద్ గాంధీ

సాయంకాలం భోజనం చేస్తూన్నాం. "అప్టన్ సింక్లేర్ నెరుగు దురా మీరు?" అని గాంధీజీ నన్నడిగారు. "సింక్లేర్ యేం చేస్తున్నారని తెలుసుకోవాలని నా కెంతో కోరిక. అప్పుడప్పుడు సింక్లేర్‌గారి రచనలు నా కొస్తున్నాయి. కాని వాటిని చదవడానికి నాకు వ్యవధిలేదు. ఇంతకు పూర్వం మా యిద్దరికి కొన్ని వుత్తర ప్రత్యుత్తరాలు జరిగాయి. అమెరి కన్ల సాంఘిక జీవనాన్ని, మానసిక దృష్టిని సింక్లేర్‌గారు మార్చగలుగు తున్నారనుకుంటాను" అన్నారు గాంధీజీ.

నేను భోజనం చేయడం గాంధీజీ కొద్దిసేపు గమనించారు. "మీరు యిప్పటికీ మా వంటకాలను భుజింప నిరాకరిస్తున్నారుగా!" అని పొడు పుగా అన్నారు.

"వ్యక్తిగా, మానవుడుగా, ప్రజా నాయకుడుగా, రాజకీయవేత్తగా మిమ్మ గౌరవిస్తున్నాను. మీకు విధేయుణ్ణి. కాని మీరు వంటవారుగా తయారౌతానంటే మీకు అవిధేయుణ్ణే"అన్నాను. సేవాగ్రామంలోవున్నంత కాలం ప్రతిపూటా ఆకు కూరలు వడ్డిస్తూ వచ్చారు. నేనూ తింటూనే వచ్చాను.

నా యిద్దరు కొడుకుల గురించి గాంధీజీ అడిగారు. దాన్ని బట్టి ఆయన నా పుస్తకం ('వ్యక్తులు—రాజకీయాలు') చదివా రనుకున్నాను. ఆహార పదార్థాలన్నీ వొక మేజా బల్లమీద అమర్చబడి వున్నాయి. ఆ మేజా బల్లకిందికి పిల్లులు వచ్చి ఆట్లాడుతూ వున్నాయి. "నేను 1938 లో లాయడ్ జార్జిగారిని దర్శించాను. అప్పుడాయన మిమ్మల్ని గురించి చెప్పారు. అప్పట్లో ఆయన ఛర్ట్‌లో కాపురం వున్నారు" అన్నాను.

"అలాగా : నన్నుగురించి ఆయన ఏం చెప్పారు ?" అని ప్రశ్నించారు గాంధీజీ.

"మీరు ఛర్ట్‌కువెళ్ళి ఆయన యింట్లో సోఫామీద చతికలబడి కూర్చున్నారట. కొద్దిసేపటకి వారు మున్నెన్నడూ చూడని నల్లపిల్లి కిటికీద్వారా వచ్చిందట. మీ వొళ్ళో కూర్చున్నదట" అని చెప్పాను.

"ఔను. అది నిజమే" అన్నారు గాంధీజీ.

"మీరు వెళ్ళిపోయిన తర్వాత ఆ పిల్లి మళ్ళీ రాలేదనీ, కనబడ లేదనీ లాయడ్ జార్జిగారు చెప్పారు" అన్నాను.

"ఆ విషయం నాకు తెలియదే !" అన్నారు గాంధీజీ.

"మిస్ స్లేడ్ (మీరాబెన్) ఛర్ట్‌కు లాయడ్ జార్జిగారిని చూడను వెళ్ళినప్పుడు ఆ పిల్లి మళ్ళా వారింటకి వచ్చిందని ఆయన చెప్పారు" అన్నాను.

"ఆ విషయంకూడా నాకు తెలియదు" అన్నారు గాంధీజీ. గాంధీజీ లాయడ్ జార్జిని గురించి గొప్పగా మాట్లాడారు.

"నేను లాయడ్ జార్జిని చూడను వెళ్ళినప్పుడు ఆయన నాకు చుట్ట అందించారు. నేను పొగతాగనని చెప్పాను. మద్యపానాన్ని యివ్వ వచ్చారు. దాన్ని సేవించేవాణ్ణి కానని చెప్పాను. దురభ్యాసాలేవీ లేవా? అని లాయడ్‌జార్జిగారు నన్నడిగారు. ఎరుకలో వున్నంతవరకేవీ లేవన్నాను. తెలిసినవి, తెలియనివి; కనుపించేవి, కనుపించనివి—అన్ని దురభ్యాసాలు తనకున్నాయని, అందువల్లే డెబ్బది అయిదవయేటగూడా అంత ఆరోగ్యంగా, వుత్సాహకరంగా తానున్నారని అన్నారు" అని గాంధీజీతో చెప్పాను.

ఈ మాటలు విని గాంధీజీ చాలసేపు నవ్వారు. "చర్చిల్‌ను గురించి లాయెడ్ జార్జిగారి అభిప్రాయం యేమిటి?" అని నన్నడిగారు.

"నేను 1941 వేసవిలో లాయడ్ జార్జిగారిని కలుసుకున్నప్పుడు చర్చిల్‌ను గురించి ఆయన అభిప్రాయం యేమిటని అడిగాను? చర్చిల్‌కు ధైర్యం, సాహసం, తెగింపు యెందువల్లలేవని అడిగానుకూడా. లాయడ్ జార్జి యీ ప్రశ్నలకు వొకేమాట బదులుచెప్పారు—"గల్లిపోలి." (1914-18 యుద్ధంలో బ్రిటిష్ సేనలు యీ చోట వోడిపోయినై. ఆ వోటమివల్ల కలగిన అవమానం అప్పట్లో యుద్ధమంత్రియైన చర్చిల్‌కు వచ్చింది.) గల్లిపోలిలో తనకు కలిగిన అవమాన కారణంగా చర్చిల్‌లో వుత్సాహం వుడిగిపోయిందన్నారు లాయడ్ జార్జిగారు" అని గాంధీజీతో చెప్పాను.

"నేను లండన్‌లో వున్నప్పుడు లాయడ్ జార్జిగారిని కలుసుకున్నాను. మా యిద్దరి సౌకర్యాన్ని అనుసరించి రాత్రి ప్రొద్దుపోయిన తర్వాత కలుసుకున్నాం. నేను చాలాసేపు వారితో మాట్లాడాను. రాత్రి వొంటిగంట అయింది. వెళ్ళుస్తున్నాను. అప్పుడు తనయింట్లోవున్న పనివారందరిని పిలిచి నాకు వీడ్కోలు నిచ్చారు. ఈ గౌరవం నాకెంతో ఆనందాన్ని కల్గించింది" అన్నారు గాంధీజీ

* * *

వార్తాపత్రికలు చదువవలెనన్న ఆసక్తి సేవాగ్రామంలో యెవ్వరికీ లేదు. అక్కడ రేడియోలేదు. నెహ్రూవంటివారెవరో కొద్దిమంది తప్ప, భారతీయులు కేవలం తమదేశ విషయాల్లోనే నిమగ్నులై వుంటారు. ఈ యుద్ధం, బాహ్య ప్రపంచం వారికి చాలాదూరంగా వుంటవి. ఇండియాలో బ్రిటిష్ పరిపాలనవల్ల ప్రపంచానికి జరిగిన గొప్ప అపకారాల్లో యిది వొకటి. భారతీయుల కండ్లకు ఇంగ్లండు తప్ప వేరేదీ కనబడదు. ఇంగ్లండు తమ కండ్లముందున్నందున ప్రపంచాన్ని, యుద్ధాన్ని భారతీయులు చూడలేకుండా వున్నారు. వారి కండ్లకు ప్రపంచమంతటిని ఇంగ్లండు మరుగుపరుస్తూ వున్నది.

రాత్రి చల్లగానుంది. నేను చాలసేపు నిద్రపోయాను. నక్షత్రాలు స్పష్టంగా ప్రకాశించాయి.

జూన్ 7, 1942

గాంధీజీ, నేనూ నిన్న ఫోటోలు తీయించుకున్నాం: గాంధీజీ మను మడు కనూగాంధీ యీ ఫోటోలు తీశారు. ఫిలిం చాలా పాతదయినందున ఫోటోలు బాగా రాలేదు. అందువల్ల మళ్ళీ యీవాళ ఫోటోలు తీయించుకుందాం అనుకున్నాం. ప్రొద్దున్నే మళ్ళీ గడ్డం చేసుకున్నాను. గాంధీజీ యింటికి వెళ్ళాను. లోటాలోవున్న మామిడిపండ్ల రసాన్ని ఆయన తింటున్నారు. భార్య ఆయనకు విసురుతూంది.

"రాత్రి నిద్రపట్టిందా ?" అని గాంధీజీ నన్నడిగారు.

"రాత్రి సుఖంగా నిద్రపోయాను. మీరో?" అన్నాను.

"నేను సాధారణంగా రాత్రి 9-30 నుంచి ప్రొద్దున 4-30 వరకు నిద్రపోతాను" అన్నారు గాంధీజీ.

"నిద్రాభంగం లేకుండానా ?" అని ప్రశ్నించాను.

"లేదు. రెండు మూడుమార్లు మధ్య మేల్కొంటాను. కాని సుల భంగా మళ్ళీ నిద్రపడుతుంది. ఇదిగాక ప్రతిరోజూ మధ్యాహ్నం అరగంట సేపు నిద్రపోతాను" అన్నారు గాంధీజీ.

చర్చిల్ కూడా మధ్యాహ్నం కొంత సేపు నిద్రపోతారు" అన్నాను.

"యూరప్‌లో క్రమేణ మధ్యాహ్న నిద్ర అలవాటవుతూ వుందని విన్నాను. ముసలితనంలో యిది చాల ముఖ్యం" అన్నారు గాంధీజీ.

"రూజ్‌వెల్ట్‌కు పడుకోగానే నిద్రపడుతుందని విన్నాను" అన్నాను.

"రూజ్‌వెల్ట్‌గారి ఆరోగ్యం యెలావున్నది ? రూజ్‌వెల్ట్ సతి యెలా వుంటుందో వర్ణించండి ! అమెరికన్ రాజకీయాలమీద ఆమెకు కొంత పలుకుబడి వుందన్నమాట !" అన్నారు గాంధీజీ.

'న్యూ డీల్' (రూజ్‌వెల్ట్ మొట్టమొదటిదఫా అధ్యక్షుడైనప్పుడు నూతన ఆర్థిక విధానాన్ని వొకదానిని అమలులోనికి తెచ్చాడు. దానిపేరు

న్యూడీల్) అమలులోకి వచ్చిన తర్వాత వృత్తి సంఘాలు, సాంఘిక మార్పులు ఎలా యేర్పడినవో గాంధీజీకి విశదీకరించి చెప్పాను. విదేశ ప్రభుత్వాలకు అమెరికన్ ప్రభుత్వం యెలా ద్రవ్యసహాయం చేస్తూవున్నది, యుద్ధ పరిశ్రమలకు యే విధంగా సాయపడుతూ వున్నది వివరించాను. ప్రథమ ప్రపంచ యుద్ధంలో (1914-18) విదేశ ప్రభుత్వాలకు, అమెరికా లోని యుద్ధపరిశ్రమలకు వ్యక్తులు ద్రవ్యసహాయం చేశారని, యీనాడు గొప్పమార్పు కలిగిందని, పాతికేళ్ళనాటి ఆ ప్రయత్నాలను- నేటి మహత్తర ప్రయత్నాలతో పోల్చి చెప్పాను.

"నీగ్రోల సంగతి యేమిటి ?" అన్నారు గాంధీజీ.

"నీగ్రోలపట్ల తెల్లవారి ప్రవర్తనలో ఉత్తర అమెరికాకు, దక్షిణ అమెరికాకు వ్యత్యాసం వుంది. నీగ్రోలపట్ల అమెరికన్ల ప్రవర్తనను నేను సమర్థించడం లేదు. మీ దేశంలోని అంటరానివారి సమస్య యంత క్రూరమైనది గాదు నీగ్రో సమస్య'' అన్నాను.

"అస్పృశ్యతా నివారణకై నేను చాలాయేండ్లు శ్రమ పడ్డానని మీరెరుగుదురుగదా ! ఈ ఆశ్రమంలో చాలమంది హరిజనులున్నారు. ఈ ఆశ్రమంలోని చాకిరీనంతా అస్పృశ్యులే చేస్తూన్నారు. ఆశ్రమానికి వచ్చే హిందువులందరూ హరిజనులచేతి అన్నాన్నే తినాలి. వారితోపాటు వుండాలి" అన్నారు గాంధీజీ.

"అస్పృశ్యుల అగచాట్లు యేమైనా తగ్గినవా ?" అని ప్రశ్నించాను.

"ఆఁ .... కాని వారిగతి యిప్పటికీ అధోగతిగానే వుంది" అన్నారు గాంధీజీ. ఇంతలో కుర్షీద్‌వచ్చి హిందూస్థానీలో యేదో అన్నది. గాంధీజీ నవ్వారు. "ఏమిటది" అని అడిగాను. "మీ పాదములకు నమస్కారములు, అని అన్నాను" అని కుర్షీద్ చెప్పింది. వియన్నాలో పురుషులు మిత్రులను కలుసుకున్నప్పుడు ఒకరినొకరు తాకకున్నా, "నీ చేతిని ముద్దిడుచున్నాను" అని అంటారు. మీరు పాదాలనంటకుండా అనడం అదేవిధంగానుంది అన్నాను. గాంధీజీ నవ్వారు. గాంధీజీ

వాహ్యాళికి లేచారు. ఇద్దరు పిల్లలు పరిగెత్తుకుంటూవచ్చి ఆయన కిరు వైపుల ఆయన నడిచేటప్పుడు తమ భుజాలమీద గాంధీజీ ఊనేటట్లు నిలిచారు. గాంధీజీవద్ద యీగౌరవం పొందాలని పిల్లలలో పోటీ వున్నట్లుంది.

ఉదయం మేము షికారుకు బయలుదేరగానే నేను మళ్ళీ అస్పృశ్యతను గురించి మాట్లాడాను—"మేధావులు, ఆధునికులు, చాల గొప్పవారు అయినవా రనేకమంది అస్పృశ్యతను సమర్థిస్తున్నారు. అటువంటివారిలో భారతీయ ఫెడరల్ కోర్టులోని న్యాయాధిపతులలో వొకరైన వరదాచారిగారు వొకరు. అస్పృశ్యులలో నమ్మకం వుండడానికి కారణముందనుకుంటాను. మరణానంతరం ఆత్మ యీ శరీరాన్ని వదలి మరొక శరీరాన్ని ప్రవేశిస్తుందన్న నమ్మకం యిందుకు కారణమేమో? ఆత్మకు మరణం లేదన్న నమ్మకం హిందూ మతంలో వొక ముఖ్యాంశమనుకుంటాను. ఆత్మ వొక శరీరంనుంచి మరో శరీరంలోకి ప్రవేశిస్తుందని మీకు నమ్మకం వున్నదా?" అని ప్రశ్నించాను.

"తప్పకుండాను! అందులో నాకు నమ్మకం వున్నది. శరీరంతో పాటు ఆత్మ నశిస్తుందని నేననుకోను. ఒక మనిషి తన యిల్లు కూలిపోతే మరోయిల్లు కట్టుకుంటాడు. అదేవిధంగా వొక మనిషియొక్క శరీరం నశించిపోతే, అతని ఆత్మ మరో శరీరాన్ని వెతుక్కుంటుంది. కొందరికి మరో నమ్మకముంది. శరీరం చనిపోయి భూమిలో పాతిపెట్టబడినప్పుడు (లేక దహనానంతరం) ఆ శరీరంలోని ఆత్మ గాలిలో యెగురుతూ వుంటుందని, యెన్నడో రానున్న విచారణ రోజును యెదురుచూస్తూ వుంటుందని, ఆ విచారణరోజు యీ ఆత్మ తన భౌతిక శరీరం చేసిన పాపాలకు బదులుచెప్పాలనీ కొందరి నమ్మకం. నేను దీనిని నమ్మను. శరీరం నశించిన వెంటనే ఆత్మ మరోశరీరాన్ని ప్రవేశిస్తుంది" అన్నారు గాంధీజీ.

"మానవుడు మృత్యువు లేకుండా అమరుడు కావడానికి సదా ప్రయత్నిస్తూనే వున్నాడు. ఇది ఆ ప్రయత్నంయొక్క వేరు స్వరూపం అన్న

మాట. ఈ ప్రయత్నాలన్నీ బలహీనుడైన మానవుడు చావుకు భయిపడి చేసే ప్రయత్నాలే గదా? టాల్‌స్టాయ్ (ప్రఖ్యాత రష్యన్ నవలా రచయిత) వృద్ధాప్యం సమీపించకముందు మతము, దేవుడు అంటే లక్ష్య పెట్టేవాడే కాడు. ముసలితనం వచ్చిన తర్వాత మృత్యువుకు భయపడి మతమన్నా, దేవుడన్నా గౌరవం చూపాడు" అన్నాను.

"నాకు చావు అంటే భయంలేదు. చావు రావడం విముక్తికి దారి తీస్తుంది. కొంత సంతృప్తిని యిస్తుంది. చావుతో ఆత్మయొక్క జీవయాత్ర ముగిసిపోతుందనుకోను. అందుకు నిర్ధారణ లేవి లేవు. చనిపోయిన వాని ఆత్మ వేరుశరీరాన్ని ప్రవేశిస్తుందని రుజువుచేయను అనేకమంది ప్రయత్నించారు. ఇది రుజువుచేయడానికి వీలైన విషయ మనుకోను. కాని, ఆత్మకు చావులేదని—పునర్జన్మ తప్పదని నాకుమాత్రం సంపూర్ణ విశ్వాసం వుంది" అన్నారు గాంధీజీ.

ఇటువంటి విషయాలు చర్చవల్ల తేలేవికావనీ, కేవలం వ్యక్తుల నమ్మకాలను బట్టి యేర్పడే భావాలని యెరిగిగూడా నా భావాలను మళ్ళీ బయల్పరచాను—"మన మందరం అమరులుగా వుండడానికి ప్రయత్నిస్తున్నామనుకుంటాను. కొందరు తమ ఆత్మ తమపిల్లలలోనూ, వారి సంతతి వారిలోనూ నివసిస్తుందనీ, కొందరు తమ ఆత్మ తాముచేసే కార్యాల్లో లీనమై వుంటుందనీ, మరి కొందరు తమ ఆత్మ జంతువులను ప్రవేశిస్తుందని నమ్ముతూ వున్నారు. కొందరు వ్యక్తులు వారు ప్రపంచానికి చేసిన మేలునుబట్టి మరణానంతరం ప్రజల మనస్సులలో సజీవంగా వుంటారు. తన ప్రజాసేవ మూలంగా కాకుండా చిరంజీవిగా నుండదలచిన వ్యక్తి కేవలం మృత్యువుకు భయపడినవాడని నా నమ్మకం. అటువంటివాడు యేదో పునర్జన్మ అనే మూఢనమ్మకంలో కొంత మనశ్శాంతి పొంద ప్రయత్నిస్తాడు'' అన్నాను.

గాంధీజీ తన వాదాన్ని మళ్ళీ స్పష్టీకరించారు. ఆయన యెప్పుడు మాట్లాడినా ఆంగ్లవిశ్వ విద్యాలయాలలో వాడుకలోవున్న ఉచ్చారణతో

చక్కని ఆంగ్లంలో మాట్లాడేవారు.

"మీ దేశంలో నేటి యువకులు కులభేదాలను, మతభేదాలను పాటించడం లేదని విద్యార్థులు కొందరు చెప్పగా విన్నాను. యువకులకు మతంలో, కులతత్వంలో అసలు ఆసక్తిలేదని విన్నాను" అన్నాను గాంధీజీతో.

"కులభేదాలు లేవన్నమాట నిజమే. కాని హిందూధర్మం (మనం సాధారణంగా వాడే అర్థంలో) వొక మతంకాదు. విద్యార్థులు హిందూ మతాన్ననుసరించి కర్మకాండ చేయడంలేదు. హిందూధర్మ మొక జీవిత మార్గం. ఒక రకపు జీవిత విధానానికి హిందూధర్మ మని పేరు. దైనందిన కర్మకాండను చేయనివారు అనేకులు హిందూ జీవిత ధర్మాన్ననుసరించి జీవిస్తున్నారు. అస్పృశ్యత హిందూధర్మంలో ఆచరణయోగ్యమని వుండడం నాకెంతో బాధకలిగించింది. అస్పృశ్యతా సమస్యను భారతీయ స్వాతంత్ర్యం త్వరలో పరిష్కరిస్తుందని నా నమ్మకం. మరచాను, నేను బ్రిటిష్ వారిని వెళ్ళమనడం కేవలమొక సవాలు. మా దేశాన్నివదలి వెళ్తే వారు పరిశుభ్రపడతారు. వారి పాపాలు పరిహార మౌతవి. నూతన ప్రపంచ నిర్మాణానికి తగిన బలం పొందుతారు. లేకుంటే యీనాటి, వారి వాగ్దానాలు, ప్రకటనలు అన్నీ సర్వం మోసమని రుజువైనట్లే" అన్నారు గాంధీజీ.

ఇంతలో గాంధీజీ బసవద్దకు వచ్చాం. నేను గాంధీజీవద్ద సెలవు పుచ్చుకొని వెళ్ళాను. కాంగ్రెస్ సోషలిస్ట్ నాయకుడు ఆచార్య నరేంద్రదేవ్ గాంధీగారి గదికి ప్రక్కగదిలో ఉంటున్నాడు. ఆర్యనాయకం లంకనుంచివచ్చినవాడు. ఈయన ఆజానుబాహుడు. నేటి వుదయం మరల వీరిద్దరు నేనుంటున్న అతిథిగృహానికి వచ్చి, చాలసేపున్నారు. ఫాసీజం, సామ్రాజ్యవాదం-వీటిని గురించి అతి తీవ్రంగా చర్చించారు. "జర్మను ఫాసీజాన్ని మేమెరుగము. ఇండియాలో ప్రతిక్షణం బ్రిటిష్ ఫాసీజాన్ని యెదుర్కొంటున్నాము. నాజీలెంతటి పిశాచులో మేధావు

లెరుగుదురు. కాని సామాన్యప్రజలు యీ విషయాన్ని యెరుగరు. జపాన్ వారు బ్రిటిష్ యుద్ధనావలు 'ప్రిన్స్ ఆఫ్ వేల్స్', 'రిపల్స్'లను ముంచడం మా ప్రజల్లో మహత్తర మార్పును తెచ్చింది. ఇండియాలో బ్రిటిష్ వారి పాలనకు వెనుకబలం బ్రిటిష్ నౌకాబలం. అందువలన యీరెండు బ్రిటిష్ యుద్ధనౌకలను జపాన్‌వారు ముంచేప్పటికి బ్రిటిష్‌వారి బ్రతుకు బయటపడింది. బ్రిటన్ దూరప్రాచ్యంలో పొందిన అపజయాలన్నీ మా ప్రజల మనస్సులలో హత్తుకుపోయాయి" అన్నారు వారు. "జపాన్ వారి వైమానికులు ప్రాణాలకు తెగించి తమ విమానాలను బ్రిటిష్ యుద్ధనౌకలకు ఢీ కొట్టారు. బ్రిటిష్‌వారికి యీ సాహసం కనబడలేదు" అన్నారు ఆర్యనాయకంగారు. బ్రిటిష్‌వారిలోగూడా ప్రాణాలను లెక్క చేయని వైమానికులున్నారని చెప్పాను. వారినిగురించి ఆయన యెన్నడూ వినియుండలేదన్నాడు. ఇంగ్లీషు ఛానల్‌లో సాహసించి యిటీవల వెళ్ళిన రెండు జర్మను యుద్ధనావలను బ్రిటిష్ నావికులు యెదిరించిన్నది వర్ణించి, వీరు జపాన్ వైమానికులకు యేవిధంగాను తీసిపోరనిచెప్పాను. ప్రపంచంలోని ప్రతిసైన్యంలోను త్యాగులు, మహాయోధులు వున్నారనీ ప్రజాస్వామ్యాల్లో వీరికి లోటులేదనీ అన్నాను.

మా సంభాషణ ముగియవచ్చింది. ఇండియాలో ఫాసిస్ట్ వ్యతిరేకులు రెండు రంగాలలో పోరాడవలసి యున్నదన్నాను. వారు అక్షరాజ్యాలతో ఒకవైపు, బ్రిటిష్ సామ్రాజ్యంతో మరి యొకవైపు పోరాడవలసి యున్నదన్నాను. దేవ్‌గారు యిట్లని వాదించారు—"మేము ఒకవైపునే పోరాడలేకున్నాం. ఇరువైపుల పోరాడడం సంగతి అలా వుంచనివ్వండి. మాకు ఆయుధాలు లేవు. అందువల్ల మేము జపాన్‌వారి నెదిరి పోరాడలేము. కావాలని మమ్మ బ్రిటిష్ వారు నిరాయుధులుగా నుంచుచున్నారు. పైగా, మమ్మ అణచిపెట్టి, మాకు ఆయుధాలివ్వక, మా స్వాతంత్ర్యానికి అడ్డుపడే బ్రిటిష్‌వారి వైపు చేరలేము."

డాక్టర్ దాస్‌గారి మేనకోడలికి ఆరేండ్ల పిల్లవాడున్నాడు. ఈ చిన్న

పిల్లవాడు అతిథిగృహంచుట్టూ ఆడుకుంటూ వుంటాడు. ఈ కుట్టవానికి కొన్ని ఇంగ్లీషుపదాలు వచ్చు. అతని నడిగాను, తన మిత్రులతో యే భాషలో మాట్లాడుతాడని. వంగభాషలో మాట్లాడుతానన్నాడు. అతనికి హిందీ, గుజరాతీగూడా వచ్చు. ఆశ్రమంలోని చిన్నపిల్లలందరూ రెండు, మూడుభాషలు మాట్లాడగలరు.

దేవ్, ఆర్యనాయకంగార్లు వెళ్ళిన కొద్దిసేపటికి రాజా అనే ఆయన వచ్చారు. ఆయన హిందువుడు. ఫ్రెంచి యువతిని వివాహమాడాడు. ఆయన చాల సంవత్సరాలు ఫ్రాన్స్‌లో గడిపాడు. ఆంగ్లంకంటే ఫ్రెంచి భాషే ఆయనకు బాగావచ్చు. ఆయన చాల అందగాడు. హాలీవుడ్‌లోని నటుల్లాగా వున్నాడాయన. ఫ్రాన్స్‌దేశ దుస్థితిని గురించి మాట్లాడాడు. చాల నెలలుగా గాంధిగారి ఆశ్రమంలో నున్నాడు. ఆయన హిందువైనా, ఆయన జన్మస్థానంలో మహమ్మదీయులు యెక్కువగనుక, ముస్లిం బడిలోనే చదివాడు. హిందువులకన్న ముస్లింలు హెచ్చు వుత్సాహవంతులని, శక్తివంతులని, విప్లవదృష్టి కలవారని ఆయనవాదన. భారత కమ్యూనిస్ట్ పార్టీలో సగంమంది మహమ్మదీయులని అన్నాడాయన. హిందువులు మెతకరకమని, సాహసంలేనివారని అన్నాడు. హిందువులు, ముస్లింలు మతంలో వేరైనా ఒకేజాతికి చెందినవారు గనుక యీ భేద మెలా ఏర్పడ్డదని అడిగాను. దీనికి కారణం "ఆహారమా?" అని ప్రశ్నించాను. కాదన్నారాయన. జీవితాశయాలలోగల వ్యత్యాసమే దీనికి కారణమన్నాడాయన. "ఉత్తర హిందూస్థానంలో చాలమంది హిందువులు మాంసాహారులు. ముస్లింలు పందిమాంసం తినరుగాని గొడ్డుమాంసం తింటారు. హిందువులు యెక్కువగా ఆలోచిస్తుంటారు. మంచిజ్ఞాపకశక్తి వున్నది వారికి. వ్యాపారంలో నిపుణులు. కాని కడుపునిండాతిని, కులాసాగా కాలం గడపాలంటే ముస్లింవద్దకే వెళ్ళాలి" అన్నారాయన.

మధ్యాహ్న భోజన సమయాన్ని గాంధీజీ చాల సంతోషంగా వున్నారు. భోజనశాలలో వాకిలి ప్రక్కనే కూర్చున్న చిన్న పిల్లలను

చూచి కనుసైగలు చేశారు. ప్రతి వొక్కరితో మాట్లాడి, నవ్వించారు. భోజనం చేస్తూవున్నప్పుడు సంభాషణను ప్రారంభించారు.

"మిచిగన్ రాష్ట్రంలోని బాటల్ క్రీక్ అన్న పట్టణంలో కెల్లాగ్ అనే డాక్టర్‌గా రొకాయన వున్నారు. మీరు ఆయన నెరుగుదురా?" అని గాంధీజీ నన్నడిగారు.

"కెల్లాగ్ ఆహార పదార్థాల కంపెనీ నెరుగుదును, కాని నేను డాక్టర్ కెల్లాగ్ నెరుగను" అన్నాను.

"ఆహార విషయాల గురించి డాక్టర్ కెల్లాగ్ గారికీ నాకు వుత్తర ప్రత్యుత్తరాలు జరిగాయి. స్వస్థలంలోకంటే వ్యక్తులు విదేశాల్లో ప్రఖ్యాతి చెందుతారు. లిప్‌జిగ్‌లో 'కునీ' అనే ఆయన వున్నారు. ఆయన ఆహార సమస్యను గురించి అనేక పుద్గ్రంథాలు వ్రాశారు. అవి జర్మను భాషనుంచి మా దేశభాషల్లోకి తర్జుమా చేయబడినవి. అనేక ముద్రణలు పొందినవి గూడాను. లిప్‌జిగ్‌లో కునిగారిని చూచిరమ్మని నా మిత్రుని వొకనిని పంపాను. ఎవరినడిగినా "కునీగారెవరో మాకు తెలియదు" అన్నారట. కునిగారు చనిపోయాడట. ఎంతో శ్రమపడ్డ తర్వాత కునిగారి కొడుకును నా మిత్రుడు కలుసుకొన గలిగాడు" అన్నారు గాంధీజీ...."ఆశ్రమంలో మీకు కడుపునిండా ఆహారం దొరుకుతూవుందా?" అని గాంధీజీ ప్రశ్నించారు.

"ఆహారం దొరక్కేమీ? నేను పస్తుండడంలేదు. కాని ఆహారంలో మార్పు అక్కట్టే లేదు. కంటికి, జిహ్వకుకూడా భోజనం తృప్తికలిగించాలి. ఆశ్రమంలో నేను యెప్పుడు భోజనం చేసినా వొకేరకపు భోజనమే. మీరు నిరుపయోగమైన వంటవాడని నేను బహిరంగంగా విమర్శించబోతున్నాను" అని పరిహాసంగా అన్నాను.

ఆ క్షణాన్నే తెల్లని ఖద్దరు బట్టలు, చిరునవ్వు, అందమైన ముఖంతో జవహర్‌లాల్ నెహ్రూగారు భోజనశాలలోకి వచ్చారు. చుట్టూ వున్నవారందరూ ఆయనను యెంత అపారంగా ప్రేమిస్తూన్నదీ వారి

చూపులను బట్టి గ్రహించవచ్చును. జవహర్‌లాల్‌గారు, నా ప్రక్కనే, నేల మీద కూర్చున్నారు. ఫాంతీయులందరివలెనే, జవహర్‌లాల్, ఫోర్క్సు,



నెహ్రూ - ఫిషర్

చంచాలేకుండా, చేతితోనే అన్నంతింటూన్నారు. ఆయన భోజనంచేస్తూన్న రీతి చూచినప్పుడు చాలకాలం క్రితం మేమిద్దరము పారిస్ నగరంలో వొక గొప్ప హోటల్‌లో భోజనంచేసిన దృశ్యం నాకు జ్ఞప్తికి వచ్చింది. భోజనానికి ముందు నెహ్రూ కొంతసేపు గాంధీజీతో సంప్రదించారు.

గాంధీజీ నా వైపుచూచి "రేపు సోమవారం. నా మౌనంరోజు. కాని రేపు జవహర్‌లాల్‌తో మాట్లాడవలసి వున్నది. అందుకని యివాళ మధ్యాహ్నంనుంచే నా మౌనవ్రతాన్ని ప్రారంభించి రేపు మధ్యాహ్నానికి ముగిస్తాను. రేపు మధ్యాహ్నంనుంచి జవహర్‌లాల్‌తో మాట్లాడడానికి వీలుంటుంది. ప్రతిరోజూలాగా, యీవాళ సాయంకాలం మీతో మాట్లాడ డానికి వీలులేదు. మీరు యీవేళ గం 1-30 కే రావాలి" అన్నారు.

భోజనానంతరం జవహర్‌లాల్‌గారూ నేను అతిథిగృహానికి వెళ్ళాం. ఆయన నాతోపాటు అక్కడనే బసచేస్తూన్నారు. ఒకగంటసేపు

ప్రపంచంలో యెన్నివిషయాలున్నాయో వాటన్నిటిని గురించి మాట్లాడాం. "మా దేశంలో మంచీవున్నది, చెడ్డావున్నది. గౌరవ ప్రదమైన విషయాలు వున్నాయి: విసుగు పుట్టించేవీ వున్నాయి. వీటిలో మీకు యేవికావాలో మీరే నిర్ణయించుకో వచ్చు" అన్నారు నెహ్రూగారు. "నాకు యేదీ వద్దు. బాగూ, ఓగూ రెండూ మీరే వుంచుకోండి" అన్నాను నేను.

మధ్యాహ్నం పన్నెండున్నర అయింది. ఒక గంట సేపు గాంధీజీతో మాట్లాడడానికి నెహ్రూగారు వెళ్ళారు. గాంధీజీతో మాట్లాడ డానికి నేనాయన బసకు 1-30 గంటకు వెళ్ళాను. అప్పుడు జవహర్‌లాల్ గారూ అక్కడే వున్నారు. ఆయన నేలమీద కూర్చున్నారు. కాస్త విచారంగా వున్నట్లు కనబడ్డారు. ఆయన ప్రక్కనే కూర్చున్నాను నేను. ఎప్పటివలెనే, నన్ను చూడగానే, గాంధీజీ "మరేవన్నా విశేషాలు:" అన్నారు. ఆయన మాటలకర్థం నా ప్రశ్నల్ని ప్రారంభించుమని.

"బ్రిటిష్‌వారి రాజకీయ పద్ధతులనుబట్టి, వారి న్యాయశాస్త్రాన్నిబట్టి, పార్లమెంటు - చక్రవర్తి - అని వారిదేశంలో కేంద్రఅధికార శక్తి అవసర మైంది. అమెరికన్ రాజకీయ దృష్టి ఫెడరేషన్ (సంయుక్తరాష్టం) మీద ఆధారపడి వున్నది. మీదేశంలో యెన్నో రకాల ప్రజలున్నారు గనుక ఫెడరేషన్ మీదేశానికి అవుసరం కాదా? ఫెడరేషన్‌ను యేర్పాటుచేస్తే స్వదేశ సంస్థానాధీశులు, ముస్లిములు తృప్తిజెందుతారు" అన్నాను.

"ఫలానా రాజకీయవిధానం మాకు యెక్కువ ఉపయోగకరంగా వుంటుందని నేను చెప్పలేను. మొదట బ్రిటిష్‌వారు వెళ్ళాలి. తర్వాత మేము యేం చేస్తామన్న విషయం కేవలం వూహా సంబంధమైనది. బ్రిటిష్‌వారు దయచేసిన మరుక్షణం మతసమస్య, అల్పసంఖ్యాకుల సమస్య అదృశ్యమౌతవి. బ్రిటిష్ అధికారం యిక్కడ లేకుండా పోయి దేశంలో అరాచకం ప్రబలితే ఆ అరాచకంలో నుంచి యే విధమైన ప్రభుత్వ విధానం బయటపడుతుందో నేను చెప్పలేను. కేంద్రప్రభుత్వాని

కన్న ఫెడరల్ ప్రభుత్వమే వాంఛనీయమని నా అభిప్రాయం. ఏదో వొక విధమైన ఫెడరల్ ప్రభుత్వం యేర్పడుతుంది. కాని, మేము ఫెడరేషన్‌ను యేర్పాటుచేయగలమా ? చేయలేమా ? అన్నసమస్య నన్ను బాధించడం లేదు. నా మాటలకు మీరు నవ్వవచ్చు. మాదేశంలో కోట్లాదిప్రజ నిరాయుధులై యున్నారు. శతాబ్దాల తరబడిని పరపరిపాలనకు లోనై వున్నాము. అటువంటి మేము, నేను శీఘ్రంలో ప్రారంభింపనున్న సహాయ నిరాకరణోద్యమంలో గెలువలేమని మీరనుకోవచ్చు" అన్నారు గాంధీజీ.

"లేదు. నేను అలా అనుకోడంలేదు. ప్రపంచం చాలా వడిగా ముందుకు సాగుతూవుంది. చైనావలె, మీరూ త్వరలో స్వతంత్రులౌతారని నా నమ్మకం. చాల సంవత్సరాలకు ముందే మీరు స్వాతంత్ర్య సమరాన్ని ప్రారంభించారు. మీ పోరాటం మీకు తప్పక స్వాతంత్ర్యాన్ని సమకూరుస్తుంది" అన్నాను.

"చీనా వారివలె స్వతంత్రులం కావడం నా కిష్టంలేదు. ఇప్పటికీ, జంగ్‌కైషేక్ నాయకత్వం లభించికూడా చైనా నిస్సహాయంగావుంది. చైనాలో ధైర్య, సాహసాలకు లోటులేదు. ఈ యుద్ధంలో యెంతైనా త్యాగం చేయను చైనా సిద్ధంగావుంది. కాని యిప్పటికింకా చైనాకు సంపూర్ణ స్వాతంత్ర్యం లేదు. నిజంగా చైనాకు సర్వస్వాతంత్ర్యం వుంటే 'మీ సాయం నాకనవసరం. నేను ఒంటరిగానే నా స్వాతంత్ర్య సమరాన్ని సాగిస్తాను—గెలుస్తాను' అని ఇంగ్లీషువారికి, అమెరికా వారికి చెప్పగల శక్తి వుండాలి. అప్పుడు చైనాకు సంపూర్ణ స్వాతంత్ర్యం ఉన్నట్లు" అన్నారు గాంధీజీ.

"మీరు జంగ్‌కైషేక్‌తో చాలసేపు మాట్లాడారే ! మీ సంభాషణ సాఫీగా సాగిందా ?" అని ప్రశ్నించాను.

"సాగకేం ! మా సంభాషణ చాల చక్కగా సాగింది" అన్నారు గాంధీజీ.

"కాని, పాపం ఆయన చెప్పింది మీకు అర్థమై వుండదు. మీరు

చెప్పింది ఆయనకు అర్థమై వుండదు" అని నవ్వాను.

"ఆయన లోతైన మనిషిగా కనబడ్డారు నాకు. బహుళ భాషలోని కష్టంవల్ల నేనిలా అనుకోవలసి వచ్చిందేమో! మాసంభాషణను జంగ్ కైషేక్ సతి తర్జుమా చేసింది. తర్జుమాచేయడం కష్టం. కాని, ఆమె అంతకు మించిన కష్టాన్ని పడుతూవున్నట్లు గ్రహించాను" అన్నారు గాంధీజీ.



ఛియాంగ్ కైషేక్ దంపతులు

"నిజమే. చైనాకు సంపూర్ణ స్వాతంత్ర్యం లేదు. కాని స్వాతంత్ర్యం ఒక రోజులో వచ్చేదా? ఈ యుద్ధం మూలంగా మేము గెలిస్తే—చైనా స్వతంత్రం కావచ్చు. ఆసియాకే విముక్తి కలుగవచ్చు. ముమ్ముందు ప్రపంచ చరిత్రకు ఇండియా, చైనాలు ఆధారం కావచ్చు. కాని బ్రిటిష్‌వారు యీ విషయాన్నిగ్రహించిన నిర్ధారణలేవీ నాకు అగుపడదు. మీకోర్కెను వారు నెరవేర్చరు. ఇంగ్లీషు వారు వారి ఆయుధబలంతో సింగపూర్‌లో, మలయాలో వారిని వారు రక్షించుకోలేక పోయారు. వారి బుద్ధి బలంతో ఇండియాలో స్వరక్షణ చేసుకుంటారన్న నమ్మకం లేదు" అన్నాను,

"నేను చైనాను నిందించడం లేదని మీరు గ్రహించాలి. చైనాను చూచి నేర్చుకోవాలని నాకు లేదు. ఆ విషయాన్ని స్పష్టపరచనే యింత సేపు చైనాను గురించి మాట్లాడాను. చైనా దురవస్థ ఇండియాకు సంభవించడం నా కిష్టంలేదు. అందుకనే బ్రిటిష్, అమెరికన్ సైనికులు

యిక్కడ వుండరాదంటున్నాను. జపాన్, జర్మను సైనికులూ మాకు వద్దు. జపాన్‌వారు ప్రతిరోజూ రేడియో ద్వారా తాము ఇండియాను ఆక్రమించ దలచలేదని, కేవలం మా స్వాతంత్ర్య సమరంలో సాయపడ ప్రయత్నిస్తున్నారనీ ప్రకటిస్తున్నారు. వారి సహాయం, సానుభూతి నాకక్కరలేదు. వారు ధర్మాత్ములుకారని, దానపరులుకారని నాకు తెలుసు. పర పరిపాలన నుంచి ఇండియాకు విశ్రాంతి కావాలనే నాకోరిక. ఎంతకాలం ఓర్పు పట్టను? ఇక వోర్చుకోలేను. ఇక ఒక్క క్షణమైనా ఆగను. మాగతి చైనా, పర్షియాలకన్నా నికృష్టంగా వుంది. ఉద్యమాన్ని ప్రారంభించడానికి నేను కాంగ్రెస్‌ను ఒప్పించలేక పోవచ్చు. కాంగ్రెస్‌లో పదవులను అనుభవించిన వారు యీ అవకాశాన్ని వుపయోగించుకోలేక పోవచ్చు*. నేను నా ప్రయత్నాన్ని ఆపను. యకాయకి ప్రజలముందుకు వెళ్ళి వారి సాయాన్ని కోర్తాను. కాని, యేది యెట్లైనా సరే మేము లొంగిపోము, మేము నూతనావస్థను మాదేశంలో స్థాపించనున్నాం. మేము విజయం పొందినప్పుడు ప్రపంచం అత్యాశ్చర్య పడుతుంది. మీ అభిరుచులను, అభిమానాలను వదలి నేను ప్రారంభింపనున్న సహాయ నిరాకరణోద్యమాన్ని చర్చించి, అందులో లోటుబాట్లుంటే చూపండి. † అప్పుడు మా ప్రయత్నాలకు సాయపడిన వారౌతారు. మీరు రచయితలు గనుక మీ కర్తవ్యాన్ని నెరవేర్చిన వారౌతారు.........ఇండియాను గురించి వ్రాయబడుచున్న వాఙ్మయమంతా చెత్తరకానికి చెందినదే. ఏ రచనలోనూ స్వతంత్రత లేదు. ఈ రచనలన్నీ ఒక్క అచ్చునుంచి పోతబోసినట్లు వుంటవి. ఆ మార్గంలోనుంచి మీరు తప్పుకోవాలి. భాషను మించి నేనేమి చెప్ప ప్రయత్నిస్తున్నానో మీరు అర్థంచేసుకోవాలి. నాహృద

---

* ఈ మాటలన్నప్పుడు గాంధీజీ నెహ్రూగారి వంక చూచారు.

† గాంధిజీ నాతో మాట్లాడుతున్నా, నెహ్రూగారి నుద్దేశించి మాట్లాడుతూన్నట్లు నాకు తోచింది. "క్విట్ ఇండియా" విషయంలో గాంధీజీ నెహ్రూగార్ల భిన్నాభిప్రాయాలు కలిగివున్నారనుకున్నాను.

యాన్ని మీరు గ్రహించాలి ; వినాలి కూడాను. ఈ కార్యం చాలా కష్టమని నాకు తెలుసు. బ్రిటిష్, అమెరికన్ నాగరికతల సూక్ష్మత, సంస్కృతి, ప్రాభవంతో మీరు యిక్కడికి వచ్చారు. మీ ఆలోచనలకు సరిపడని భావాలను మీరు గ్రహించలేక పోవడం నాకు అర్థమౌతుంది. కాని మీ మనశ్శక్తి పాత పంథాలనుంచి బయట పడలేకపోతే మీరు సేవా గ్రామంలో గడపిన కాలం వృథాఅయినట్లే" అన్నారు గాంధీజీ.

గాంధీజీ మాటల్లో నాకు చెందిన వేవో, నెహ్రూగారికి చెందిన వేవో యోచించి కొద్దిసేపైన తర్వాత "సరే ! మీరు చెప్పిన నూతనావస్థను నాకు చూపగలరా ? నా మనస్సులోవున్న నూతనవ్యవస్థ రూపం దాలుస్తుందన్న నమ్మకం నాకులేదు. అలాంటప్పుడు మీ నూతన వ్యవస్థను దుస్సాధ్యమనలేను. ప్రపంచాభ్యుదయానికి ఇండియా చాల తోడ్పడ గలదని నా నమ్మకం. భావిపరిణామం యెలా వుంటుందో సూచించ గలరా ?" అన్నాను.

"ఇప్పుడు అధికారమంతా ఢిల్లీ, కలకత్తా, బొంబాయిలాంటి పెద్ద పెద్ద నగరాలలో కేంద్రీకరింపబడి వుంది. ఈ అధికారం ఇండియాలోని 7,00,000 గ్రామాలకు పంచిపెట్టబడాలి. అంటే, కేంద్రశక్తి యేదీ వుండదన్నమాట. మీకు అర్థమయ్యేటట్లు మరోవిధంగా చెప్తాను. ఇప్పుడు 7,00,000 డాలర్లు (అమెరికా నాణెములు) ఇంగ్లండు బ్యాంకులో వున్నాయి. ఈ 7,00,000 డాలర్లను 7,00,000 భారతీయ గ్రామాలకు. గ్రామానికి ఒక డాలరు చొప్పున, పంచమంటున్నాను. అప్పుడు ప్రతి గ్రామానికి ఒక డాలరు వుంటుంది. ఏ గ్రామము అధిక ధనసంపన్నంగా వుండదు. నేడు ఇండియాలోని ఇంపీరియల్ బాంకులో వుంచబడిన 7,00,000 డాలర్లు జపాన్ విమానాలు ఒక్క బాంబువేస్తే ధ్వంసమై పోతవి. కాని యీ 7,00,000 డాలర్లు 7,00,000 వాటాదార్లకు పంచ బడితే అప్పుడు ఆ డబ్బు నెవ్వరూ ధ్వంసంచేయలేరు. ఈ 7,00,000 గ్రామాలు పరస్పరం సహకారభావంతో మెలగుతవి. ఈ సహకారం

స్వచ్ఛందంగా యేర్పడుతుంది. ప్రస్తుతంలాగా నాజీ యుక్తులమూలంగా యేర్పడే సహకారం కాదది. స్వతస్సిద్ధంగా యేర్పడిన సహకారం నిజమైన స్వాతంత్ర్యాన్ని సమకూరుస్తుంది. ఈ నిర్మలమైన స్వాతంత్ర్యం నూతన వ్యవస్థను స్థాపిస్తుంది. ఆ నూతన వ్యవస్థ ప్రస్తుతం సోవియట్ రష్యాలోనున్న వ్యవస్థకన్న యెంతో వుత్తమంగా వుంటుంది. రష్యాలో నిరంకుశత్వం వుందంటున్నారు కొందరు. కాని, యీ నిరంకుశత్వం నిరుపేదల—కష్టజీవుల మేలుకోసం వుపయోగించబడుతూ వుందని మరికొందరు అంటున్నారు. అటువంటి వాదనలో మంచి యేదీ నాకు కనబడదు. ముందు యీనిరంకుశత్వము మనం కని, విని ఎరుగని అరాచకత్వానికి దారితీస్తుంది. అటువంటి అరాచకత్వం మాదేశంలో కలుగకుండా మేము ప్రయత్నించగలం. ముందు ఇండియా పరిస్థితులు యిలావుంటాయని వూహించడం నా చేతనైన పనిగాదని నేను ఒప్పుకుంటాను. నే నిప్పుడు వర్ణించిన పరిస్థితులు మా దేశంలో ఒకప్పుడు ఆచరణలో వున్నవే. అటువంటి అవస్థ మాకు కొత్తదికాదు. కాని నేను వర్ణించిన నూతన అవస్థకు లోటుబాట్లున్నాయి. లేకున్న యీఅవస్థ ఇంతకు పూర్వం మొగల్‌చక్రవర్తులకు, బ్రిటిష్‌వారికి లొంగిపోయేదిగాదు. నేటికీ ఆ అవస్థలో కొన్నిఅంశాలు సజీవమైఉన్నాయి. ఆ అవస్థ మా దేశంలో వేళ్ళు నాటుకుపోయింది. ఆ వేళ్ళు బ్రిటిష్ నిరంకుశాన్ని యెదుర్కొని కొంత దెబ్బతిని గూడా యీ నాటికీ యింకా సజీవమై వున్నా యని నా నమ్మకం. ఆ వేళ్ళు, ఆ యెండిన వృక్షంకూడా మళ్ళీ మొలకలెత్తను సిద్ధంగా వున్నవి. కాని, కొద్ది వర్షపుచినుకులు పడితేనేగాని యీ మొద్దు మొలక లెత్తదు. బ్రిటిష్‌వారినుంచి అధికారం మా చేతికి వచ్చినప్పుడు, తొలకరి చినుకులకు మొక్కలు మొలచినట్లు, యీ పురాతనావస్థ మరల సజీవమౌతుంది. ఈ మొలక యెలావుంటుందో నేను చెప్పలేను. కాని యిప్పుడు మే మనుభవిస్తూ వున్న ప్రభుత్వవిధానాని కన్నను వుత్తమోత్తమమైన ప్రభుత్వవిధానాన్ని చేకూరుస్తుందని నా నమ్మకం. దురదృష్ట

వశాత్తు ప్రస్తుతం అహింసాయుతమైన దృష్టి ప్రజలలో యెక్కువగా లేదు. కాని. గడచిన యిరవై ఐదేండ్లుగా నూతనవ్యవస్థను స్థాపించాలని మేము చేస్తూన్నకృషి వృథాపోయిం దనుకోను. నూతన వ్యవస్థను వొక రూపానికి తీసుకురావడంలో కాంగ్రెసుపార్టీకి చాల పలుకుబడి వుంటుంది. ముస్లిం లీగ్‌కు గూడా తప్పక పలుకుబడి వుంటుంది " అన్నారు గాంధీజీ.

"మీరు చెప్పిన 7,00,000డాలర్ల వుదాహరణను విశదీకరించవలె నని నా కోరిక. ఇంగ్లండులోని బ్యాంకు నుంచి తమకు వచ్చిన ఒక డాలర్‌తో గ్రామాలు యేంచేస్తవి?" అని ప్రశ్నించాను.

"నేడు వాటాదారులకు వారి భాగం అందడం లేదు. మధ్యవర్తులు, దలారులు తినేస్తూ వున్నారు. రైతులు తమ డాలర్లకు అధిపతులైనప్పుడు ఆ డబ్బును వారికి తోచిన వుత్తమరీతిని ఖర్చుచేస్తారు" అన్నారు గాంధీజీ.

"రైతు తన డబ్బును నేలలో పూడ్చిపెడతాడు" అన్నాను.

"బ్రతుకు దెరువు చూచుకొని జీవయాత్రను సాగించవలసి వుంటుంది గనుక రైతులు వారి డాలర్లను నేలలో పాతిపెట్టరు. వారి సొంత బ్యాంకుకు వెళ్ళి దాచుకొని, ఆ బ్యాంకుద్వారా తమ కవసరమైన పనులకు వెచ్చిస్తారు. గాలిసాయంతో పనిచేసే మిల్లులనో, లేక విద్యుచ్ఛక్తి కేంద్రాలనో, వారికి యేవి అవసరమని తోచిన వాటిని నిర్మిస్తారు. కేంద్రప్రభుత్వం వొకటి యేర్పడుతుంది. కాని ఆ ప్రభుత్వం ప్రజల అభీష్టాన్ని అనుసరించి వర్తిస్తుంది. వారి మనోభీష్టంమీద ఆధారపడి వుంటుంది" అన్నారు గాంధీజీ.

"అప్పుడు ప్రభుత్వం పరిశ్రమలను హెచ్చుగా అభివృద్ధి చేస్తుం దనుకుంటా!" నన్నాను.

"బ్రిటిష్ సైన్యం లేకుండా కేంద్రప్రభుత్వం యేర్పడే పరిస్థితులను మీరూహించుకోవాలి. సైన్యంతో నిమిత్తం లేకుండా దేశాన్ని యేకము చేయగలిగామంటే మేము నూతన వ్యవస్థను స్థాపించినట్లే. అదే మా నూతన వ్యవస్థ. అటువంటి వ్యవస్థను స్థాపించనే మేము యింతకాలమూ

ప్రయత్నించడం. ఇది అసంభవమైన ఆశయంగాదు. ఆచరణ యోగ్యమైనదే" అన్నారు గాంధీజీ.

"ఆచరణ యోగ్యమైనదని నేనూ వొప్పుకుంటాను. పదేండ్ల నాడైతే అది అసంభవ మనేవాణ్ణి. రష్యాలోను, తదితర దేశాల్లోను నాకు కలిగిన అనుభవాన్నిబట్టి బలవత్తరమైన ప్రభుత్వాలు ప్రపంచ క్షేమానికి విరోధమన్న నమ్మకం నాకు యేర్పడింది. శక్తివంతమైన ప్రభుత్వాలు వ్యక్తుల స్వాతంత్ర్యాన్ని మాపివేస్తవి. పెట్టుబడిదారి విధాన ఫలితంగా ఆర్థిక విషయాలలో ప్రభుత్వం నానాటికీ యెక్కువ జోక్యం కలుగ జేసుకోవలసిన అవసరం యేర్పడినది. అందుచేత ప్రభుత్వానికి బలం హెచ్చుతూంది. మన తర్వాత రానున్న తరాలవారు ప్రభుత్వాధికారాన్ని తగ్గించను ప్రయత్నించవలసి వస్తుంది. ప్రభుత్వాధికారాన్ని యెలా మితపరచడమా? అన్నది ముమ్ముందు గొప్పసమస్యగా పరిణమిస్తుంది. సర్వాధికారము ప్రభుత్వము చేతులలోనేవున్న దేశంలో వ్యక్తి స్వాతంత్ర్యాన్ని రక్షించుకోగలమా? అన్నది వొక సమస్య. అంతర్జాతీయ సఖ్యతకు అనువైన మార్గాన్ని వొకదానిని యేర్పాటుచేసి దేశాలన్నీ యేకమై ప్రపంచశాంతిని స్థాపించగలవా? అన్నది రెండవ సమస్య. ఈ రెండు సమస్యలూ కూడా పరిష్కారం కావాలి. లేకుంటే మళ్ళీమళ్ళీ యుద్ధాలు వస్తూనే వుంటవి" అన్నాను.

"ఈ మహత్తర శక్తిగల ప్రభుత్వాలు, గొప్పగొప్ప రాజ్యాలు యేర్పడకుండా యెలా అడ్డడం? అని నా ప్రశ్న. అందుకనే మిత్రరాజ్యాలు ఫాసిస్ట్ రాజ్యాల కర్తవ్యాన్ని పూనడం నా కిష్టంలేదు. భారతదేశం చెపుతూవున్నది సబబని మిత్రరాజ్యాలు ప్రకటించాలని కోరుతున్నాను. ఒక అంగముందుకువేసి, 'ఇండియాకు స్వాతంత్ర్యంయిచ్చి, అవసరమైతే ఇండియా షరతుల ప్రకారం యుద్ధసమయంలో ఇండియాలో వుందాం' అన్న నిశ్చయానికి మిత్రమండలివారు రావాలి. 'అప్పుడు బ్రిటిష్, అమెరికన్, భారతీయ ప్రజలలో సహకారం దానంతట అదే కలుగు

తుందేమో చూద్దాం ?' అన్న దృష్టి మిత్రమండలి వారికి వుండాలి" అన్నారు గాంధీజీ.

"మీరు తప్పకుండా స్వతంత్రులు కావాలని నా కోరిక. మీ స్వాతంత్ర్యం మీకు, మాకు, అందరికి కూడా మేలుచేస్తుంది. ఇప్పటివరకు బ్రిటిష్‌వారు తమ సామ్రాజ్యాన్ని రక్షించుకోగల మహాప్రతిభనుగాని, సామ్రాజ్యప్రజల సానుభూతిని సంపాదించగల తెలివి తేటలనుగాని ప్రదర్శింపలేదు" అన్నాను.

"ఈ విషయం మీరు అమెరికాకు చెప్పాలి" అన్నారు గాంధీజీ.

"నేను తప్పకుండా అమెరికాకు చెప్తాను. కాని యీ విధంగా చెప్పను. మారణయంత్ర సామగ్రిని కొనడానికి కావలసిన డబ్బునంతా మేము ఇంగ్లండుకు అప్పిస్తున్నాం. 1942 లో 60,000 విమానాలను వుత్పత్తిచేయనున్నాం.1943 లో 1,40,000 విమానాల నుత్పత్తిచేస్తాం. భారతీయ సమస్యలో అమెరికా జోక్యం కలుగజేసుకునే విషయంలో మీ దేశంలోని పరిస్థితులు మేము అనుకున్నంతకు ముందుగానే విష మించినవి. * సాలీనా 1,40,000 విమానాలను వుత్పత్తిచేస్తూ, యుద్ధ రంగాల్లో మేము 20,00,000 సైనికులను వుంచినప్పుడు, భారతదేశాన్ని గురించి మేము యేమనుకుంటున్నామని లండన్‌లోని అధికార వర్గం గమనించక తప్పదు. ఆసియాఖండంలో నేడు యేమి జరుగుతూ వున్నది బ్రిటిష్‌వారు గ్రహించలేకుండా వున్నారు. అమెరికా సాయంతో రేపటిరోజు యీ విషయాన్ని గ్రహించగలుగుతారు" అన్నాను.

"అందుకనే నేను సత్యాగ్రహాన్ని ప్రారంభింప తీర్మానించు కున్నాను. మేము బ్రిటిష్ వారితో వాదించి యేం చెప్పినా, రుజువు చూపినా వారు అర్థంచేసుకోలేరు. మా వుపపాదనలు న్యాయమని, ఆచర ణయోగ్యమని మేము యెంత చెప్పినా వారి బుర్రకెక్కడం లేదు. మేము కార్యసాధనకు పూనుకుంటే అప్పుడు వారికి జ్ఞానోదయం ఔతుంది.

* ఈ మాటలు నేననగానే అచ్చటి వారందరూ నవ్వారు.

బ్రిటిష్ చరిత్రనుబట్టి చూస్తే వారు మాటలతో దారికి రారని, క్రియలుగాని వారికి బుద్ధిచెప్పలేవని నిర్ధారణ ఔతుంది. క్రియారూపంగా వున్న భావాలు బ్రిటిష్ వారికి సులభంగా గ్రాహ్యమౌతవి. అందుచేతనే మేము కార్యసాధనకు పూనుకోవాలి. భారతదేశంలో వెంటనే జాతీయ ప్రభుత్వం నెలకొల్పబడవలెనని, అందులో అసాధ్యమేదీ లేదనీ నేను ప్రస్తుతం ప్రచారం సాగించాలి. ఈ జాతీయ ప్రభుత్వాశయం అహింసా తత్వం మీద ఆధారపడి వుంది. నాకు హింసలో నమ్మకమున్నా కూడా జాతీయ ప్రభుత్వ స్థాపన అవసరమని నమ్మక తప్పదు. హింసలో నాకు నమ్మక మున్నా "మీరు దయచేయండి. మీ యుద్ధప్రయత్నాలకు మాదేశాన్ని కీలక స్థానంగా వుపయోగించకండి" అని బ్రిటిష్‌వారితో చెప్పేవాణ్ణే. కాని నా అహింసా తత్వం కారణంగా యీ వేళ "మీరు ఇండియా యితరుల చేతుల్లో పడకుండా, మీకు మూలస్థానంగా వుంచుకొని యుద్ధంచేయా లంటే మేమందుకు వొప్పుకుంటాం. కాని గౌరవమైన షరతుల మీద మీరిక్కడ వుండాలి. మాకు హానిచేయడానికి వీలులేదు" అంటున్నాను. మరో అడుగు ముందుకు కూడా వెళ్తున్నాను. నేను ఇండియాలో స్థాపించ బోయే కేంద్ర ప్రభుత్వం, హింసలో నమ్మకం గల్గి, సైన్యాలను లేవదీస్తే బ్రిటిష్‌వారు ఆ ప్రభుత్వం సాయంకూడా పొందవచ్చు" నన్నారు గాంధీజీ.

"మీ బలవంతం మీద, వొత్తిడి వలన బ్రిటిష్‌వారు మీ షరతులకు వొప్పుకుంటే మీ 7,00,000 గ్రామాలు గల ప్రజాస్వామ్యాన్ని మీరెలా ప్రారంభిస్తారు ?" అని అడిగాను.

"మా ప్రజాస్వామ్యం ఆనాడు యిలా వుంటుందని యీవాళ యెలా చెప్పను ? ఇప్పటి చర్చఅంతా కేవలం సిద్ధాంతం మీద ఆధారపడినది. ప్రజా ప్రతినిధులు పలువురు కూర్చుని, చర్చించి వొక ప్లానును (నిర్ణయ విధానాన్ని) తయారుచేయవలసి వుంటుంది. కేవలం గాలిలో మేడలు కట్టేవాడని ప్రఖ్యాతిగాంచిన నేను ఒక్కణ్ణే నిర్ణయించడం బాగుండదు" అన్నారు గాంధీజీ.

"మీ ఆలోచన లేవో చెప్పారంటే నేను వూహించుకో లేక పోతానా ? ఖద్దరుకు మిల్లుబట్టకు వ్యత్యాసం నేనెరుగనా ? మీరు సూచిస్తే చాలు" అన్నా నేను.

"కాని, కూరగాయలు తినపలెనని అర్థంచేసుకోలేరేం మీరు ?" అన్నారు గాంధీజీ, పరిహాసంగా.

"ప్రతిరోజూ భోజనానికి—పగలూ, రాత్రీ— వొకే కూరతినడం నాకిష్టంలేదు" అన్నాను. గాంధీజీ నవ్వారు. మేమందరం నవ్వాం. నేను సెలవు పుచ్చుకొని నా బసకు పెళ్ళాను.

నా బసలో ఒక్కటే వొక్కగది వుందని ముందే చెప్పాను. ఈ వేళ మధ్యాహ్నం నెహ్రూ, నేనూ మూడుగంటలసేపు అతిధి గృహంలో మాట్లాడుతూ కూర్చున్నాం. మాగదిలో ఒక కుర్చీ మాత్రమే వుంది. నేను ఆ కుర్చీలో కూర్చున్నా. నెహ్రూగారు పడకమీద పద్మాసనం వేసుకు కూర్చున్నారు. మానవ సౌఖ్యం, సంస్కృతి, సంఘం యెలా అభివృద్ధి చెందాలి ? మానవుడు ఆనంద జీవితాన్ని గడపగల పరిస్థితులు యెప్పుడు యేర్పడుతవి ? అమెరికా, రష్యా, ఇండియా—యింకా యెన్నో విషయాలను గురించి మాట్లాడాం. ప్రస్తుతం నెహ్రూగారు మునుపటి యంత సోవియట్ పక్షపాతిగా కనబడలేదు. చైనాపట్ల యెక్కువ సుహృద్భావాన్ని కలిగివున్నారు. చైనాను గురించి యీవేళ గాంధీజీతో మాట్లాడారు. గాంధీజీ—నెహ్రూగార్ల మధ్య (భావాల్లో) యిచ్చి పుచ్చు కోడం యెప్పుడూ సాగుతూనే వుంటుంది. కడపటికి గాంధీజీ, నెహ్రూ గారిని తన దృక్పథానికి తీసుకొని రాగలుగుతారు. ఇక్కడికి వచ్చేసరికి నెహ్రూగారికి గాంధీజీ ప్రారంభింపనున్న వుద్యమాన్ని గురించి కొన్ని సందేహాలున్నాయి. భారతీయ సమస్యలో రూజ్‌వెల్ట్ మళ్ళీ కలుగజేసు కుంటాడని నెహ్రూగారు కనిపెట్టుకొని వున్నారు. బ్రిటిష్‌వారు యేదో విధంగా కాంగ్రెస్‌తో రాజీపడేట్లు రూజ్‌వెల్ట్ తన పలుకుబడిని వుపయోగి స్తాడనుకున్నారు. బ్రిటిష్‌వారు, యుద్ధం ముగిసేవరకు భారతీయ సమ

స్యను పరిష్కరించమని మెండిపట్టు పట్టినందున నెహ్రూ వంటి జాతీయ వాదికి గాంధీజీ వాదన బాగా నచ్చింది. బలవంతం మీదగాని, వొత్తిడి చేస్తేనే గాని బ్రిటిష్‌వారు అధికారాన్ని, కొంతైనా, భారతీయులకు విడవను వొప్పుకోరు. వారిపై వొత్తిడి తీసుకొని రావడానికి సహాయ నిరాకరణోద్యమం అవసరమని గాంధీజీ వాదన. అమెరికా, ఇండియాకు సాయపడ లేకపోయిన తర్వాత, నెహ్రూగారికి గాంధీజీ తత్వంలో నమ్మకం యెక్కువైంది.

నెహ్రూగారికి నేను సలహా యిచ్చాను. అమెరికాకు వచ్చి అధ్యక్షుడు రూజ్‌వెల్ట్‌తో సంప్రదించుమన్నాను. "అమెరికన్లు స్వాతంత్ర్య సమరం సాగిస్తూవున్న ప్రజలకు యెంతో సానుభూతి చూపెడతారు. అమెరికాకు, బ్రిటిన్ వలె ఇండియా విషయంలో ఆర్థిక లాభ దృష్టిలేదు" అని చెప్పాను.

నేనూ, నెహ్రూగారూ హిందూ మతాన్ని గురించి చర్చించాం. "హిందూ మతం మూఢమతం కాదు. మత నిబంధనలను నిష్కర్షగా ఆచరణలో పెట్టని హిందువును వెలిబెట్టడానికిగాని, శిక్షించడానికిగాని వీలు లేదు. మీరు హిందువులుగా వుండి నాస్తికుడుగా వుండవచ్చు. ఈ విషయం ఉదయం గాంధీజీ మీతో చెప్పారు, జ్ఞాపకముందా? కుల తత్వంలోగాని, అస్పృశ్యతలోగాని నమ్మకంలేకున్నా మీరు హిందువులుగా వుండవచ్చు. అదే విధంగా మీరు ధర్మపరులైన హిందువుగా నుండి క్రైస్తు బోధనలలో నమ్మకం కలిగివుండవచ్చు. క్రీస్తు చిత్రాన్ని మీ యెదుట వ్రేలాడగట్టి పూజించవచ్చు" నన్నారు, నెహ్రూగారు.

---

జూన్ 8, 1942

నెహ్రూగారూ, నేనూ అతిథి గృహంలోనే పరున్నాం. ఉదయం విదురలేచిందే రాత్రి తాను నిద్రపోలేక పోయారని, యేవో కేకలు వినపడినవని నెహ్రూగారు చెప్పారు. కాని నేను యీ ఐదారు రోజులలో యే శబ్దము వినలేదు. నెహ్రూ గారు ఆశ్రమంలోని మిత్రులతో ప్రసంగించి తొమ్మిదింపావుకు తిరిగి వచ్చారట. నాతో ప్రసంగించుదా మనుకున్నారట. కాని నేను గాఢ నిద్ర చెంది వుండడం చూచి తాను పరున్నారట.

గాంధీజీ, యెప్పటివలనే, వుదయం ఆరు గంటలకు షికారుకు బయలుదేరారు. అలవాటు ప్రకారం ఆయన వెంట యెనిమిది, పదిమంది తెల్ల బట్టలనే ధరించినవారూ బయలుదేరారు. ఈ రోజు గాంధీజీ మౌనం రోజు. ఆయన షికారుకు వెళ్లుతూ పంచలో కూర్చున్న నన్ను చూచి, తన చేతిని పైకియెత్తి సైగచేశారు. హైపుచేశాను కొంతసేపు. తర్వాత నెహ్రూతో మాట్లాడుతూ వుదయం గడిపాను.

మధ్యాహ్నం ఆర్యనాయకంగారు నా బసకు వచ్చారు. ఆయన అమెరికాలోని కొలంబియా విశ్వవిద్యాలయంలో ఆచార్య డ్యూయి, థారన్‌డైక్ గార్ల వద్ద చదివినవారు. ఎడింబరో, కేంబ్రిడ్జ్, ఆక్స్‌ఫర్డ్ విశ్వ విద్యాలయాల్లో పట్టభద్రులైనవారు ఆయన. నేను సేవా గ్రామంలో నున్న ఐదారు రోజులూ పడకటింట్లోవాడే పలచని పాదరక్షలను వాడుతూ వచ్చాను. ఇసుక, గులకరాళ్ళు యీ పాదరక్షలలోకి ప్రవేశించడంచేత తూట్లుపడ్డవి. ఈ విషయాన్ని ఆర్యనాయకంగారు గమనించినట్లున్నది. తెల్ల ఖద్దరు ఉడుపులను, కొత్త చెప్పుల జతను నాకొఱకు ఆయన తెచ్చారు. తాను అమెరికాలో చదువుకుంటున్నప్పుడు కలిగిన అనుభవాన్ని వొకదాన్ని చెప్పారు—తాను 'యస్. యస్. బెరంగీరియా' అన్న స్టీమర్‌లో న్యూయార్క్ నగరానికి వెళ్ళుతున్నారట. తాను నల్లటి వాడు

గనుక ఆ స్టీమర్‌లోని నౌకరు తనకు వడ్డించనన్నాడట. ఆ అవమానం ఆయన హృదయంలో నాటుకుపోయింది.

వార్ధా విద్యా విధానాన్ని కాచి వడియపోసినవా డాయన. రైతు బిడ్డలకు వ్యవసాయం, నూలువడకడం, బట్టనేయడం మొదలైన చేతి పనులను నేర్పించడం యీ విద్యా విధానంయొక్క ముఖ్యోద్దేశం. "1937-39లో కాంగ్రెస్‌వారు మంత్రిపదవులలో వున్నప్పుడు వార్ధా విద్యా విధానానికి దోహద మిచ్చారు. కాని తర్వాత బ్రిటిష్‌వారు యీ విద్యా విధానాన్ని నిరసింప నారంభించారు. భారతదేశంలో బ్రిటిష్ విద్యావిధానం నిరుపయోగమైనదని ఋజువుచేయను బ్రిటిష్ అధికారుల రిపోర్టులనుంచి సమకూర్చిన యీ లెఖ్ఖలను చూడండి. మాదేశంలోని ప్రస్తుత విద్యా విధానంయొక్క ముఖ్యాశయం బ్రిటిష్‌వారికి గుమాస్తాలను, ఉద్యోగులను తరిఫీదు చేయడమే. అందువల్ల, ప్రజాబాహుళ్యానికి విద్య గరపడంలో ప్రభుత్వానికి ఆసక్తిలేదు. మధ్యతరగతి ప్రజల్లో కొద్ది మందికి విద్య గరిపి, తమ కవసరమైన నౌకరీలు వారిచేత చేయించుకోను అనువుగా తమ విద్యా విధానాన్ని ప్రభుత్వం సాగిస్తూంది. తత్ఫలితంగానే మా దేశంలో జాతీయత మధ్యతరగతి ప్రజలదిగా నున్నది. ఇటీవల బ్రిటిష్ ప్రభుత్వం కొన్ని ట్రైనింగ్ స్కూలు భవనాలను ఆక్రమించింది. ఆ ట్రైనింగ్ స్కూళ్లను మూసివేసింది'' అన్నారు ఆర్యనాయకంగారు.

"శాంతి సమయంలో బ్రిటిష్‌వారు మా దేశ వరుంబడిలో సైన్యానికి వెచ్చించే డబ్బులో కొద్ది భాగం విద్యకై వెచ్చించియున్న మా రైతులు యింత నిరక్షర కుక్షులుగా నుండరు" అన్నారు నెహ్రూగారు.

"అవసరమైనన్ని పాఠశాలలను నెలకొల్పడానికి డబ్బులేదని బ్రిటిష్‌వారు సదా వాదిస్తున్నారు. అధికార రీత్యా ప్రకటింపబడిన లెఖ్ఖలను గమనించండి—1921 లో మా ప్రజల్లో 7% మాత్రమే అక్షరాస్యులు; 1931 లో 8% అక్షరాస్యులైనారు. పదేండ్లలో నూటికి ఒక్కరికి చొప్పున విద్యాభివృద్ధి సాగిందన్నమాట" అన్నారు, ఆర్యనాయకంగారు. 1941 లో

జనాభా లెఖ్ఖలనుబట్టి, విద్యాభివృద్ధిని గురించిన లెఖ్ఖలు అంత నమ్మ దగినవి కావని ప్రభుత్వమే వొప్పుకుంది.

గాంధీజీ తన మౌనవ్రతాన్ని త్వరలోనే ముగించారు. అందువల్ల, యధాప్రకారం, నేను మధ్యాహ్నం మూడుగంటలకు గాంధీజీని కలుసు కోను వీలుగలిగింది. గాంధీజీని కలుసుకోగానే మే మింతవరకు చర్చిం చని, కష్టతరమైన, సమస్యను చర్చించ నారంభించాము. "మన మింత వరకు మీదేశ మహత్తర సమస్యను చర్చించనేలేదు!" అన్నాను.

"ఏమిటా సమస్య?" అన్నారు గాంధీజీ. మీ జనాభా సమస్య. మీ జనాభా సాలుకు 50, 00, 000 చొప్పున హెచ్చుతూవుంది. బ్రిటిష్ అధికారపు లెఖ్ఖల ప్రకారం 1931 లో ఇండియా జనాభా 33, 80, 00, 000. 1941 లో 38, 80, 00, 000 కు పెరిగింది. 5, 00, 00, 000 యెక్కువ ప్రజలను కూడుబెట్టి, బట్టయిచ్చి, నివాసా లేర్పరచి పోషించ వలసి వచ్చింది. పదేండ్లలో 5 కోట్లు యెక్కువ ప్రజలైనా రన్నమాట. ఈ సమస్యను యెలా పరిష్కరిస్తారు?" అని గాంధీజీని ప్రశ్నించాను, "ఈ సమస్యా పరిష్కారానికి గర్భ నిరోధం వొకమార్గం కావచ్చు. కాని, గర్భ నిరోధ పద్ధతికి నేను విముఖుణ్ని" అన్నారు గాంధీజీ.

"గర్భ నిరోధ పద్ధతికి నేను విముఖుణ్నిగాను. కాని భారతదేశం యింకా నవనాగరిక దేశం కాలేదు. అందువల్లనే భారతదేశంలో గర్భ నిరోధ పద్ధతి జయప్రదం కాజాలదని నా నమ్మకం" అన్నాను.

"అయితే యే కరువో, కాటకమో రావా లనుకుంటాను" అంటూ గాంధీజీ నవ్వారు.

"లేక గొప్ప అంతర్యుద్ధం రావాలా?..........కాని సోవియట్ రష్యాలో గొప్ప క్షామాలు, జబ్బులు, అంతర్యుద్ధం—అన్నీ వచ్చినా జనాభా అతి వడిగా హెచ్చుతూనే వచ్చింది. అందువలన 1928 లో బోల్షివిక్కులు కొన్ని ఆర్థిక చర్యలను అమలులో నుంచారు" అన్నాను. "ఇంతకు, మా దేశం పారిశ్రామికాభి వృద్ధిని అతి త్వరితగతిని సాగించా-

లని నాచేత అనిపించాలని మీరు ప్రయత్నిస్తున్నట్లుందే? అలాంటి భావాలకు మీరు నన్నువొప్పించలేరు. మా ప్రప్రథమ సమస్య బ్రిటిష్ పరిపాలననుండి విముక్తి పొందడమే. పిదప, యితరుల జోక్యం లేకుండా, మా దేశ అవసరాలనుబట్టి నడుచుకోడానికి స్వతంత్రులమై వుంటాము. బ్రిటిష్‌వారు వారి అనుకూలానికి అనుగుణ్యంగా కొన్ని ఫ్యాక్టరీలను, పరిశ్రమలను మేము నిర్మించి, సాగించడానికి వొప్పుకున్నారు. కొన్ని పరిశ్రమలను మేము సాగించకూడదని అడ్డుపడ్డారు. నాకు, పుత్తమోత్తమ సమస్య, బ్రిటిష్ పరిపాలనను అంత మొందించడమే" అన్నారు గాంధీజీ.

గాంధీజీ యెంత సేపటికి బ్రిటిష్ పరిపాలనా సమాప్తిని గురించే మాట్లాడ దలచుకున్నారు. అస్పష్టమైన భావిదశలో ఆయనకు ఆసక్తి లేదు. "సరే! రానున్న మీ సహాయ నిరాకరణోద్యమం యెలా సాగుతుంది? యే రూపం దాలుస్తుంది?" అని ప్రశ్నించాను.

గ్రామాల్లో రైతులు పన్నులు గట్టరు. ప్రభుత్వ నిషేధమున్నా లెక్క చేయక రైతులు ఉప్పుచేస్తారు. ఉప్పుకాయడం చాల స్వల్ప విషయంగా కనబడుతుంది. ఇండియా ప్రభుత్వానికి వుప్పువల్ల రాబడి చాలా స్వల్పం. కాని యీ వుప్పు పన్నును యివ్వ నిరాకరించడానికి తగిన ధైర్యం రైతులకు కలిగితే, తద్వారా స్వతంత్రించి కార్యసాధన కురకడానికి తగిన ధైర్యం వారికి వస్తుంది. తర్వాత రైతులు భూములను పశపరుచుకుంటారు" అన్నారు గాంధీజీ.

"దౌర్జన్యంగానా? లేక ఒత్తిడి నుపయోగించా?" అని ప్రశ్నించాను.

"దౌర్జన్యం ఉపయోగింప బడవచ్చు. కాని, రైతులు భూముల నాక్రమించను జమీందారులే సాయపడవచ్చు" నన్నారు గాంధీజీ. "మీకు విజయంలో అంతులేని నమ్మక మున్నదే?" అన్నాను.

"ఏం! జమీందారులు కాలికి బుద్ధి చెప్పడం రైతుకు సాయపడడం అవుతుంది" అన్నారు గాంధీజీ.

నెహ్రూగారు యింతసేపూ నా ప్రక్కనే కూర్చున్నారు. "మీరు 'వ్యక్తులు—రాజకీయాలు' అన్న మీ రచనలో వర్ణించినట్లు మా జమీందారులు పలాయన మంత్రం పఠింపవచ్చు. తర్వాత రైతులు జమీందారీల, నాక్రమించడానికి సాయపడిన వారౌతారు. 1917లో రష్యన్ సైనికుడు శాంతి కావాలని తనకాలితో (చేతితోకాదు)వోటునిచ్చాడని లెనిన్ వ్రాశారు. యుద్ధ రంగంనుంచి రష్యన్‌సైనికుడు పరుగెత్తి పోయాడు. అదేవిధంగా మా జమీందారులు, తమ జమీన్‌లను రైతు లాక్రమించ వచ్చునని కాళ్ళతో వోట్లివ్వవచ్చు ; గ్రామాలనుంచి పరిగెత్తి వెళ్ళవచ్చు" నన్నారు జవహర్ లాల్‌గారు.

"లేక రైతులను సాయుధ బలంతో యెదురుకొనను సంసిద్ధులు గావచ్చుగా" అన్నాను.

"పదునైదు రోజులు అల్లరి జరగవచ్చు. కాని త్వరలో శాంతిని స్థాపించగలమని మా నమ్మకం" అన్నారు గాంధీజీ.

"అంటే పారితోషిక మివ్వకుండా భూములను అపహరించాలనా! మీ రనడం?" అని ప్రశ్నించాను.

"ఆ! అవును. జమీందారులకు వారి జమీన్‌లకు బదులు డబ్బు యివ్వడం అర్థికంగా అసాధ్యమైనపని" అన్నారు గాంధీజీ.

"సరే! యీ విషయం గ్రామాలకు సంబంధించింది. మరి పట్టణాల సంగతేమిటి?" అని అడిగాను. "పట్టణాల్లో శ్రామికులు తమ ఫాక్టరీలను వదలి (బయటికి) వస్తారు. రైలుబండ్లు ఆగిపోతవి" అన్నారు గాంధీజీ.

'దేశమంతటా సమ్మెలు జరుగతవన్న మాట' అని నాలో నే వనుకున్నాను. "మీకు గ్రామాలలో.రైతులలో యెక్కువ పలుకుబడి వున్నదని యింతకుపూర్వం ఋజువైన విషయమే. కాని పట్టణాల్లోని శ్రామికులలో మిమ్ము అనుసరించేవా రెక్కువమంది లేరేమో?" అన్నాను.

"లేరు. ఎక్కువమందిలేరు. కాని యీమారు శ్రామికులు గూడా నా సలహాను ఆమోదిస్తారు. మా దేశంలో, ప్రస్తుతం, ప్రతివ్యక్తి

హిందువుగాని, ముస్లింగాని, హరిజనుడుగాని, రైతుగాని, ధనికుడుగాని, ప్రభుత్వోద్యోగిగాని, సంస్థానాధీశుడుగాని, ప్రతి ఒక్కడు స్వాతంత్ర్యాన్ని కోరుతున్నాడు. స్వదేశ సంస్థానాధిపతులకు గూడా తెలుసు — కొత్తగాలి వీచుతూవుందని. ప్రపంచం యికముందు గూడా మునుపటివలెనే సాగదు. బ్రిటిష్ ఆధిపత్యాన్ని స్థిరపరచి, చిరంజీవిగా చేసేయుద్ధంలో మేము



గాంధీజీ - జిన్నా

సాయపడలేము. భారత దేశంలో ప్రజాస్వామ్యం లేనప్పుడు జపాన్, జర్మనీ, ఇటలీలలో ప్రజాస్వామ్యాన్ని నిలబెట్టను మేమెలా పోరాడగలం? చైనాను రక్షించాలని నా కోరిక. చైనాకు అపాయం రాకూడదని నా ప్రయత్నం. కాని బ్రిటిష్‌వారికి సాయపడాలంటే మేము స్వతంత్రులమై వుండాలి. బానిసలు ఇతరుల స్వాతంత్ర్యానికి పోరాడరుగా?" అన్నారు గాంధీజీ.

"సహాయ నిరాకరణోద్యమంలో ముస్లింలు మీకు సాయపడతారని మీరనుకుంటారా?" అని ప్రశ్నించాను.

"బహుశా ఆరంభంలో సాయపడక పోవచ్చు. కాని వుద్యమం జయప్రద మౌతూవుందని తోచినప్పుడు వారు తప్పక వస్తారు" అన్నారు గాంధీజీ.

"ఉద్యమాన్ని ఆపడానికిగాని, వుద్యమానికి అడ్డంకులు కల్గించడానికిగాని ముస్లింలు వుపయోగింప బడుదురేమో?" అన్నాను.

"నిస్సందేహంగాను! ముస్లిం నాయకులు, లేక ప్రభుత్వం అట్టి ప్రయత్నాలు చేయవచ్చు. కాని భారత స్వాతంత్ర్యానికి ముస్లిం ప్రజా బాహుళ్యం విరోధికాదు. అట్టి స్వాతంత్ర్య సంపాదనకు మేము చేసే ప్రయత్నాలను యెలా భగ్నపరచగలరు? కాంగ్రెసుయొక్క యేకైక ఆశయమైన 'భారతస్వాతంత్ర్యం' పట్ల ముస్లిం ప్రజలకు సానుభూతి వున్నది. ఈ రాతిమీదనే (భారతస్వాతంత్ర్యమన్న రాతిమీదనే) 'హిందూ—ముస్లిం సఖ్యత' అన్న సౌధాన్ని నిర్మించవచ్చు" నన్నారు గాంధీజీ.

మా సంభాషణను 'మిక్కుటమైన జనాభా' సమస్య చర్చకు దించాలని కడపటి ప్రయత్నంచేశాను. గాంధీజీ యీ మాటలు మాత్రమే బదులిచ్చారు—"పరిశ్రమలు అపరిమితంగా అభివృద్ధిచెందిన ప్రభుత్వమే మార్గదర్శిగా నుండాలి."

* * *

సాయంకాలం మహదేవ్‌దేశాయ్‌గారి కుటీరానికి వెళ్ళాను. ఆయన నూలు తీయడం గమనించాను. గాంధీగారి ఆంగ్ల వారపత్రిక 'హరిజన్'కు ఆయన సంపాదకుడు. గాంధీజీ తన 'ఆత్మకథ'ను వ్రాయుటకు దేశాయ్‌గారు యెంతో సాయపడ్డారు. న్యాయవాది వృత్తిని తన ఇరువది యైదవయేట వదలి, అప్పటినుంచి గాంధీజీతో పనిచేస్తున్నారని ఆయనే చెప్పారు. ఇప్పటికి పాతికేండ్లుగా దేశాయ్‌గారు గాంధీజీతో పనిచేస్తున్నారు. 1939 నుంచి గాంధీజీకి—విదేశీయులకు జరిగిన సంభాషణలలో నాతో యీ వారం రోజులలో జరిగిన సంభాషణలు చాల

ప్రాముఖ్యమైనవని దేశాయిగారన్నారు. గాంధీజీ చెప్పినదాన్నల్లా దేశాయి గారు తూ. చా. వ్రాసి వుంచుతారు. గాంధీజీకి—నాకు జరిగిన సంభాషణలు కూడా దేశాయిగారు వ్రాసివుంచారు. ఆయనతోపాటు నేను నేలమీద కూర్చున్నాను. ఆయన నూలు వడకడం చూచినప్పుడు నూలువడకడం యెంతో విశ్రాంతిని, సంతృప్తిని యిస్తుందని నా కనిపించింది.


గాంధీజీ - దేశాయి

"ఇన్నిరోజులూ గాంధీజీ చెప్పిన దానినల్లా అతి జాగ్రత్తగా విన్నాను. ఆయన మాట్లాడిన తర్వాత మా సంభాషణలను జాగ్రత్తగా వ్రాసి వుంచాను. వాటిని తర్వాత చదివి, ఆలోచించి, గాంధీజీకి యింత మహత్తర పలుకుబడి వుండడానికి కారణమేమిటా? అని కనిపెట్ట ప్రయత్నించాను. గాంధీజీ పలుకుబడికి ముఖ్యకారణం ఆయన స్వాతంత్ర్య కామి గావడమే అన్న తీర్మానానికి వచ్చాను" అని దేశాయిగారితో నన్నాను.

"అవును. అది నిజమే" అన్నారు దేశాయిగారు.

"గాంధీజీ కామానికి మూలం యేమిటి?" అని ప్రశ్నించాను.

"శరీరంలోని అరిషడ్వర్గాలు ఒక ఉన్నతస్థాయికి రావడంవల్ల యీ కామం యేర్పడినది" అన్నారు దేశాయిగారు.

"స్త్రీ యెడల గల కామమా?" అన్నాను.

"స్త్రీ పట్లగల కామము, కోపము, దురాశ—అన్నిటిని అణగద్రొక్కి, మేళవించి స్వాతంత్ర్యకామిగా గాంధీజీ తయారయారు. తన

తప్పును గాంధీజీ వొప్పుకోగలరు. తన్ను తాను నిందించుకొని, యితరుల తప్పులకు తగిన దండనను తా ననుభవించగలరు. సహాయ నిరాకరణోద్యమం వొకటి వ్యక్తుల పొరబాటువలన హింసాయుతంగా మారినప్పుడు ఆ బాధ్యతను తానే వహించగలరు. తన శరీరాన్నీ, ఆత్మనూగూడా గాంధీజీ తన అదుపాజ్ఞలలో వుంచుకున్నారు. శారీరక నిగ్రహం ఆయనలో అత్యంతశక్తిని, కామాన్ని కలిగిస్తూవుంది" అన్నారు మహాదేవ్ దేశాయిగారు.

భారతీయులు పాశ్చాత్యులకన్న యెంతో సత్యవంతులని నాకు తోచింది. స్వవిషయాలను వారు యెక్కువ నిజంగా బయటపెడతారు. తమ తప్పు—వొప్పులను బాగా తెలుసుకుంటారు. తమ చర్యలను తామే, విచక్షణతో, పరీక్షించుకుంటారు.

రేపటిరోజు హైదరాబాదుకు ప్రయాణమవను తీర్మానించుకున్నాను. హైదరాబాద్ నైజాము సంస్థానానికి ముఖ్యపట్టణం. ఈ సంస్థానానికి నైజామ్ ప్రభువు. ప్రపంచంలో యితనిని మించిన ధనికుడులేడు. బ్రిటిష్‌వారి సాయంతో యితను 1,60,00,000 ప్రజలను పాలిస్తూన్నారు. నేను సేవా గ్రామంలో యింకా కొన్నిరోజులు వుండవచ్చు. గాంధీజీకూడా యింకా కొన్ని రోజులుండుమని నన్నను కోరారు. నేను సేవాగ్రామంలో రెండు మూడు రోజులుమాత్రమే వుందామని వచ్చాను. ఇప్పటికే చాల రోజు లున్నాను. ఇక ప్రయాణం కావలసిందే. ప్రొద్దున్నే ఐదుగంటలకే లేచి, క్షౌరం చేసుకొని, ఫలహారంచేసి గాంధీజీవద్దకు వెళ్ళాను. ఆయన మామిడిపండ్ల రసాన్ని ఆరగిస్తూన్నారు.

"నేను వొకప్పుడు బెంగాల్‌లో చాల కష్టపడి పనిచేసే రోజుల్లో కేవలం మామిడిపండ్లు తినే జీవించాను" అన్నారు గాంధీజీ.

"అదే వొక అమెరికన్‌గాని, ఆంగ్లేయుడుగాని అయితే గొడ్డు మాంసం ముక్కతోటే జీవించేవాడు" అన్నానేను.

"అదే మాకు - మీకు వ్యత్యాసం. కాయగూరల్లోనైనా బ్రిటిష్

వారికి యెక్కువ రకాలులేవు. ఎంతసేపటికి గోసుగడ్డ, బంగాళాదుంపలే" అన్నారు గాంధీజీ.

మేము మాట్లాడుతూండగా కనుగాంధి మమ్మలను ఫోటోతీశాడు. కొద్దిసేపటికి షికారుకు బయలుదేరాం. దారిలో గాంధీజీతో సంభాషణ ప్రారంభించాను—

"ప్రపంచాన్ని గురించి, మీ చర్యలను గురించి మీరు చాల నిర్దాక్షిణ్య దృష్టితో చూస్తూన్నారు. అదే విధంగా మిమ్మగురించి విమర్శనా దృష్టితో నిర్దాక్షిణ్యంగా చెప్పమని కోరుతున్నాను. మిమ్మగురించి వొక ప్రశ్న అడుగవలె ననుకున్నాను. ఇది కేవలం మీ విషయమేకాదు. రాజకీయ సంబంధమైన ప్రశ్నయిది—ఇంతమంది ప్రజలలో మీకు పలుకుబడి కలుగడానికి కారణమేమిటి?" అని అడిగాను.

"ఈ ప్రశ్నను మీరు యే వుద్దేశంతో అడుగుచున్నది నా కర్థమైంది. నా పలుకుబడికి కారణం నా సత్య వ్రతమేనని నా ఉద్దేశం. సత్యవ్రతమే నా పరమాశయం'' అన్నారు గాంధీజీ.

"సత్యం యొక్క శక్తిని నేను కొంచ పరచడంలేదు. కాని మీ సమాధానం అసంతృప్తికరంగా నున్నది. హిట్లరువంటి ప్రజానాయకులు అసత్యాలుచెప్పి అధికారాన్ని హస్తగతం చేసుకున్నారు. దీనినిబట్టి, మీరు సత్యంచెప్పి ప్రజాహృదయాన్ని చూరగొనలేదనిగాదు. ఈ దేశంలోగాని, మరెచ్చటనైనాగాని సత్యం మాత్రమే యెవరికీ వుపయోగ పడినట్లులేదు. అధికారాని కనుగుణమైన డాబు, డంబము, ఆడంబరము లేకుండా అందగా ప్రభుత్వంగాని, పోలీసులుగాని లేకుండా, కర్మకాండగాని, చక్కగా తయారైన సంస్థగాని మీకు అండగా లేకుండా * యిన్ని కోట్ల ప్రజలు మిమ్ము అనుసరించేట్లు చేయగలిగారు? ఇన్నికోట్ల ప్రజలు వారి సౌఖ్యాన్ని, కాలాన్ని, ప్రాణాన్నిగూడా త్యాగం చేయడానికి సంసిద్ధులవుతున్నారే! ఇందుకు కారుణమేమిటి?" అని అడిగాను.

* కాంగ్రెస్‌సంస్థ పరిపూర్ణంగా తయారైన, క్రమపద్ధతిని సాగుచున్న సంస్థగా లేదని విన్నాను.

"సత్యం కేవలం మాటలకు, పదాలకు సంబంధించిన విషయం మాత్రమేకాదు. సత్యం ఆచరణ యోగ్యమైన లోకజీవితమార్గం" అంటూ గాంధీజీ కాస్సేపు ఆగారు. బహుశ ఆయన సామాన్య జీవితాన్ని గురించి నేను జ్ఞప్తికి తెచ్చుకోడానికని ఆగారా ? అనుకున్నాను నేను. ఇంతలో గాంధీజీ ప్రారంభించారు—"నాకు సాయపడను పరికరాలు, ఆడంబరాలు యేవీ లేవన్నమాట నిజమే. నా చదువుగూడా అంత గొప్పది కాదు. నేను యెక్కువగా, యిప్పుడు, చదవడమూ లేదు'' అనిమళ్ళీ కాస్సేపు ఆగారు.

"మీరు స్వాతంత్ర్యం కావాలన్నప్పుడు భారతీయులలో అనేక మంది మనస్సులలోని కోర్కెలను వెలిబుచ్చుతున్నారుగదా ! గాయకుడు ప్రేక్షకులను మోహితుల చేస్తున్నాడు. అదేవిధంగా మీరుగూడా భారతీయులు వినాలని యెదురుచూస్తున్న భావాలనే వినిపిస్తున్నారు వారికి. ప్రజలు అనేకమార్లువిని, సంతోషించి, యిష్టపడిన పాటనే యెక్కువగా ఆనందిస్తారు. ఉపన్యాసకుని ధోరణిలోని తమ భావాలనే సభ్యులు ఆమోదిస్తారు. మీరు మీ ప్రజల అభీష్టాల ననుసరించి వారు కోరినరీతిని నడుచుకుంటారనుకుంటాను !'' అన్నాను.

"కావచ్చు. నా పఋకుబడికి కారణం అదే కావచ్చు. మొదట బ్రిటిష్ వారిపట్ల నేనెంతో ప్రభుభక్తి కలిగియున్నవాణ్ణి. పిదప తిరుగుబాటు దారుణ్ణి అయ్యాను. 1896 వరకు నేను ప్రభుభక్తుణ్ణిగా నున్నాను" అన్నారు గాంధీజీ.

"మీరు 1914-18 లలో గూడా ప్రభుభక్తి పరాయణులేగదా ?" అని ప్రశ్నించాను.

" ఒక విధంగా అప్పుడు ప్రభుభక్తికలవాణ్ణే. కాని పూర్తిగాగాదు. 1918 కే భారతదేశంలో బ్రిటిష్ పరిపాలన, పర పరిపాలన గనుక, అంత మొందాలె నన్నాను" అన్నారు గాంధీజీ. మేము నడుస్తూనే వున్నాం. కాస్సేపు గాంధీజీ మాట్లాడలేదు.

"బ్రిటిష్‌వారు వెళ్ళిపోవాలన్న తీర్మానానికి నేను రావడం యెలా జరిగిందీ చెప్తాను. ఇది 1916 లో జరిగిన సంఘటన. నేను కాంగ్రెస్‌కు గాను, ఆ రోజుల్లో, లక్నోలో పాటుబడుతూ వున్నాను. ఒక రైతు నా వద్దకు వచ్చాడు. అతను, మా దేశంలోని యితర రైతులందరివలెనే నిరుపేద. కృశించిన శరీరం. అతను "నా పేరు రాజకుమార్ శుక్ల. నేను చంపరానానుంచి వచ్చాను. మీరు మా జిల్లాకు రావాలని నా కోరిక" అన్నాడు. చంపరానా లక్నోకు కొన్నివందలమైళ్ళ దూరంలోనుంది. అతను తనతోటి రైతుల దుస్థితిని నాకు వర్ణించాడు. చంపరానాకు తనతో రమ్మని ప్రాధేయపడ్డాడు. అతని పట్టుదల, దైన్యతచూచి, వస్తానని నేను మాట యిచ్చాను. నేను ఫలానా రోజున వస్తానని నిశ్చయించుమన్నా డతను. నేను ఫలానారోజని నిశ్చయించలేక పోయాను. కొన్ని వారాల పాటు అతను నన్ను, నీడలాగ, వెంటనంటాడు. నేను యెక్కడికి వెళ్ళితే అక్కడికి వచ్చేవాడు. నేను యెక్కడ ఆగితే అతనూ అక్కడే ఆగేవాడు. ఆఖరుకు 1917 ఆరంభంలో నేను యేదోపనిమీద కలకత్తాకు వెళ్ళవలసి వచ్చింది. రాజకుమార్ కలకత్తాకు వచ్చాడు. అతని బలవంతంమీద కలకత్తానుంచి అతనితో చంపరానాకు వెళ్ళాను.

"నీలిమందు పైరుచేసే జిల్లాలలో చంపరానా వొకటి. అచ్చట వేనవేల రైతులతో మాట్లాడదలచుకున్నాను. ప్రతికక్షి దృష్టిని గ్రహించ డానికి ఆ ప్రాంతపు బ్రిటిష్ కమీషనరుగారితో గూడా సంప్రదించ తీర్మా నించుకున్నాను. నేను బ్రిటిష్ కమీషనరుగారిని దర్శించినప్పుడు, ఆయన నన్ను ఆదరించి, బెదరించి, తక్షణం చంపరానా జిల్లావదలి వెళ్ళమని సలహానిచ్చాడు. నేను ఆయన సలహా నంగీకరించలేదు. ఏనుగుమీదెక్కి వొకగ్రామానికి వెళ్ళాను. నా కంటే ముందుగా వొక పోలీసు బంట్రోతు ఆ గ్రామం చేరాడు. చంపరానా జిల్లాను వదలి వెళ్ళవలసిందిగా నాకు నోటీసు జారీచేశాడు. ఆ గ్రామంలో నేను బసవున్న ఇంటిదాకా పోలీసు వానిని నాకూడా రానిచ్చాను. నా బసకువచ్చి సత్యాగ్రహాన్ని ప్రారంభించ

తీర్మానించుకున్నాను. ఆ జిల్లాను వదలి వెళ్ళనన్నాను. నా చుట్టూ జనంచేరారు. ఈ జన సమూహాన్ని సద్దడంలో పోలీసు వారికి నేను సాయపడ్డాను. పోలీసువారికీ—నాకూ వొకవిధమైన స్నేహం యేర్పడింది.

నా జీవితంలో ఆరోజొక గొప్ప రోజుగా పరిణమించింది. నేరస్థుడుగా నన్ను విచారణకు తీసుకొని వెళ్ళారు. విచారణ ప్రారంభమైంది. ప్రభుత్వం తరపు ప్లీడరు విచారణ వాయిదా వేయుమని మేజస్ట్రీటుగారిని కోరాడు. కాని, విచారణ సాగించుమని నేను కోరాను. చంపరాన్ను వదలి వెళ్ళుమన్న ఉత్తరవును వుల్లంఘించానని బహిరంగంగా ప్రకటించవలెనని అనుకున్నాను. అచ్చటి సాంఘిక పరిస్థితులను గురించిన భోగట్టాను సమకూర్చడానికి వచ్చానని, అందువలన బ్రిటిష్ అధికారాన్ని ఉల్లంఘించ వలసివచ్చిందని చెప్పాను. బ్రిటిష్ అధికారానికి మించిన అధికారానికి—నా అంతరాత్మకు—అణగి ప్రవర్తిస్తున్నానని గూడా చెప్పాను. ఇదే బ్రిటిష్‌వారి నెదిరించి నేను చేసిన ప్రప్రథమ శాసనోల్లంఘనము. మాదేశంలో యెచ్చోటికి గాని,శాంతియుత కార్యక్రమాన్ని సాగించను వెళ్ళినప్పుడు, నన్ను అచ్చోటనుంచి వెళ్ళిపొమ్మనడానికి యే ఆంగ్లేయునకు అధికారం లేదన్న సిద్ధాంతాన్ని స్థాపించాలని నా కోరిక. 'నేను నేరస్థుడ్నే—దండించండి' అన్న నా వాదనను మానుమని ప్రభుత్వం పలుమార్లు నన్ను ప్రార్థించింది. ఆఖరుకు మేజస్ట్రీట్‌గారు వ్యాజ్యాన్ని త్రోసివేశారు. శాసనోల్లంఘనం జయంపొందింది. భారత దేశాన్ని బానిసత్వం నుండి విడిపించడానికి శాసనోల్లంఘనమే మార్గమైంది" అన్నాడు గాంధీజీ.

"ఇండియాలో మీ పలుకుబడికి యిదొక కారణమనుకుంటాను" అన్నాను.

"నేను చేసింది సర్వసామాన్యమైన పని. నాదేశంలో నేను యెచ్చటికి వెళ్ళడం ? యెచ్చటికి వెళ్ళక పోవడం ? అని బ్రిటిష్‌వారు నన్నాజ్ఞాపించలేరని ప్రకటించాను" అన్నారు గాంధీజీ.

"సామాన్య విషయమే. కాని అలా ప్రకటించడానికి మీరే ప్రప్రథములు. ఈ విషయం, కొలంబస్—కోడిగుడ్డు కథ వంటిది" అని నా వ్యాఖ్యానాన్ని నుడివాను.

"ఏమిటా కథ ?" అని గాంధీజీ ప్రశ్నించారు.

" 'కొలంబస్—కోడిగుడ్డు' కథ మీరెప్పుడు వినలేదా ?" అని ప్రశ్నించాను.

"లేదు. నేనెన్నడు వినలేదు. ఆ కథేమిటో చెప్పండి" అన్నారు గాంధీజీ.

గాంధీజీకి 'కొలంబస్—కోడిగుడ్డు' కథను చెప్పాను. * ఆయన అపరిమితంగా నవ్వారు.

"మీ సామ్యం చక్కగా సరిపోయింది. 'నా దేశంలో శాంతియుతంగా నేనెచ్చటికి వెళ్ళడానికైనా నాకధికారం వుంది' అనడం సామాన్య విషయమే. కాని, నాకు పూర్వం యీ విషయాన్ని చెప్పినవారెవ్వరూ లేరు" అన్నారు గాంధీజీ.

అప్పటికి గాంధిజీ బసకు వచ్చాం.

* * *

మధ్యాహ్నం మూడు గంటలకు యథాప్రకారం గాంధీజీ బసకు వెళ్లాను. అప్పటికి గంటసేపుగా గాంధీజీ నెహ్రూతో మాట్లాడుతూ వున్నారు. పది నిమిషాలు నన్ను వేచియుండుమని ప్రార్థించారు. బయలు

* కొలంబస్ పశ్చిమ ఇండియా దీవులను కనుగొని మాతృదేశానికి మరలి వచ్చాడు. ఒకనాడు కొందరు సభగూడి "పశ్చిమ ఇండియా దీవులను కనుగొనడం గూడా ఘనకార్యమేనా ? ఈపని నెవరు చేయలేరు ?" అని పరిహసించారు. కొలంబస్ వారిని హేళనచేయాలన్న ఉద్దేశంతో "మీలో నెవరైనా కోడుగ్రుడ్డును దాని మొనమీద నిలబెట్టగలరా ?" అని సవాలువేశాడు. ఎందరో ప్రయత్నించి విఫలు లయ్యారు. అంతట కొలంబస్ గ్రుడ్డుమొనను కాస్తపగుల గొట్టి నిలబెట్టారు. అందరూ తెల్లబోయారు.

భూమికి తాను వెళ్ళాలని, అందుచే నేను పది నిమిషాలు వేచియుండాలని అన్నారు. బయలు భూమికి వెళ్ళిరాగానే తన పడకమీద పరున్నారు. ఆయన కార్యదర్శులలో నొకరు అప్పుడు వచ్చిన వుత్తరాన్నొకదాన్ని ఆయన కందించారు. గాంధీజీ ఆ వుత్తరాన్ని తీసుకొని చదువుతూ నవ్వ నారంభించారు. ఆ ఉత్తరంతో పాటు రెండు, మడిచిన, తావు కాగితా లున్నాయి. వాటిలో సంగీతపు స్వరాలు వ్రాయబడి వున్నాయి. గదిలో నున్న కుర్షీద్ వైపు మరలి, నవ్వుతూ "కుర్షీద్! కాస్త యీ సంగీతాన్ని పాడి వినిపించు" అన్నారు గాంధీజీ. ఆమె ఆ వుత్తరంలోని పద్యాలను కొన్నిటిని చదివి, పాటను పాడింది. నేను గాంధీజీ నడిగాను—ఆ ఉత్తరం యేమిటి? సంగీతం యేమిటి? అని. కుర్షీద్ ఆ ఉత్తరాన్ని, ఆపాటను నాకిచ్చింది. వాటిని, నాతోపాటు, అమెరికాకు తెచ్చాను. ఆ ఉత్తరంలో—

అమెరికన్ సంయుక్త రాష్ట్రాలు,
హాలివుడ్,
కాలిఫోర్నియ,
1535 నార్త్ హోబర్ట్ బుల్‌వర్డ్,
మార్చి 10, 1942

అని వున్నది. ఆ ఉత్తరం మీది విలాసం—

మహాత్మా గాంధి,
ఇండియన్ నేషనల్ కాంగ్రెస్,
ఇండియా

అని వున్నది. ఆ ఉత్తరంలో మారిస్ మాన్నిక్ చేవ్రాలున్నది.

నా ప్రియమైన మహాత్మ గాంధీ,

నేను యీ పాటను మీకు ప్రజాస్వామ్య దృష్టితో పంపుతున్నాను. మీరూ ఆ దృష్టితోనే స్వీకరిస్తారని నమ్మకం. నేను చాల కాలంగా మీ అభిమానులలో నొకతెను.

మీ కత్యంత విధేయురాలైన,
మారిస్ మాన్నిక్

అని వున్నదా ఉత్తరంలో. ఆపాటకు "అక్షరాజ్యాల నోడిద్దాం" అన్న శీర్షిక నిచ్చిందామె. ఆపాట జనరల్ డగ్లస్ మాకార్థర్ కు—అతని సైన్యాలకు అంకితం చేయబడినది. ఆ పాటను కుర్షీద్ పాడింది. అచ్చట వున్నవారంతా నవ్వారు.

నవ్వు ఆగిన తర్వాత గాంధీజీ నాకేసి చూసి "ఇక పేల్చండి—మీప్రశ్న గుండ్లను" అన్నారు.

"గుండ్లు పేల్చడం హింసగదా! గాంధీజీ" అన్నాను.

"హింస నుపయోగించడానికి మీకేమైనా అభ్యంతర మున్నదా?" అని ప్రశ్నించారు నన్ను.

"కాని, నేను హింసకు సుముఖుణ్ణనిగాని, విముఖుణ్ణిగాని మీరు నానుంచి వొక్కమాటైనా వినలేదుగా!" అన్నాను.

"మీరు చెప్పవలసిన అవుసరంలేదు. మిమ్ము చూచి నేను అర్థం చేసుకోగలను" అన్నారు గాంధీజీ.

"మీరు ప్రారంభింపనున్న సహాయ నిరాకరణోద్యమం పూర్వంలాగా హింస రూపానికి మారితే ఉద్యమాన్ని ఆపుతారా?" అని ప్రశ్నించాను.

"నా ప్రస్తుత వైఖరిలో ఉద్యమాన్ని ఆపవలసిన పరిస్థితులు కలుగవనను. కాని పూర్వం నేను అతి జాగ్రత్తగా వుండేవాణ్ణి. నేనూ, నా అనుయాయులూ తరిఫీదు పొందడానికి అట్టిజాగ్రత్త అప్పుడు అవసరమైంది. కాని యిప్పుడుగూడా నేను పూర్వంలాగా నడుచుకుంటానా!" అన్నారు గాంధీజీ.

"నేను మీ గ్రామంనుంచి త్వరలో వెళ్ళిపోనున్నాను. గనుక మీ భావాలను చక్కగా అర్థంచేసుకున్నట్లు రూఢి పరుచుకో దలచుకున్నాను. మీరు కోరేదానికీ, బ్రిటిష్‌వారు యివ్వను సిద్ధపడేదానికి మధ్య రాజీ కుదరడాని కేమైనా అవకాశముందా? క్రిప్స్ సూచనలను యేదోవిధంగా మార్పుచేస్తే మీ రంగీకరిస్తారా?" అని నా సంభాషణను ప్రారంభించాను.

"క్రిప్స్ సూచనల వైఖరిని దేనినిగానీ నే నంగీకరింపజాలను. క్రిప్స్ సూచనలను పూర్తిగా, మరల చూపడానికి వీలులేకుండా, బ్రిటిష్

వారు వుపసంహరించుకోవాలని నా కోర్కె. నేను పూర్తిగా సరియైన మార్గాన నున్నానని నాకే రూఢి వుండదు గనుక నేను, ప్రధానంగా, రాజీ పడే దృష్టిగలవాణ్ణి. ఇప్పుడు రాజీకి యెడమివ్వను. మున్ముందు జరగ వలసిన విషయాలే నాకు ప్రధానంగా కనిపిస్తూన్నవి. బ్రిటిష్‌వారు యీ దేశం వదలివెళ్ళడం—వెళ్ళకపోవడం అన్నసమస్య మధ్యస్థానికి వొప్పుకోను. బ్రిటిష్‌వారు—వ్యక్తిగతంగా మాదేశం వదలి వెళ్ళాలనికాదు. రాజకీయ అధికారం పూర్తిగా బ్రిటిష్‌వారి చేతులనుండి భారతీయుల హస్తగతం కావాలనిమాత్రం పట్టు పట్టుచున్నాను" అన్నారు గాంధీజీ.

"సరే! కాలపరిమితి విషయం? మీరు సహాయ నిరాకరణో ద్యమాన్ని ప్రారంభించిన వెంటనే బ్రిటిష్‌వారు లొంగిన, వెనువెంటనే రాజకీయ అధికారాన్ని భారతీయుల చేతుల్లోనుంచాలా?" అని అడిగాను.

"బ్రిటిష్‌వారు రెండు రోజుల్లోగాని, రెండు వారాల్లోగాని అధికారాన్ని భారతీయుల హస్తగతం చేయనక్కరలేదు. కాని బ్రిటిష్ అధికారం సంపూర్ణంగా వుపసంహరింపబడాలి" అన్నారు గాంధీజీ.

"యుద్ధానంతరం పూర్తిగా మా అధికారాన్ని వదలుకుంటాం, యిప్పుడుగాదు—అని బ్రిటిష్‌వారు అంటే?" అని ప్రశ్నించాను.

"అలా అనడానికి వీలులేదు. అలాగైతే నా ప్రతిపాదన విలువ చాల తగ్గిపోతుంది. నేను చైనాకు, రష్యాకు సహాయం చేయగలగడాని కోసం బ్రిటిష్‌వారిని యిప్పుడే వెళ్ళమని కోరుతున్నాను. ఈవేళ బ్రిటిష్ పరిపాలన మా చేతులను బంధించి యుంచినందున, చైనా, రష్యాలకు మేము పూర్తిగా సాయపడ లేకున్నాం. బ్రిటిష్‌వారు మా దేశంనుంచి వెళ్ళిపోవాలన్న నా వుపపాదనకు కారణం నా పరోపకార దృష్టియే. ప్రస్తుతానికి ఇండియాను నాదృష్టిలో నుంచుకొనక మాట్లాడుతూన్నాను. మాకు స్వాతంత్ర్యం కావాలనడం కేవలం మా కోసమే కాదు. కూపస్థ మండూకంలాగా ప్రవర్తించాలని నా కోర్కెగాదు" అన్నారు గాంధీజీ.

"మీ కింతకుపూర్వం యీ భావం లేదనుకుంటాను" అన్నాను.

"ఈ భావం క్రమేణా నాలో యేర్పడుతూవుంది. 'బ్రిటిష్‌వారిని వెళ్ళమనాలి' అన్నభావం నాలో అకస్మాత్తుగా కల్గింది. క్రిప్స్‌రాయబార విఫలతవల్ల నాకాభావం కలిగింది. క్రిప్స్ ఇండియావదలి వెళ్ళాడో లేదో, బ్రిటిష్‌వారు భారతదేశం వదలి వెళ్ళాలన్నభావం నాలో దృఢపడింది" అన్నారు గాంధీజీ.

"ఈ భావం మీకు యెప్పుడు కలిగిందీ రూఢిగా చెప్పగలరా?" అని ప్రశ్నించాను.

"క్రిప్స్ వెళ్ళగానే నాకీయోచన తట్టింది. భారతదేశానికి మిత్రుడైన ఒక ఆంగ్లేయునకు* ఉత్తరం వ్రాశాను. వెంటనే యీభావం నన్నావేశించింది. నాభావాన్ని ప్రచారంచేయ మొదలెట్టాను. తర్వాత నేనొక తీర్మానాన్ని ఉపపాదించాను. క్రిప్స్ విఫలతకు తగిన జవాబును యివ్వాలన్నదే నా మొదటి వుద్దేశం. క్రిప్స్ రాయబారానికి (విఫలమైన తర్వాత) తగిన ప్రతీకారం లేకుంటే యెంత అయోమయంగా నుంటుంది? అని తలచాను. బ్రిటిష్‌వారు మా దేశంనుంచి వెళ్ళిపోవాలని కోరాలనుకున్నాను. ఈ ఉద్దేశం నాకు కలగడానికి కారణం క్రిప్స్ రాయబారం రాకవల్ల మాలో కల్గిన ఆశయే. జవహర్‌లాల్ మొదలైనవారు క్రిప్స్‌ను గురించి మాతో చాల గొప్పగా చెప్పారు. అందువల్ల మేమూ కొంత ఆశపెట్టుకున్నాం. కాని క్రిప్స్ రాయబారం విఫలమైంది. అట్టిపరిస్థితిని యెలా చక్కబెట్టడం? అని నన్ను నేను ప్రశ్నించుకున్నాను.

"మా దేశంలోని బ్రిటిష్ అధికారం మాకు గొప్ప ఆటంకమని నాకు తోచింది. ఒక సోమవారంనాడు మౌనవ్రతంలో నుండగా నాలో యీ భావం కలిగింది. మౌనవ్రతం కారణంగా యెన్నో భావాలు నాలో పెంపొందినవి. ఆ మౌనం కారణంగా, ఆ భావాలు కారణంగా, చైనా కోసం, రష్యాకోసం, ఇండియాకోసం నేను కార్యదీక్ష పూనక వీల్లేదని తోచింది. నా హృదయం చైనాకు సాయంచేయాలని పరితపిస్తూంది.

---

* హోరెస్ అలెగ్జాండర్

ఛెయాంగ్‌కై షేక్, అతని సతీమణితో గడపిన ఐదుఘంటలకాలం— మరచిపోలేకున్నాను. కేవలం చైనాకోసమైనా నేను బ్రిటిష్‌వారిని ఇండియానుంచి పైదొలగమనాలి. నా భావాలను యీవిధంగా ప్రపంచం యొక్క దుఃఖాలతో ముంచివేసాను" అన్నారు గాంధీజీ.

"యుద్ధానంతరం వరకు మీ ఉద్యమాన్ని ఆపరాదా ?" అని ప్రశ్నించాను.

"నేను చేయగలిగిందేమిటో యిప్పుడే చేయాలనీ, యుద్ధం ముగియకముందే సహాయం చేయాలని నా వుద్దేశం" అని గాంధీజీ బదులు చెప్పారు.

"ఈ పోరాటాన్ని సాగించడానికి మీకేదైనా సంస్థవున్నదా?" అని ప్రశ్నించాను.

"ఆ సంస్థ కాంగ్రెస్ సంస్థయే. కాని కాంగ్రెస్ నాకు సాయపడక పోతే నా సొంతసంస్థ నాకున్నది. ఆసంస్థ నేనే. నన్నొకభావం ఆవేశించింది. నావంటివాడు యేసంస్థ దొరకకపోతే తానే ఒక సంస్థ అవుతాడు" అన్నారు గాంధీజీ.

"మీ దేశంయొక్క ప్రస్తుతపు మనోవైకల్యంలో మీకు నమ్మకముందా ? దేశం మిమ్ముల ననుసరిస్తుందా ? ఈ సహాయ నిరాకరణోద్యమం అపరిమిత త్యాగాన్ని ప్రజలనుంచి కోరుతూంది. మీ వుద్దేశాన్ని యెవరైనా కాదన్నారా ?" అని ప్రశ్నించాను.

"ఈవేళ రాజగోపాలాచారిగారినుండి నాకు ఉత్తరం వచ్చింది. అత డొక్కడే నా వుద్యమానికి విముఖుడుగా నున్నాడు. ఆయన భావాలను నే నెరుగుదును. ముస్లింలీగ్ సహాయంతో పాకిస్థాన్‌ను రూపుమాపాలని ప్రయత్నిస్తుంటే, ముస్లింలీగ్ తనతో కలసి పనిచేస్తుందని యెలా అనుకుంటాడు ?" అన్నాడు గాంధీజీ.

"జిన్నాగారు పాకిస్థాన్ పట్టు పదలరనుకుంటారా ? పాకిస్థాన్ వాదనను జిన్నాగారు వీలైనంతవరకు, తమకు లాభదాయకమైన షర

తులను గుంజుకోడానికే ఎరగా వుపయోగిస్తున్నా రనుకుంటాను. హిందూ-ముస్లిం సహకారం కుదరగానే తన పాకిస్థాన్‌వాదనను జిన్నాగారు వదలుకుంటా రనుకుంటాను" అన్నాను.

"బ్రిటిష్‌వారు మాదేశం వదలివెళ్ళగానే జిన్నాగారు తమ పాకిస్థాన్ వాదనను మానుకుంటారు. ఈ విషయం నే నిదివరకే మీకు చెప్పియున్నాను. బ్రిటిష్‌వారితో యిప్పుడు జిన్నాగారు బేరంపెట్టుతూవున్నారు. అప్పుడు బేరం చేయడానికి యెవ్వరూ వుండరు గనుక పాకిస్థాన్‌వాదనను మానేయక తప్పదు" అన్నారు గాంధీజీ.

"మీ వుద్యమాన్ని యెప్పుడు ప్రారంభించేది ముందుగా బ్రిటిష్ వారికి చెప్పదలచుకున్నారా ?" అని అడిగాను.

"అవును" అని ధృవపరిచారు గాంధీజీ.

"చాల ముందుగా చెప్పకండేం" అని నవ్వాను.

"ఇది మీరు నా కిస్తున్న రహస్య సలహా ?" అని నవ్వాయి గాంధీజీ.

"కాదు" అని బదులు చెప్పాను.

"ముందుగానే ప్రభుత్వానికి తెలియజేస్తాను" అన్నారు గాంధీజీ.

"మీరు యీక్విట్ ఇండియా ఉద్యమాన్ని చరిత్రాత్మక దృష్టితో చూస్తే వొక కొత్తవిషయాన్ని, వొక గొప్పవిషయాన్ని చేస్తున్నట్లు గ్రహించగలరు. మీరొకసామ్రాజ్యంయొక్క అంత్యాన్ని సూచిస్తూన్నారు" అన్నాను.

"ఆపని పసిబిడ్డగూడా చేయగలదు. నేను ప్రజల ప్రవృత్తిని రేకెత్తించవచ్చు" నన్నారు గాంధీజీ.

"మీరు ఉద్యమం ప్రారంభిస్తే ప్రపంచం యేవిధంగా మీ వుద్యమాన్ని గ్రహిస్తుందో ఆలోచిద్దాం. మీ మిత్రులే—చైనా, రష్యాలు—ఈ సహాయ నిరాకరణోద్యమాన్ని ప్రారంభింప వద్దని మిమ్మ కోరవచ్చు" నన్నాను.

"వారు నన్ను కోరనివ్వండి. నేను అప్పుడు వుద్యమాన్ని మానవచ్చు. కాని నేను సకాలంలో వారికి నా కోర్కెలను తెలియజేసిన, నా దృక్పథానికే వారిని మార్చగలుగుతాను. ఈ దేశంలో, అధికార వర్గం లోని వ్యక్తులు మీ అందుబాట్లో నుంటే యీ విషయం వారికి చెప్పండి. ఇతరుల మాటలు వినడంలో—యితరుల మనోభావాలను గ్రహించడంలో నా కెంతో వోపికవున్నది. మీలో మోసమేమీలేదు. నా భావాలను అధికార వర్గంలో మీ యెరుకలోనున్న వారితో చర్చించండి. నా ఉపపాదనలో యేమైన లోటుబాట్లుంటే చూపమనండి" అన్నారు గాంధీజీ.

"నేను యీ విషయాన్ని వైస్రాయితో చెప్పడానికి మీరంగీకరిస్తారా ?" అన్నాను.

"తప్పకుండాను! అందుకు నా అనుమతి నిస్తున్నాను" అన్నారు గాంధీజీ.

"వైస్రాయిగారు నాతో మాట్లాడ నివ్వండి. నన్ను ఆయన మార్చవచ్చు. నేను అన్యాయస్థుణ్ణికానుగా! చైనాకు కీడుగూర్చే పెట్టి చర్యను నేను చేయను" అన్నారు గాంధీజీ.

"లేక అమెరికాకు కీడుచేసే చర్యనుగాని" అన్నాను నేను.

"అమెరికా కినుకజెందితే ప్రతి ఒక్కరు కినుక జెందినట్లే" నన్నారు గాంధీజీ.

మీ దృక్పథాన్ని అమెరికా అధ్యక్షుడు రూజ్‌వెల్ట్‌కు తెలుపుమన్నారా ?" అని ప్రశ్నించాను.

"ఆహా !.........ఎవరినీ ప్రార్థించడం నా కిష్టంలేదు కాని నా నిర్ణయం, నా భావాలు, రాజీపడడానికి నేను సిద్ధంగా నున్నానన్నమాట రూజ్‌వెల్ట్‌గారికి తెలియాలని నా కోరిక. నా ప్రయత్నంనుంచి నన్ను యెవరైనా మాన్పింపాలని నా కోరిక. ఈవిషయం మీ అధ్యక్షునితో చెప్పండి" అన్నారు గాంధీజీ.

"మీరు ఉద్యమం ప్రారంభించగానే ప్రభుత్వం నిరంకుశ చర్య

తీసుకుంటుం దనుకుంటారా?" అని ప్రశ్నించాను.

"అవును. అట్టి చర్య యేరోజునైనా తీసుకో బడుతుం దనుకుంటాను. అందుకు సంసిద్ధంగానున్నాను. నన్ను యేక్షణమైనా ప్రభుత్వం బంధించవచ్చునని నేనెరుగుదును. అందుకు సిద్ధంగా నున్నాను" అన్నారు గాంధీజీ.

---

జూన్ 9, 1942.

ఈ మధ్యాహ్నం గాంధీగారి కార్యదర్శి మహదేవ్‌దేశాయ్ నన్ను చూడవచ్చారు. నాకివ్వను గాంధీగారి 'ఆత్మ కథ' ఒక కాపీతెచ్చారు. గాంధీజీ, దేశాయిగారితో నేను సేవాగ్రామం వదలి వెళ్ళిన తర్వాత చేయ తగ్గ విషయాల గురించి చర్చించారట. ఆ విషయం దేశాయిగారు చెప్పారు. నాకూ, గాంధీజీకి జరిగిన సంభాషణలను, వేటినిగాని, రూజ్ వెల్ట్, వైస్రాయిగార్లకు తెలియజేయడానికి యెలాంటి అభ్యంతరం లేద న్నారు దేశాయిగారు. గాంధీజీ గూడా యిందుకు సమ్మతించారట. తన నూతనోద్యమాన్ని గురించి గాంధీజీ వైస్రాయితో చర్చింప నభిలషిస్తు న్నారని దేశాయిగారు స్పష్టబరిచారు.

* * * *

ఈ వేళ భోంచేసేప్పుడు గాంధీజీ యిలాన్నారు—"మీరు సేవా గ్రామంనుండి వెళ్ళిన తర్వాత రెండు పరిస్థితులు కలుగుతవి—ఆమె రక్ష ణలో యెవ్వరూ వుండరు గనుక మీరు వెళ్ళారని కుర్షిద్ బెన్ విచారి స్తుంది. ప్రతి మధ్యాహ్నం మీకని నిర్ణయించిన గంటసేపులో మీరు లేరని నేనూ విచారిస్తాను."

నేను సేవాగ్రామంలో చాలకాల ముండడం నా కిష్టమని, కాంగ్రెస్ కార్య నిర్వాహకసభ గాంధీగారి సహాయ నిరాకర ణోద్యమ ప్రారంభ విషయమై చర్చించడానికి వార్ధాలో సమావేశ మైనప్పుడు, బహుశ, తిరిగి వస్తానని గాంధీజీతో అన్నాను.

"కాంగ్రెస్ కార్యనిర్వాహకసభ యింకో పక్షంలో సమావేశమా తుంది. మీ కిష్టమొచ్చినప్పుడు తిరిగి రండి" అన్నారు గాంధీజీ.

"మీరు సేవాగ్రామంలో సుఖంగా నిద్రపోయారా?" అని గాంధీజీ ప్రశ్నించారు. చాల సుఖంగా నిద్రపోయానని, కొన్ని సంవత్సరాలుగా యింతటి సుఖనిద్ర నెరుగనని బదులు చెప్పాను.

"నక్షత్రాలకింద నిదురించడం (ఆరుబైట పరుండడం) చాల మంచిది—ఉత్తమోత్తమమైన విషయ మనుకుంటాను. కాని రష్యాలో ఆరుబైట పడుకోడం అసాధ్య మనుకుంటాను" అన్నారు గాంధీజీ.

"రష్యాలో కొన్నిచోట్ల అపరిమిత వేడిగా వుంటుంది" అన్నాను.

"అలాగా! రష్యాలో అంతటా, ఎల్లప్పుడూ, చలిగా వుంటుం దనుకున్నాను నేను" అన్నారు గాంధీజీ.

నేనూ, నెహ్రూగారూ, కుర్షీద్ అతిథిగృహంలో కూర్చొనున్నాం. వారిద్దరూ అనేకమార్లు ఖైదులో నున్నవారు. ఖైదులో జీవితం యెలా వుంటుందని వారిని అడిగాను. ముఖ్యమైన దేశనాయకులు ఖైదులో మంచి వసతుల బొందుతారని, ఖైదులో యెప్పుడుగాని, గాంధీజీని అతిగౌరవంగా చూస్తారని, గాంధీజీ ఖైదులో నున్నప్పుడల్లా ఆయన కోరిన ఆహారాన్ని ప్రభుత్వం సరఫరా చేస్తుందని వారు చెప్పారు. గాంధీజీ ఖైదులో నున్నప్పుడు వారికి బయటనుంచి వచ్చే ఉత్తరాలతోగాని, వారి ప్రత్యుత్త రాలతోగాని ప్రభుత్వం యేవిధంగానూ కలుగ జేసుకోదని గూడా వారు చెప్పారు. ఇతర కాంగ్రెస్ నాయకులు ఖైదులో నుండగా బైటివారితో ఉత్తర ప్రత్యుత్తరాలు సాగించడానికి వీలులేదని వారన్నారు.

"ఖైదులో నున్న కాంగ్రెస్ సభ్యులు తప్పించుకు పోవడానికి యెన్నడు ప్రయత్నించరు. కాంగ్రెస్ సభ్యులు సహాయ నిరాకరణాన్ని బహిరంగంగా అభ్యసించడంవల్లనూ, తమంతటతాము ఖైదుకువెళ్ళ సిద్ధ పడినవారు గనుకనూ వారు తప్పించుకుపోవ ప్రయత్నించరు. బ్రిటిష్ పరిపాలనను గాంధీజీ ధిఃకరించి, సాగిస్తూన్న ఉద్యమాల్లో వేనిలోను రహస్యంగాని, గుప్తంగాని లేదు. ప్రభుత్వాన్ని ధిఃకరించబోతున్నదని, కాంగ్రెస్, ప్రభుత్వానికి ముందుగా తెలియజేసి, పిదప తన తిరుగుబాటును ప్రారంభిస్తుంది. కాంగ్రెస్ ఖైదీ యొకడు ఖైదునుంచి పారిపోయినా, మరల సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొని ఖైదుకు వెళ్ళడానికే పారి పోతాడు" అన్నారు—వారిరువురూనూ.

రానున్న ఉద్యమాన్నిగురించి నెహ్రూ గాంధీజీతో యేకీభవించారు. మొదట గాంధీజీని అనుసరించడానికి సంకోచించారు. అందుకు కారణం అధ్యక్షుడు రూజ్‌వెల్ట్‌గాని, లేక ఛెయాంగ్ కై షేక్‌గాని భారత పరిస్థితితో జోక్యం కలుగజేసుకుంటారనీ, ఆంగ్ల-భారతీయ ప్రతిష్టంబనను తొలగిస్తారని, బ్రిటిష్ అధికారానికి భారతీయులు తిరుగబడ వలసిన అవసరంలేకుండా చేస్తారని ఆశపడ్డారు. ప్రజాస్వామ్య దేశాల్లోని ఉన్నతోద్యోగులు పలువురకు, చాలకాలం ముందే నెహ్రూ అక్షరాజ్యాల వ్యతిరేకిగానున్నవారు. ప్రజాస్వామ్య ప్రభుత్వాలు మ్యూనిక్ సంధివరకు సాగించిన 'సంతృప్తి పరచు విధానము'ను నెహ్రూ యెన్నడో ఆక్షేపించారు. చాల కాలంగా నెహ్రూ జపాన్‌కు, ముసోలీనీకి, హిట్లరుకు వ్యతిరేకి అని రుజువు చేయడానికి అనేక నిదర్శనా లున్నాయి. బ్రిటిష్‌వారు అక్షరాజ్యాల మీద సాగిస్తూన్న యుద్ధంలో బ్రిటిష్‌వారిని కలవరపెట్టడం నెహ్రూగారికి యిష్టంలేదు. కాని, దూరప్రాచ్యంలో బ్రిటిష్‌వారు పొందిన పరాజయాలు, అవమానాలు వారికి ఇండియాలోగూడ సంభవించకుండ చేయవలెనన్న, 'ఒత్తిడిచేనైనా బ్రిటిష్‌వారు కొన్ని,సక్రమ,చర్యలను తీసుకునేట్లు చేయాలి' అని నెహ్రూగారు నమ్మారు. బ్రిటిష్‌వారు, వారికున్న సైనిక శక్తితో భారతదేశాన్ని రక్షించలేరని నెహ్రూగారి నమ్మకం. అందువలన భారత దేశరక్షణకు భారతీయులు తోడ్పడేట్లు బ్రిటిష్‌వారు కొన్నిచర్యల తీసుకొనవలెననీ, అందుకు తగిన తెలివితేటలు బ్రిటిష్‌వారికుండాలని నెహ్రూగారు అంటారు.

---

జూన్ 10, 1942.

నేను సేవాగ్రామంలో సుండడానికి యిదే ఆఖరురోజు. ప్రొద్దున ఐదుఘంటలకే లేచాను. నేను లేచేప్పటికే నెహ్రూగారు పడకపై లేరు. గాంధీజీతో మాట్లాడడానికి వెళ్ళారు. నెహ్రూగారు యేడుగంటలకు తిరిగి వచ్చారు. తానూ, కాంగ్రెస్ అధ్యక్షుడు అజాద్‌గారూ నేడే వార్ధాకు వెళ్ళు తూన్నారనీ, తర్వాత వారితో ప్రత్యేక సంప్రదింపులకోసం గాంధీజీగూడ వార్ధాకు వెళ్ళుతారనీ నెహ్రూగా రన్నారు. సేవాగ్రామంనుంచి నెహ్రూ, అజాద్‌గార్లతో కారులో వార్ధాకు వెళ్ళడానికి యేర్పాటుచేసుకున్నాను. వార్ధానుంచి హైదరాబాదుకు (దక్కన్) రైల్లోవెళ్ళే యేర్పాట్లుగూడా పూర్తిచేశాను. ఆశ్రమ వాసులు నాకు వీడోల్కులుతెలుపను రామొదలెట్టారు. మహదేవ్‌దేశాయిగారుగూడా వచ్చారు. ఆయన నన్ను అవతలికి పిలిచి గాంధీజీని ప్రభుత్వం అరెస్టుచేసే సూచనలున్నాయని చెప్పారు. జూన్ 17 వ తారీకున గాంధీజీని ప్రభుత్వం అరెస్ట్ చేయనున్నదని వదంతు లున్నాయన్నారు. నేను నా సందేహాన్ని వెలిబుచ్చాను. కాంగ్రెస్‌సంస్థ సహాయ నిరాకర ణోద్యమాన్ని ప్రారంభించను తీర్మానించేవరకు బ్రిటిష్ ప్రభుత్వం వేచియుంటుందన్నాను. గాంధీజీ వైస్రాయిని చూడవలెనని వున్నారు గనుక వైస్రాయిగారితో గాంధీజీకి బేటీ నేను కుదర్చవలెననీ, కాని నేను వెంటనే ఢిల్లీకి వెళ్ళకపోవడం విచారకరమైన విషయమనీ దేశాయిగారు అన్నారు.

మిట్టమధ్యాహ్నమప్పుడు—ఉష్ణోగ్రత సుమారు 110 డిగ్రీ లుంటుంది—అజాద్‌గారూ, నెహ్రూగారూ, నేనూ కారులో వార్ధాకు బయలుదేరాం. రస్తాపొడుగునా దుమ్ము రేగుతునే వున్నది. అతివేడిమిగా వున్నదికూడాను. వార్ధాలోని కాంగ్రెస్ వసతిగృహాన్ని చేరాం. సేవా గ్రామంనుంచి వార్ధాకు ఐదుమైళ్ళు దూరం. అజాద్‌గారు కాస్తలావు

మనిషి. దృఢకాయుడు. పెద్దతల—కొద్దిపాటి (మేకకున్నట్లు) గడ్డం, తెల్లబారిన వెంట్రుకలు, కురుచక్రాపు, ఘట్టివాగ్ధాటి గలవారు. భారతీయులనేకులకన్న అజాద్ తెల్లగా నుంటారు. నాలుగు వందల ఏండ్లక్రితం ఆయన కుటుంబీకులు అరేబియా నుంచి వచ్చారు. ఇండియాలోని ప్రఖ్యాత మహమ్మదీయులలో ఆయన ఒకరు. ఖురాన్‌ను ఉర్దూభాషలోనికి అనువదించారు. అరబిక్ వాఙ్మయంలో, ఇస్లాంచరిత్రలో ప్రపంచం మెచ్చుకున్న మహాపండితుడాయన. ప్రతి ఒక్కరు ఆయనను "మౌలానా" అని పిలుస్తారు. ఆపదాని కర్థం ముస్లిం పండితుడని—మత గురువని.



అజాద్

మేము ముప్వారం వార్ధాలోని వసతిగృహమందలి ఒక గదిలో భోంచేశాం. ఆగదిలో చల్లగా నున్నది. గడచిన యెనిమిది రోజులలో ఎలక్ట్రిక్‌పంకావల్ల వీచినగాలిని ఆనందించడానికి యిదే మొదటి పర్యాయం. భోజనానంతరం అజాద్‌గారితో సంప్రదించాను. నెహ్రూగారు మాయిద్దరిమధ్య ద్విభాషిగా వర్తించారు. అజాద్‌గారు అంగ్ల● బాగా అర్థంచేసుకుంటారు. కాని ఆంగ్లంలో మాట్లాడడానికి సంకోచిస్తారు. అందువలన నాప్రశ్నలను నెహ్రూగారు అనువదించలేదు. ఆయన జవాబులను మాత్రమే అనువదించారు. అజాద్‌గారే కాంగ్రెస్‌తరఫున

రాయబారాలను చాలవరకు క్రిప్స్‌గారితో జరిపినవారు.

"క్రిప్స్ మాకు గొప్ప ఆశాభంగాన్ని కల్గించారు. క్రిప్స్ ఇండియాకు మిత్రుడని అనుకున్నాం. ఇండియాలో తప్పకుండా జాతీయ ప్రభుత్వం యేర్పడుతుందనీ, మంత్రివర్గం బాధ్యతాయుతంగా నుంటుందనీ, ప్రభుత్వపు దినచర్యలలో వైస్రాయి యేవిధమైన జోక్యం పుచ్చుకోకుండా—ఇంగ్లండు రాజులాగా — గౌరవార్థం మాత్రమే వుంటాడని క్రిప్స్ నాతో చెప్పారు. ఆయన మాటలను నమ్మి ఆయనతో సంప్రదింపుల సాగించాం. బ్రిటిష్ సర్వ సేనాధ్యక్షునికి, భారతీయ రక్షణ శాఖమంత్రికి యేయే అధికారాలు, యెలా పంచదమన్న నిర్ణయానికి, యించుమించు, వచ్చాం. అప్పుడు, హఠాత్తుగా ఏప్రిల్ 9, 1942 న, వైస్రాయిగారి



క్రిప్స్

'వీటో' అధికారాన్ని రూపుమాపను బ్రిటిష్ ప్రభుత్వం నిరాకరించిందని క్రిప్స్ చెప్పారు. అంతటితో మా సంప్రదింపులు ముగిశాయి. క్రిప్స్ మాకు మాటయిచ్చారు. కాని తన మాటను అతను నిలుపుకోకుండా చేశారు లండన్‌లోని అధికారులు. బ్రిటన్—ఇండియాల మధ్య రాజీ కుదరవలెనంటే భారతీయ తాత్కాలిక మంత్రివర్గం (అన్ని పార్టీలు కలసిన ఐక్య, మిశ్రమ మంత్రివర్గం) యేర్పడాలి. ఈ మంత్రివర్గంలో బహు సంఖ్యాకులు కాంగ్రెస్‌వారుగా నుంటారని మా అంచనా గాదు" అన్నారు అజాద్‌గారు.

"క్రిప్స్ రాయబారం విఫలమైన తర్వాత భారతీయ ప్రజాహృదయం యెలా వుంది ?" అని ప్రశ్నించాను.

"కొంతవరకు భారతీయులు నిస్సహాయుల్లాగా వ్యసనపడ్డారు. కాని కొంత అనంగీకార సూచనకూడా ప్రజల్లో వ్యక్తమైంది. కాని ముఖ్యంగా బ్రిటిష్‌వారితో రాజీ కుదుర్చుకోడానికి ప్రయత్నించడం నిరుపయోగమన్న భావం ప్రజల్లో నాటుకుపోయింది. బ్రిటిష్‌వారు తమ నిరంకుశాధికారంలో అవగింజంతైనా వదల దలచుకోలేదు. ముస్లింలకు చాల మందికి కూడా యిదే భావం కలిగింది.

"ప్రస్తుతపు రాజకీయ వాతావరణంలో భారతీయ స్వాతంత్ర్యాన్ని యెదిరించడానికి యే ముస్లిం నాయకునకు ధైర్యంలేదు. ముస్లింలీగ్ అభివృద్ధి నిరోధక సంఘం. ముస్లింలీగ్ హెచ్చుగా జమీందారుల బలం మీద ఆధారపడివుంది. ఇండియాలోని ముస్లింలలో 95% హిందువుల సంతతివారే. మిగిలిన 5% వారు ఇండియాను దండెత్తివచ్చిన ముస్లిం రాజులతో విదేశాలనుండి వచ్చినవారు. కాని ఆ 5% కూడా—మా కుటుంబముతో సహా—భారతీయ జీవితంలో లీనమైపోయారు. బెంగాల్‌లో హిందువులు, మహమ్మదీయులు కూడా వంగ భాషనే మాట్లాడుతారు. ఇరుమతాల వారు వొకే విధంగా జీవిస్తారు. వారి వస్త్రధారణ గూడా ఒక రకంగానే వుంటుంది. (ఈ విషయాన్ని యిదివరకే గాంధీజీ నాతో చెప్పారు.) మద్రాసు రాజధానిలో హిందువులు, ముస్లింలుగూడా అరవమే మాట్లాడుదురు. మా దేశంలో, గ్రామాల్లో మతవ్యత్యాసాలు చాల కొద్ది. జిన్నాగారికి పాకిస్థాన్ అక్కరలేదు. హిందువులతో వేరం పెట్టడానికి కీలకంగా పాకిస్థాన్ వాదాన్ని జిన్నాగారు వుపయోగిస్తున్నారే గాని నిజంగా పాకిస్థాన్ కావాలనికాదు. ఇంగ్లండు యీ నాటకంలో జిన్నాగారికి సాయపడినది—పాకిస్థాన్ పొలికేకను జిన్నాగారు వుపమోగించుకోడానికి వూతనిచ్చింది" అన్నారు అజాద్‌గారు.

"ఐక్య భారతావనిలో వుండడానికి ముస్లింలకు యిష్టంలేకుంటే వారినెవ్వరూ బలవంతపెట్టరు" అని నెహ్రూ, అజాద్‌గార్లు నొక్కి చెప్పారు.

"కాని వివాహానికి ముందే విడాకులు పుచ్చుకోడంలో నాకు నమ్మకంలేదు. హిందువులు—ముస్లింలు కలసి జీవించడానికి ప్రయత్నించి విఫలులైతే, అప్పుడు విడివడవచ్చు. ముస్లింలలో చాలమంది భారతదేశం ఐక్య రాజ్యంగా నుండాలనే కోరుతున్నారు. అట్టివారు హిందువులు—ముస్లింలు కలసి జీవించి కొంత అనుభవం పొందనిది భారతీయ ఐక్యతను విచ్ఛిన్నం పరచకూడదని నమ్ముచున్నారు" అన్నారు అజాద్ గారు.

* * *

మధ్యాహ్నం మూడు గంటలప్పుడు వున్నట్టుండి గాంధీజీ మా వసతి గృహానికి వచ్చారు. ఆయన వచ్చేటప్పుడు నేను వాకిటివద్దనున్నాను. ఆయన ముఖ కమలం చిరునవ్వుతో వికసించివుంది. నెహ్రూ అజాద్‌గార్లనూ, నన్నూ వార్ధాకు చేర్చినకారు గాంధీగారిని, దేశాయిగారిని తీసుకురావడానికి మరల సేవాగ్రామానికి వెళ్ళింది. వార్ధాకు యింకా మైలుదూరంలో నుండగానే ఆ కారు చెడిపోయింది. గాంధీజీ కారుదిగి ఆ మైలుదూరం, మండుటెండలో—ఆ వేసవి మిట్టమధ్యాహ్న వేళ, వసతి గృహానికి నడచివచ్చారు. మా వసతి గృహం చేరగానే ఆయన యెంతో ఆనందాన్ని పొందారు. గెలుపొందిన వానిలాగ అధిక సంతోషంగా నున్నారు. యంత్ర యుగపు నూతన నిర్మాణాల మీద ఆధారపడితే ప్రయోజనం లేదని అన్నారు.

కొద్ది సేపట్లో గాంధీజీ, నెహ్రూ, అజాద్‌గార్ల సంభాషణ ప్రారంభమైంది. తలుపు తెరచి వుండడంవల్ల నేను లోపలికెళ్ళాను. కాని వారు హిందీలో మాట్లాడుతూన్నందున బయటికి వచ్చాను. తర్వాత కొంత సేపటికి ఇండియాలో అసోసియేటడ్ ప్రెస్ విలేఖరియైన—యువకుడు—గ్రోవర్ గాంధీజీతో సంప్రదించడానికి వచ్చాడు.

"ఇండియా యిప్పుడొక శవంగానుంది. యుద్ధాన్ని జయించడానికి శవమేమి సాయంచేయగలదు? ఇండియాను ముందు బ్రిటిష్ రాజ

కీయ అధికార శృంఖలాల నుండి విడిపించాలి. అప్పుడుగాని స్వయం రక్షణకు తగిన బలాన్ని కోలుకోలేదు" అన్నారు గ్రోవర్‌తో గాంధీజీ.

* * *

రాత్రి 9-30గం॥ వార్ధానుంచి బయలుదేరాను. మాబస వదలే ముందు గాంధీగారు గట్టిగా కరస్పర్శచేశారు. నేను "వెళ్ళివస్తాను" అనగానే "మళ్ళీ ఒకమారు వచ్చివెళ్ళండి" అన్నారు గాంధీజీ.

నేను ఇండియానుంచి బయలుదేరిన ఏడు రోజులలో న్యూయార్క్ నగరం చేరాను. విమాన ప్రయాణం గనుక యింత వేగంగా చేరగలిగాను. నేను స్వస్థలం (అమెరికా) చేరగానే ఒక పత్రికా విలేఖరి గాంధీగారికి "మా వూరు చేరాను" అని ఉత్తరం వ్రాశారా? అని అడిగాడు. ఉత్తరం వ్రాయాలని నాకు తోచనే లేదు.

---

## వ్యాఖ్యానము

నేను సేవాగ్రామం వదలి వచ్చిన తర్వాత రూజ్‌వెల్ట్ అధ్యక్షునికి గాను గాంధీగారు నాకొక ఉత్తరం పంపారు. ఈ ఉత్తరంతో పాటు స్వహస్త లిఖితమైన చీటీ నొకదానిని గూడా పంపారు—"అధ్యక్షుడు రూజ్‌వెల్ట్‌గారికి నేను వ్రాసి, పంపిన ఉత్తరం మీకు నచ్చకున్న దానిని ముక్కలు ముక్కలుగా చింపివేయండి. మరోవిధంగా వ్రాసివుండిన బాగుండునని మీ అభిప్రాయమైన తెలియజేయండి" అని, ఆ చీటిలో వ్రాశారు. గాంధీజీ నిగర్వి.

తన తప్పును తానొప్పుకోడంలో గాంధీజీ నిస్సంకోచి. అందువన బహిరంగంగా తన తప్పులను తాను ఒప్పుకుంటారు. క్రిప్స్ రాయబార విఫలత ఫలితంగా 1942 మే లో గాంధీజీ "ఇండియానుంచి బ్రిటిష్‌వారు వైదొలగాలి" అని ప్రకటించారు. బ్రిటిష్‌వారు తమ సైన్యాలను ఇండియా నుంచి ఉపసంహరించుకోవాలనీ, లేకున్న సహాయ నిరాకరణోద్యమాన్ని తాను ప్రారంభిస్తారనీ గాంధీజీ ప్రకటించారు. కాని జూన్ నెలలో యీ తీర్మానాన్ని మార్పుజేశారు. తన వారపత్రిక 'హరిజన్'లో తన తప్పి దాన్ని ఒప్పుకున్నారు—"నా మొదటి వ్రాతలో (ఇండియానుండి బ్రిటిష్ వారు వైతొలగాలి) కొంత లోప ముండి పోయింది. నాతో సంప్రదించిన మిత్రులనేకులలో నొకరు ఆలోటును చూపగానే నేను సవరణ చేసుకు న్నాను. అహింసను అవలంబించ వలెనన్న నిక్కచ్చిగా నుండాలి. అందు వలన నష్టమొచ్చినా సరే నిక్కచ్చి—సత్యం అహింసావలంబకునకు అత్యవసరము. అందువలన ప్రజాబాహుళ్యం గూడా నా తప్పును సహించాలి. ఇది నాలో నొక బలహీనతగావచ్చు. అట్టిదానిని గూడా ప్రజలు సహించాలి. మిత్ర రాజ్యాల ఓటమికి కారణంకాగల చర్యను మిత్రరాజ్యాలు చేయాలని నేను కోరను..............ఇండియానుంచి.

హఠాత్తుగా, మిత్రరాజ్యాల సైన్యాలు ఉపసంహరింపబడిన జపాన్ ఇండియా నాక్రమించవచ్చు. తత్ఫలితంగా చైనా రూఢిగా జపాన్‌కు లొంగిపోవచ్చు. నా చర్య ఫలితంగా అట్టి విపత్తు కలుగ వచ్చునన్న భావం నాకు ఆవంతయైనా లేదు. కనుక భారతదేశాన్ని విడిచి వెళ్ళాలన్న నా ప్రతిపాదనను మిత్రరాజ్యాలు ఆమోదించి గూడా, జపాన్‌వారు ఇండియా నాక్రమించకుండా అడ్డగలందులకు మిత్రరాజ్యాలు ఇండియాలో వుండడం అవసరమని వారు భావిస్తే అట్లే వుండవచ్చు.........."

* * *

సాధారణంగా రాజకీయ వేత్త తాను పదవిని సంపాదించనో, లేక తన ప్రతిపాదనలను అమలు నందుంచనో ఎన్నో వాగ్దానాలు చేస్తాడు— శాంతిని నెలకొల్పను ప్రయత్నిస్తాడని, అభివృద్ధికి దోహద మివ్వగలడని, తక్కువ పన్నులు-ఎక్కువ లాభాలని, ఒకటేమిటి చంద్రుని, నక్షత్రాలను గూడా అరచేతిలోకి తెస్తానని మాటయిస్తాడు. అందుకు బదులు ప్రజా బాహుళ్యం అతనికి సాయపడాలి; ప్రజలు సాయపడితేనే యివన్నీనూ. గాంధీజీ జీవిత పరమావధి తనమాతృదేశ స్వాతంత్ర్యం. అందువలన ఇంగ్లండుకు, ప్రపంచానికిగూడా తన జీవిత పరమావధి సాధింపబడిన ఇండియాలో అన్నివిషయాలు చక్కగానే సాగుతవని చెప్పాలి. సాధారణ రాజకీయవేత్త అయిన అపనేచేస్తాడు. అందుకు బదులుగా "బ్రిటిష్‌వారు ఇండియానుంచి వైతొలగగానే శాంతి, క్రమపద్ధతి యేర్పడు తుందని రూఢిగా చెప్పలేను. కొంత అశాంతి కలుగవచ్చు" అంటున్నారు గాంధీజీ. "బ్రిటిష్‌వారు క్రమపద్ధతిని వెళ్ళిపోవాలి. ఇండియాను దేవునికి వదలివెళ్ళాలి. ఈ ఊహామయమైన భాషలో నేను చెప్పడం మీకు నచ్చ కపోవచ్చు. అట్టిపరిస్థితిని మీరు అరాచకం అనవచ్చు. అంతకన్న మితి మీరిన పరిస్థితి యేదీ కలుగదు. కాని, అరాజకం యేర్పడకపోవచ్చు. 'అరాజకం యేర్పడకుండా అడ్డడానికి ప్రయత్నిస్తాం" అంటారు గాంధీజీ. ఈ మాటల నాధారం చేసుకొని గాంధీజీని ఖండించేవారు "బ్రిటిష్‌వారు

ఇండియాను వదలివెళ్ళిన దేశంలో అశాంతి యేర్పడుతుందని గాంధీయే అంటున్నారు" అని వాదిస్తారు.

* * *

బ్రిటిష్‌వారు భారతీయులచేతికి అధికారాన్ని అప్పగించగానే భారతీయ సైన్యాన్ని రద్దుచేయాలని గాంధీజీ అంటారు. కాని ఒక్క క్షణం ముందు "సహజంగా యేభారతీయుడుగాని వ్యక్తిగతంగా యుద్ధప్రయత్నానికి తను సహాయంచేయవచ్చు. యుద్ధయత్నంలో సైనికుడుగా చేరవచ్చు. లేదా డబ్బు సహాయం చేయవచ్చు" నని వ్రాశారు. మరొకప్పుడు "కోట్లాదిగా నున్న భారతీయులలోనుంచి అసంఖ్యాకులైన సైనికులను తరిఫీదుచేయను వీలులేదా? ప్రపంచంలోని యితరసైనికులంత నేర్పరులు కారా వీరు?" * అని వ్రాశారు. ఈ వ్రాతలన్నిటికి అర్థమేమిటి? గాంధీజీ తాను చెప్పినదానినే మరల ఖండించుచున్నారా? కాదు, కాదు. భారతీయ సైన్యాన్ని రద్దుచేయాలనే గాంధీజీ కోర్తున్నారు. ప్రస్తుతం భారత సైన్యంలో చేరినవారు దేశభక్తివల్లగాని, రాజభక్తివల్లగాని చేరినవారు కారు. కేవలం కూటి ఆశకో, ప్రభుత్వ ఒత్తిడిపైననో చేరిన వారే. ప్రస్తుతంవలె గాకుండా ఇండియా తన జాతీయ సైన్యాన్ని యేర్పాటు చేయగలదని గాంధీజీ అభిప్రాయం. ఈ ఒక్క నిదర్శనం చాలు, గాంధీజీ భావాలను విమర్శకులు యెలా అపార్థం చేస్తున్నారని గమనించడానికి.

* * *

గాంధీజీతో సంప్రదించడం అత్యంత ఆనందకరమైన విషయం. నిజంలో ఆయన, తనతో సంప్రదించేవారికి, తన హృదయాన్ని తెరచి, లోపలి యంత్రం యెలా పనిచేస్తూన్నది విస్పష్టంగా చూపుతారు. సాధారణంగా యితరులతో మాట్లాడేప్పుడు, చాలమంది, యితరుల విమర్శలకు పాలుగాకుండేట్లు తమ భావాలను పూర్తిగా మనసులోనే కుదుర్చుకొని,

* "హరిజన్" ఆగస్టు 6, 1942.

చక్కని స్వరూపాన, బయల్పరుస్తారు. గాంధీజీ అలాచేయరు. తన యోచనాశక్తిలోని ప్రతిమెట్టును అప్పటికప్పుడు బయల్పరుస్తారు. రచయితతాను రచించిన రచన మొదటి నకలును, రెండవ నకలును, మూడవ శుద్ధప్రతిని—అన్నింటిని ప్రచురించి నట్లుంటుంది, గాంధీజీ భావ పరంపరలను బయల్పరచడం. మొదటి నకలుకు, రెండవ నకలుకు పోలికే లేదని, రెండవ నకలుకు శుద్ధప్రతికి సామ్యమే లేదని పాఠకులు అనవచ్చు. కథే అడ్డంతిరిగిందని అనవచ్చు. ప్రజాహృదయాన్ని చూరగొన్న కథానాయకుడు దొంగగా మారినా డనవచ్చు. కాని గాంధీజీ యీ మాటలను చెవిని వేసుకోరు. "అవును. నా మనస్సును మార్చుకున్నాను" అంటారు.

నిజంలో గాంధీజీ యోచనలే మనకు విస్పష్టంగా వినబడుతుంటవి. ఆయన యోచనా పరంపర లెలా పరుగిడుచున్నాయని మనం స్పష్టంగా చూడవచ్చు. ఈ యోచనా విస్పష్టత కొందరిని కలత బరుస్తూన్నది. అందువలననే కొందరు "గాంధీజీ అసందిగ్ధంగా మాట్లాడుతూన్నారు" అని అంటారు. మరికొందరు "గాంధీజీ మోసగాడు" అని అంటారు. ఇతరు లేమంటారని గాంధీజీ లెక్కజేయరు. 'ఇతరులు మనల గురించి యేమనుకుంటారో' నన్న భావమే ఆయనలో లేదు. బహుశ యిందుకు కారణం ఆయన వృద్ధాప్యం—ఆయన స్వార్థరాహిత్యం కావచ్చు. నేను కలుసుకున్న అనేకులు భారతీయులు, ఇండియాలోనున్న అనేకులు ఆంగ్లేయులు, తాము నాతో చెప్పిన మాటలు ప్రచురింప బడగూడదని నిష్కర్ష చేసేవారు. నేను తన్ను గురించి యేం వ్రాస్తానో అని గాంధీజీ యెన్నడూ కలవర పడలేదు. నేను తన మాటలను సక్రమంగా వినియోగిస్తానా? లేక, వాటినుండి అపార్థాలను తీస్తానా? అని గాని ఆయన ఆందోళన చెందలేదు. గాంధీజీ <u>నాతో</u> మాట్లాడారు. <u>నాకేసి</u> మాట్లాడలేదు. ముస్లిం లీగు అధ్యక్షులైన మహమ్మదాలీ జిన్నాగారితో కొన్ని గంటలు యిష్టాగోష్టిని గడిపాను. ఆయన చక్కని వక్త; చర్చలలో అతి నిపుణుడు. రాజకీయ

వేత్తగా గొప్ప నిక్కచ్చి గలవాడు. కాని ఆయన నాకేసి మాట్లాడారు. ఆయన మాటలన్నీ గూడా నన్ను ఒప్పించనే మాట్లాడారా? అనిపించినవి. నేను వారినేదైన ప్రశ్నించిన వెంటనే వారి జవాబు, గ్రామఫోను ప్లేటు లాగా, ఒకే పాతఫక్కీన వుండేది. ఆ జవాబు నేను యింతకుముందు విన్నదే. లేదా, వారు నాకిచ్చిన వారి వ్రాతలలో చదువుకొన దగిన జవాబే.



ఫిషర్ - జిన్నా

కాని గాంధీగారిని ఏదైనా ప్రశ్నించినప్పుడు ఒక సృష్టిశక్తిని, ఒక యోచనా శక్తిని ప్రారంభించినట్లు తోచేది. ఆయన మనస్సు పనిచేయడం నేను చూడగలిగాను—వినగలిగాను కూడాను. కాని జిన్నాగారి విషయంలో, సూది రికార్డుమీద రాచుకోడం మాత్రమే వినగలిగాను. తన తీర్మానాలను, తుదిభావాలను, నిర్ణయాలను మాత్రమే జిన్నాగారు చెప్ప గలిగారు. కాని గాంధీగారు తాము నిర్ణయానికి యెలా వస్తున్నారా ? అని ఆయన భావాలు నడిచే బాటనే నేనూ ప్రయాణం చేయగలిగాను. అందు వలననే జిన్నాగారి కంటే గాంధీజీతో సంప్రదించడం యెక్కువ ఉద్రేక కరంగా, ఉత్సాహకరంగా వుంటుంది. గాంధీజీని మనం సరియైన ప్రశ్న

అడిగిన. వారిలో కొత్త యోచనను ప్రారంభించిన వాళ్ళమౌతాము. గాంధీజీతో సంప్రదించడం కొత్త దేశాలను కనిపెట్టను చేసిన ప్రయాణం లాగా వుంటుంది. ఆయన చెప్పే కొత్తకొత్త విషయాలను, భావాలను చూచి ఒకొక్కప్పుడు ఆయనకే ఆశ్చర్యం వేస్తుంది. నేను గాంధీజీతో మాట్లాడుచున్నప్పుడు మాతో నున్న ఆయన కార్యదర్శులు ఆయన నూతన భావాలను విని, తరచు, ఆశ్చర్యపడేవారు. అందువలననే గాంధీజీ నుంచి—ఆయనను గురించి యెంతో నేర్చుకోగలిగాను. ఆయన కేవలం అభిప్రాయాలను, విషయాలను మాత్రం చెప్పారు గారు. తన్ను తానే తెలియజేశారు. తన్ను ఖండించను అవసరమైన సామగ్రినంతనూ గాంధీజీయే సమకూరుస్తారు. ఒక్క నిదర్శనం—గాంధీజీ సోమవారం నాడు మౌనవ్రతానికి లేనిపోని దివ్యత్వాన్ని తాను ఆపాదించారని అన్నారు. ఈ విషయం నాతో చెప్పడం కేవలం అనవసరం. కాని ఆయన స్వభావమది. ఆయన దృష్టిలో ఇది చెప్పదగినది—యిది చెప్ప తగనిది అంటూ యేదీ లేదు. ఆయన తన ఆలోచనలను సరిచూచు కోరు. కొందరు రాజకీయ వేత్తలకు ఆయనంటే ఆశ్చర్యం—ఆయాసం గూడాను. ఉదాహరణానికి ఆయన అన్న విషయాన్ని ఒకదానిని గమ నిద్దాం—"నాకు అవకాశం కలిగితే నేను జపాన్‌కు వెళ్ళి యుద్ధాన్ని అంత్య మొందించను ప్రయత్నిస్తాను" అన్నారు. కాని ఆయనే యెరుగు-తనే వెంటనే అంటారుగూడానూ—"నాకు అట్టి అవకాశం దొరకదు. నేను వెళ్ళినా జపాన్ సంధిచేసుకోదు." ఈ విషయం తెలిసిగూడా తాను జపానుకు వెళ్తానని యెందుకనాలి ? తాను అనుకున్నారు గనుక, తనకు తోచింది గనుక అన్నారు.

అహింసా వాది గనుక యుద్ధాన్ని ఆపడం ఆయనకెంతో ఆశ. ఈ ఆశ యెన్నటికీ నెరవేరదన్న విషయం ఆయనా యెరుగు. కావి తన ఆశను బయల్పరచడానికి యీ యెరుక అడ్డురాదు.

ఒకొక్కప్పుడు అసంభవమైన విషయాలను చర్చించడంలో

గాంధీజీకి ఆనందముంది. ఆధునిక యంత్రయుగ పరిశోధనలను ఆయన యేవగించుకుంటారు. కాలచక్రాన్ని వెనుకకు త్రిప్ప వీలులేదని ఆయనకు తెలుసు. మోటారుకార్లను రూపుమాపడం వీలైన పనిగాదని ఆయన యెరుగును. కాని మోటారుకార్లను జూచి నవ్వగలరు. ఫెడరల్ ప్రభుత్వం అనవసరమని గాంధీజీవాదన. ఫెడరల్ ప్రభుత్వం యేర్పడ కున్న కలిగే సాధక, బాధకాలను చెప్పినగూడా ఆయన వొప్పుకోరు. ఫెడరల్ ప్రభుత్వ అవసరాన్ని గురించి హెచ్చుగా వాదించిన ఆఖరుకు యిలా అంటారు—"నా అభిప్రాయా లెలావున్నా కేంద్రప్రభుత్వం యేర్పడుతుందని నే నెరుగుదును."

ఈ విధంగా ప్రతివిషయాన్ని తర్కించడం, చర్చించడం గాంధీజీ స్వభావం. ఒక సిద్ధాంతాన్ని ఉపపాదించడం, దానిని బలపరచడం, ఆఖరుకు ఆ సిద్ధాంతం ఆచరణయోగ్యం కాదని వొప్పుకోవడం—యిది గాంధీగారి మార్గం. ఆయన మనస్సు యెప్పుడూగూడా మార్పుకు అనుకూలంగానుంటుంది. కార్య సాధనకు ఆయన పూనుకున్నప్పుడు ఆయనలో నిరంకుశత్వం కొంత కనబడుతుంది. తన వాదనతో, ప్రజాబాహుళ్యంలో తనకుగల పలుకుబడితో యెదిరిని అణచి వేయగలుగుతారు. ఆయన యోచనాశక్తిలో నిరంకుశులకున్న కుంచితత్వంలేదు. నిరంకుశులెవ్వరూ తాము తప్పు చేశామని ఒప్పుకోరు. కాని గాంధీజీ తన తప్పును తాను వొప్పుకోగలరు—అనేకమార్లు వొప్పుకున్నారు గూడాను.

* * *

గాంధీజీ చాలవరకు హిందువే. హిందూమతం చాల సహనత గలది. స్పాంజిలాంటిది. హిందువులు దేవుడు ఒక్కడే అని నమ్ముతారు. వారిలో కొందరు క్రీస్తును పూజించే వారున్నారు. కొందరు నాస్తికులు: వారు దేవుడులేని జీవిత విధానమే హిందూమతమని అంటారు. కొందరు విగ్రహారాధకులు. పర్వతాలను, నదులను, మానవులనుగూడా కొందరు దేవుళ్లగా పూజిస్తారు. దేవుడొకడే అన్న నమ్మకానికి, విగ్రహా

రాధనకుగల అసందిగ్ధత వారికి అగుపడదు. ఒక భారతీయుడు నాతో యిలా అన్నాడు—"నయాగరా జలపాతాలు భారత దేశంలోనుంటే అవిగూడా దేవుళ్లగా పూజంపబడేవే." హిందువుల స్వర్గంలో జనం క్రిక్కిరిసియున్నారు. కాని గాంధీజీకి అచ్చట స్థలం ప్రత్యేకింపబడి యున్న దని అనేకమంది హిందువుల ధృడవిశ్వాసం.

*    *    *

గాంధీజీని గురించి భారతీయులలో సామాన్యాభిప్రాయం ఆయన తన జీవితాన్ని ప్రజోపయోగానికి వినియోగిస్తున్నారని. సామాన్య భారతీయునివలె జీవిస్తున్నారాయన. భారతీయులలో నిరుపేదలైనవారి జీవితాన్నే తానూ అనుభవిస్తున్నారు. వారి పేదరికాన్నిగూడా తాను అనుభవిస్తున్నారు. ఆయనకు డబ్బులేదు. ఆస్థిలేదు. ఆయనకు కావలసిందిఒకటేఒకటి-భారతీయ స్వాతంత్ర్యం. కోట్లాది భారతీయుల ఆశయంగూడా భారతీయ స్వాతంత్ర్యమే గనుక, భారత జాతీయ ఆశయాల సాధనకు గాంధీజీ అధినాయకులైనారు.

*    *    *

బ్రిటిషువారిని భారతీయులు విమర్శించడం ఇండియాలో సర్వసామాన్యం. ఇట్టి విమర్శలు విన్నప్పుడు ఆవ్యక్తి యెందువలన బ్రిటిష్ వ్యతిరేకియో చెప్పమని పట్టుబట్టేవాణ్ణి. కేంద్రప్రభుత్వంలో ఉన్నతోద్యోగంలోనున్న ఒక ముస్లింను నేను యీ ప్రశ్న అడిగాను—"ఎందువలన భారతీయులు యింతమంది బ్రిటిష్ వ్యతిరేకులుగా నున్నారు?"

"మీరెందువలన బ్రిటిష్ వ్యతిరేకులుగా నుండగూడదు? అన్న ప్రశ్న యెక్కువ సమంజసంగా నుంటుంది" అని ఆయన జవాబిచ్చారు. "ఏ జాతికిగాని, యే ప్రజకుగాని తన్ను పరిపాలించే విదేశీయుడంటే గిట్టదు" అని అన్నారాయన.

*    *    *

గాంధీజీ శిష్యులలో మహమ్మదీయులు, హిందువులు, పార్సీలు,

హరిజనులు కూడానున్నారు. వారందరికి ఆయనలో అపరిమిత విశ్వాసం. ఏ యితర వ్యక్తికన్నా హెచ్చుగా గాంధీజీ యేండ్ల పర్యంతం మాతృ దేశ స్వాతంత్ర్య లబ్ధికి పాటుపడడమే యిందుకు కారణం. అనేక విషయా లలో గాంధీజీతో ఆయన శిష్యులే యేకీభవించరు. ఆయనకూ వారికీ యెన్నో విషయాలలో భిన్నాభిప్రాయా లున్నాయి. గాంధీజీ హిందూ రాజ్యాన్ని స్థాపించ ప్రయత్నిస్తున్నారని ఆయనమీద నేరాన్ని ఆరోపించే ముస్లింలు కొందరున్నారు. కాని గాంధీజీ భారతీయ స్వాతంత్ర్యానికి ధృఢ నిశ్చయంతో పాటుబడలేదని చెప్పగలిగే ముస్లింలెవ్వరూ లేరు. ఆధునిక చరిత్రలో జాతీయ రాజ్య స్థాపనకు మానవులలో సహజమైన ఆశ యేర్పడి నది. ఈ ఆశయాన్ని అతి సునిశితంగా వుపపాదించిన వారిలో అగ్ర గణ్యుడు గాంధీజీ.

* * *

సేవాగ్రామంలో తన కుటీరంలో కూర్చుని, తనకు వచ్చే ఉత్తర ప్రత్యుత్తరాలను చదువు కుంటూనే, తనతో సంప్రదింప వచ్చిన భారతీయు లతో మాట్లాడుచునే భారతీయ ప్రజాహృదయాన్ని గ్రహించగలనని, భారతీయ ప్రజారోదనను వినగలనని గాంధీజీ నమ్మకం. భారత ప్రజక్షేం గావాలో తానెరుగు గనుక వారి తరఫున తానుకార్యసాధనను సాగించ గలనని ఆయన విశ్వాసం. గాంధీజీ భారతదేశంలో లీనమైపోయారు. ఆయనలోని పంచప్రాణాలూ భారతీయ ప్రజావాణిని * వింటూనేవుంటవి. గాంధీజీ సదా ప్రజాహృదయాన్ని వింటూనే వుంటారు. ఈ ప్రజా హృదయాన్ని సక్రమంగానే తాను అర్థం చేసుకుంటున్నారని, ప్రజల ఆశయాలను సరియైన మార్గాననే ఉపపాదించు చున్నారని ఆయన నమ్మకం. ఈ ధృఢ విశ్వాసమే ఆయనకు మార్గదర్శిగా నున్నది. ఆర్థిక, సాంఘిక విషయాల గురించి గాంధీజీకి సందేహా

* ఆకాశవాణిలోని శబ్దాన్ని శబ్దగ్రాహక యంత్రం ఆతురతతో ఆకర్షించి నట్లు.

లుండవచ్చు. కార్యక్రమాన్ని, కార్యసాధన మార్గాలను మార్చడానికి గాంధీజీ అంగీకరిస్తారు. కాని ముఖ్య సమస్యయైన భారతీయ స్వాతంత్ర్యం విషయంలో అణుమాత్రమైన మార్పుకుగాని, రాజీకిగాని, లొంగుబాటుకుగాని గాంధీజీ వొప్పుకోరు. భారతీయ స్వాతంత్ర్య సాధన నిమిత్తమే గాంధీజీ జన్మించారని భారతీయులంటారు. అందు నిమిత్తం తన ప్రాణాన్ని అర్పించడానికి ఆయన సిద్ధంగానున్నారు. భారతీయులకు లెఖ్ఖకువచ్చే సద్గుణాల్లో త్యాగం, స్వార్థరాహిత్యం ముఖ్యమైనవి.

* * *

ప్రపంచంలోని ప్రజలందరిలో భారతీయులు అత్యంత ధర్మప్రవర్తనులు. గాంధీజీ బుద్ధికుశలత, తెలివితేటలు, ధార్మికత్వం భారతీయులకు బాగా నచ్చినవి. ఆయన గొప్పదనానికి యిది ఒక కారణం. కాని ప్రజాబాహుళ్యానికి సులభంగా గ్రాహ్యమయ్యే మరో గొప్పదనముంది ఆయనలో—ఆయన ప్రకటిస్తూన్న జాతీయవాంఛ: ఆ వాంఛాసిద్ధికి విధి, విరామములేక ఆయన పడుచున్నపాట్లు. అహింస యందలి నమ్మకమున కన్నా గూడా ఆయనలో జాతీయ స్వాతంత్ర్య వాంఛయే ప్రధానమై యున్నది. నెహ్రూ, అజాద్, రాజగోపాలాచారిగార్లవంటి అహింసావాదులు గానివారితో అత్యంతమైత్రి, సహకారాలతో సహచరుడుగా గాంధీజీ పాటుబడగలరు. కాని భారతీయ స్వాతంత్ర్యానికి విముఖులైన వారితో సహకరింపజాలరు.

* * *

స్వాతంత్ర్య సిద్ధికై చేయుప్రయత్నాలలో గాంధీజీకి, భారతదేశంలోని కోట్లాది ప్రజలకు, కంటికగుపడని, సన్నిహితత్వం యెంతోవుంది. ప్రజలతో సన్నిహితత్వం గొప్పప్రజానాయకులందు తప్పక వుండాలి. వారి గొప్పదనానికి యిదే మూలం. ఈ ప్రజా సన్నిహితత్వాన్ని విన్‌స్టన్ చర్చిల్ తన ఉపన్యాసాలలో ప్రదర్శించాడు. సాధారణ ఆంగ్లపౌరుడు తనలో అనుకునే విషయాలనే, లేక ముతకగా తన యిరుగు పొరుగు

వారితో చెప్పే విషయాలనే చర్చిల్ విస్పష్టంగా, విపులంగా ప్రకటిస్తాడు.

సాధారణంగా మన భావాలను మనకన్న హెచ్చు తెలివితేటలతో, నేర్పుతో ప్రకటించే వారినే మనం నాయకునిగా అనుసరిస్తాం. ఆనాయకుడు మన ప్రతిబింబమైయుండాలి. మనలను ఆయనయందు మనం చూడగలగాలి. అన్నివిధాల ఆయన మనకంటే ఉత్తముడుగానూ వుండాలి. జాతీయ స్వాతంత్ర్య సాధనద్వారా గౌరవాన్ని, అభివృద్ధిని అనుభవించి ఆనందించాలనే కోట్లాది భారతీయులకు—తినతిండి, కట్టబట్టలేక, తెలివితేటలులేక, రైతు, శ్రామిక వర్గాలకు చెందిన భారతీయులకు—గాంధీజీ పరమ ఆప్తుడుగా నున్నారు. ఆయనను సోదరునివలె, తండ్రివలె ప్రేమించి, గౌరవించేవారు కోట్లమంది భారతీయులు గలరు. వారిలో గాంధీజీ ఒకభాగం. 'ఆ కోకలోదే యీ పేలిక' అన్నట్లు ఆకోట్ల భారతీయులలో నొకరే గాంధీజీ. పర పరిపాలనను, విదేశీయుల దౌష్ట్యాన్ని సహించలేక వేపగించుకునే భారతీయులు, అందున మేధావులు, లక్షలాదిగానున్నారు. వీరిలో కొందరు ధనికులుగూడాను. గాంధీజీ వీరిప్రార్ధనలనుగూడా ఆలకిస్తూన్నారు—ఆదరిస్తున్నారు.

గాంధీజీ జీవితమంతా ఒక్కబాటనే నడిచింది—ఆయిన కోరేదల్లా స్వతంత్రభారత మొక్కటే. ఒక్కటే ఒక్క ఆశయాన్ని జీవిత పరమావధిగా కలిగియుండడంగూడా గొప్పవాని లక్షణమే. చర్చిల్ యొక్క మహదాశయం—ఏకైక ఆశయం బ్రిటిన్‌ను గొప్పసామ్రాజ్యంగా, అగ్రరాజ్యాల్లో నొకటిగా నిలబెట్టడమే. రష్యాను మధ్యయుగపు జమీందారి పద్ధతినుంచి బయటికి లాగడమే లెనిన్‌యొక్క మహదాశయం. అబ్రహాం లింకన్‌యొక్క మహదాశయం అమెరికాను సంయుక్త రాష్ట్రంగా నిలబెట్టడం. హిట్లరుయొక్క మహదాశయం ప్రపంచాన్ని జయించడం. చక్కని శిలావిగ్రహాల్లాగా, గొప్పవారంతా ఒకటే ధకంగా నుంటారు.

---

# మా ఏజన్సీ షరతులు

(1) మా ఏజంట్లుగా వ్యవహరింప దలచుకున్నవారు రూ. 10-0-0 డిపాజిట్ కట్టాలి. ఈ డిపాజిట్‌ను పన్నెండు మాసాలు పూర్తిగానిది వాపసు యివ్వము.

(2) ఏ ఒక్క నగరానికిగాని, పట్టణానికిగాని మా సోల్ ఏజన్సీ యివ్వగలము. సోల్ ఏజంట్లు రూ. 100-0-0 డిపాజిట్ కట్టి వుంచాలి. రెండేండ్లు పూర్తిగానిది యీ డిపాజిట్ వాపసు యివ్వ బడదు. మా సోల్ ఏజెంట్సు వున్న వూరిలో మరెవరికి మా ప్రచురణల నంపము. మా ప్రచురణలు ప్రతి రకానికి పాత, కొత్తవాటిని 100 కాపీలు కొనాలి.

(3) మా ఏజంట్లకు సాధారణంగా 25% కమీషను యివ్వగలం. కాని కొన్ని ప్రచురణలకు (Specials) 15% కు హెచ్చు కమీషను యివ్వ లేము. పార్సెలు ఖర్చులు ఏజంట్లే భరించాలి. పాకింగ్, తపాలా ఖర్చులు మేము భరింతుము.

(4) అప్పు లివ్వము. ఏజంట్లకు మాత్రం వి. పి. లకు గాని, బ్యాంకు ద్వారా గాని పంపగలము. ఇతరులు ముందుగా డబ్బు పంపాలి.

(5) మా ప్రచురణలను రకానికి 20కు తగ్గకుండా 25కు మించకుండా అన్నిటినీ ఒకే మారు తెప్పించుకున్నవారికి 33⅓% కమీషను యివ్వ గలము. ఖర్చులు వారివే.

(6) మా నూతన ప్రచురణల గురించి మా ఏజంట్లకు ముందుగా తెలియ జేయగలము. అప్పుడప్పుడు మా ప్రచురణలలో మా ఏజెంట్ల పేర్లు ప్రచురింపగలము. ఇతరులు రిప్లయి కార్డు వ్రాసినగాని బదులివ్వలేము.

(7) చెక్కులుగాని, డ్రాఫ్టులుగాని పంపేవారు క్రాస్ చేసి పంపాలి. మద్రాసు లోని బాంకులలో రొఖ్ఖం చేసుకోను అయ్యే కమీషను ఏజంట్లే భరించాలి.

(8) అనంతపురం నవ్యసాహిత్యమాల వారికి మేము సోల్ ఏజంట్సుము. వారి ప్రచురణలు మావాద్ద తప్ప మరెచ్చట దొరకవు.

# వాత్స్యాయన కామసూత్రములు

బ్రహ్మశ్రీ పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారు
విశేషముగా కృషిచేసి, ప్రచురించిన
మహత్తర గ్రంథ మిదియే.



ఈ 728 పేజీల ఉద్గ్రంథంలో మూల శ్లోకములు, ప్రతి పదము సామాన్యులకు గూడా అర్థమయ్యేలా ప్రతిపదార్థము, తాత్పర్యము, తెనుగు వాఖ్య, వీలైనచోట్ల ఆంధ్ర రతి రహస్య గ్రంథములనుండి శ్లోకమున కనువైన పద్యములు వున్నాయి. ప్రతి ఆంధ్రుడు, ముఖ్యముగా వివాహితుడు, తప్పక చదువవలసిన గ్రంథరాజము.



అసలు ధర ప్రతి 1 కి రూ 20/- { మావద్దనున్న పాతబడిన కాపీలు ప్రతి 1కి రూ 10/-

తపాలా ఖర్చు ప్రత్యేకము రూ. **1-0-0**

---

వివరములకు :—

కల్చరల్ బుక్స్ లిమిటెడ్

పెరంబూరు పోస్టు :: మద్రాసు 11.

# ప్రపంచ చరిత్ర



(Glimpses of World History)

రచన : జవహర్‌లాల్ నెహ్రూ.

ఆంధ్రీకరణం : చింతా దీక్షితులు.

ఈ గ్రంథ రాజమును తెనుగులో నాలుగు భాగములుగా, మూడు నెలల కొకభాగము చొప్పున, ప్రచురింపనున్నాము. ఒక్కొక్క భాగమునకు సుమారు 400పుటలుండును. భాగమొకటికి రూ 4-0-0 వెల. మొదటి భాగము శ్రీ నెహ్రూగారి జన్మదినోత్సవము నాడు (14-11-46)వెలువరచ వలెనని ప్రయత్నించితిమి గాని వీలగునట్లు లేదు. బహుశ 1947 జనవరిలో మొదటి భాగమును ప్రచురింపగలము. 1-11-46 లోపున రూ 4-0-0 మనియార్డరు పంపిన వారికి, తపాలా ఖర్చులు మేమే భరించి మొదటి మూడు భాగములు రూ 4/-చొప్పున వి. పి. లకు పంపగలము. కడపటి భాగమునకు అడ్వాన్సు రూ 4/-చెల్లుబెట్టుకొని రిజిస్టర్ బుక్ పోస్టు ద్వారా చేర్చగలము.

గ్రంథ విక్రేతలకు 12½% కమీషను మాత్రమే, మా ఏజంట్లకు 15% కమీషను యివ్వబడును.

**వివరములకు :**

కల్చరల్ బుక్స్ లిమిటెడ్

పెరంబూరు పోస్టు :: మద్రాసు 11.

---

GANDHI THO VOKA VARAM *by Louis Fischer*

**Price Re. 1—8—0**